# భారతి

సాహిత్య మాసపత్రిక





సంపాదకుడు

**శివలెంక శంభుప్రసాద్**




**ఏప్రెల్ 1957**




సంపుటము 34 : : సంచిక 4

విడిపత్రిక వెల ఒక రూపాయి

మణి సంగతి, పనిమనిషి కూతురు పుల్లాలు సంగతి, క్లబ్బుల్లో జాగరణ విషయం, పోలీసుల వంశపారం పర్యం చుట్టం అయిన రామదాసు స్నేహం విషయం—ఇవన్నీ తనకు ప్రక్క యింటి బాల వితంతువు బంగారమ్మ చెప్పింది గానీ లేకపోతే తానూ మోసపోయేదేమో. అమ్మకు డబ్బు కావాలి! ఊళ్ళో చుట్టరికం కావాలి. ఏమీ కాకుండా బావగారై కూర్చున్న రామారావుకు "ఈ పెళ్ళి భలావారివల్ల అయింది" అన్న ఘనత కావాలి! ఇంతే తప్ప తన పాట్లు ఎవరికీ అక్కర లేదు!......"

"ఏమిటే అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు!" అన్న కాంతం మాటలతో అప్పుడు తానెక్కడ నున్నదీ గురుతుకొచ్చింది వరలక్ష్మికి! లేని-రాని-నవ్వు తెచ్చిపెట్టుకొని మాట మార్చేసింది వరలక్ష్మి!

"నీ కూతురు సంగతే ఆలోచిస్తున్నాను."

"ఏమని?"

"నీకంటే కూడా గడుసుదిక దా అని."

"ఏమంటుందేమిటి?"

"నాకు మల్లె అంటు వుందట! తనకు కూడా వేరే కావాలట!"

"అవునా సుధా" నవ్వుతూ అడిగింది కాంతం!

అంతవరకూ తనకేమీ సంబంధం లేదన్నట్లు చూస్తూ వూరుకొన్న సుధ "అమ్మా! నాకు కావాలే!" అంటూ వరలక్ష్మి దంక దిగి కాంతం కాళ్ళకు పెనవేసుకొంది!

"ఆ మల్లెపందిరి మనదేనమ్మా! పిన్నిదీ మనదీ ఒకటే."

"కాదే! నాకు కావాలి" మారాము చేసింది సుధ!

"గారం చేయకు దెబ్బలు తింటావు" కసిరింది కాంతం. టక్కు మొగం పెట్టి వరలక్ష్మి వంక చూచింది సుధ! ఆ ముఖంలో—ఆ చూపులో—ఆనాడు దేవాలయంలో "క్షమించు లక్ష్మీ" అన్నప్పటి ఆ ముఖం—ఆ చూపు తళుక్కు మన్నాయి. "చాల్లే! ఊరుకో అక్కా! చంటి పిల్లనలా కసిరేస్తావు" అంటూ సుధను దగ్గరికి తీసికొంది.

"దానికా బుద్ధి యేమిటి చెప్పమరి! నిండా నాలుగేళ్ళు లేవు. ఇప్పటినుంచీ నీదివేరు నాదివేరు అంటుంది." ఈసారి టక్కు మొగం యేడుపు ముఖంలోకి మార్చి రాగం ప్రారంభించింది గారాల సుధ! దంక నెత్తుకొని అనునయించింది వరలక్ష్మి!

"ఏడవకు సుధా! నీకు వేరే మల్లె పందిరి కట్టిస్తానులే"

"ఎప్పుడు?" ఎక్కడకు పోయిందో ఆ యేడుపంతా!

"సాయంకాలం యెండ తగ్గాక".

ఇంతలో వీధిలో సినిమా పేపరు బండి దప్పు వినబడగానే సుధ వీధిలోకి పరిగెత్తింది!

"అక్కా! రెండు రోజుల్లో వేసవి సెలవు లిస్తారు కదూ మీ యింటికి వెళతారా"

"వెళ్ళాలనే అనుకొంటున్నాం!"

"ఎప్పుడు?"

"నాలుగు రోజులు పోయాక"

వరలక్ష్మికి యేదో జ్ఞాపకంవచ్చింది! అలా చూచే టప్పటికి రామారావు వ్రాస్తున్న రతీ మన్మథ చిత్రం కనిపించింది! ఏదో ఆలోచిస్తూ అలాగే శూన్య దృక్కులతో చూస్తూ వుండిపోయింది. కాంతం నవ్వి అన్నాది:

"ఏం చెల్లెలా! బొమ్మనుచూచి మైమరచి పోతున్నావు మీ బావగారితో చెప్పనా త్వరలో ముహూర్తం పెట్టించమని."

"చాల్లే ఊరుకోండూ" అంటూ వయ్యారంగా వెళ్ళిపోయింది వరలక్ష్మి! వెళుతూవున్న వరలక్ష్మిని చూస్తూవుంటే కాంతానికి—అర్జునుడు దొంగతనంగా తీసికొచ్చిన సుభద్రను చూచినప్పుడు ద్రౌపదికి కలిగిన భావంలాంటి—అవ్యక్తానురాగభావం—ప్రేమాదరణ సమైక్యభావం కలిగింది.

"వరలక్ష్మి నిజంగా నా చెల్లెలే అయితే యెంత బావుండును. నాకు నేను తప్ప మరెవ్వరూ లేని నాకు వరలక్ష్మి చెల్లెలెలా అవుతుంది? నేనెవరిని? ఆమె యెవరు? ఏమిటో యీ ఋణానుబంధం—యెందుకో యీ అవ్యాజానురాగం."

రామారావు ఆ వూరు బోర్డు హైస్కూలులో డ్రాయింగు టీచరు. ఆవూరు వచ్చిన మూడేళ్ళనుంచీ

రామారావు మంగమ్మగారి యింట్లోనే వుంటున్నాడు. మంగమ్మకు వరలక్ష్మి తప్ప మరి పిల్లలే లేరు! మంగమ్మ భర్తపోయాక మళ్ళీ నిలవేసింది! ఆ సంసార మిప్పుడు అయిదారువేలు కట్నం యిచ్చి వరలక్ష్మికి పెళ్లి చేయగల స్థితిలోవుంది. మంగమ్మగారి యింట్లో సగంవాటా రామారావుగారికి అద్దె కిచ్చారు. రెండు వాటాలకు మధ్య గడియపెట్టిన ద్వారం ఒక్కటే అడ్డు! ఆ రెండు కుటుంబాలకూ మగదిక్కు రామారావే! వారు భౌతికంగానే రెండు కుటుంబాలుగాని మానసికంగా ఒకే కుటుంబం! గడిచిన మూడేళ్ళలోనూ రామారావు ఇంట్లోనే కాకుండా వీధిలో కూడా "శ్రీరామచంద్రుడు లాంటిమనిషి" అన్న ప్రతిష్ఠ సంపాదించాడు.

రెండురోజులు గడిచాయి. సాయంకాలం వంట చేస్తున్న కాంతంతో కబుర్లు చెప్పుతూ కూర్చుంది వరలక్ష్మి! ఇంతలో వీధిలో ఎవరో పిలిచారు! చూచి రమ్మంది కాంతం! తలుపు తెరచింది వరలక్ష్మి! ప్రత్యక్షమయ్యాడు సుబ్బారావు!

"మేష్టారు లేరు." తలుపు వేసేయబోయింది.

మేష్టారు కోసంగాదు." నవ్వాడు:

"మరెందుకు?"

"నీతో మాట్లాడాలి!"

ఏమిటా ధైర్యం? అర్థంకాలేదు వరలక్ష్మికి! మాట్లాడలేదు.

"నేను పంపిన ఉత్తరానికి జవాబు వ్రాయ లేదేం?" నవ్వాడు సుబ్బారావు! వరలక్ష్మికి అసహ్యం పెల్లుబికింది!

"పెళ్ళిమాటలు పూర్తయాయి. నువ్వు ఊ అంటే నాకూ యిష్టమేనని మా నాన్నకు చెప్పుతాను. ముహూర్తం పెడతారు! నీ కిష్టమేకదూ?" కొంచెందగ్గిరకు వచ్చాడు. వరలక్ష్మికి ఒళ్లుమండిపోయింది! చురచురా చూచింది!

"నీ జవా బేమిటి?" నవ్వాడు!

"జవాబు కావాలా?" తీక్షణంగా చూచి అడిగింది!

"ఇష్టము నే గపొవ్వాలి." అంటూ ఫాంటుజేబులోనించి సంపంగిపూలగుత్తి తీసి యివ్వబోయాడు! చెంప చెళ్లుమంది! గూబ అదిరిపోయింది! పూలగుత్తి నేల వ్రాలింది!

"ఇదేజవాబు! అటువంటి తెలివితక్కువవ్రాతలు ఇంకెప్పుడూ వ్రాయకు!" తలుపు ధన్‌మని మూసి చర చరా తన వాటాలోకి వెళ్ళిపోయింది. తలుపు చప్పుడు విని గాబరాగా పరుగెత్తుకొచ్చిన కాంతానికి అక్కడ ఎవరూ లేకపోవటం—వరలక్ష్మి కూడా లేకపోవటం చాలా వింతగా తోచింది. సంపంగి పరిమళాలు పరవళ్లు త్రొక్కుతున్నాయి. చూచింది. పూలగుత్తి క్రిందపడి వుంది. ఎందుకో — అరుగుచివరికెళ్ళి చూచింది కాంతం! పదిహేను గజాల దూరంలో సుబ్బారావు వెళుతూ వున్నాడు! పూలవాసనలు ముసురుకొన్నాయి. నవ్వుకొంది కాంతం!

ఆమరునాడు బంగారమ్మ వచ్చి చెప్పేవరకూ యదార్థం తెలియదు కాంతానికి! "వరలక్ష్మి సుబ్బారావును చెంపకాయ కొట్టింది." అనివినగానే కాంతం ఎందుకో నిరాశగా చూచింది! అంతలో వరలక్ష్మి కూడా వచ్చింది! "ఊరందరికీ తెలిసిపోయింది! తెలియవలసిందే! సుబ్బారావు వట్టి పోకిరీ వాడు! డబ్బుందికదా అని యిష్టం వచ్చినట్టు ఆడదామంటే సాగుతుందా? బాగా బుద్ధిచెప్పావమ్మ వరాలూ" అంటూ లెగ సాగిడింది బాల వితంతువు బంగారమ్మ! బంగారమ్మ వెళ్లిపోయాక అక్కాచెల్లెళ్లు నవ్వుకొన్నారు!

"ఇది ఇలా బలిసిపోతూ వుందేమిటి అక్కా"

"ఏమిటాసోన్నలు—సెంటు వాసనలూను-ఛీ-"

రామారావు వచ్చాడు!

"మంచిపనిచేశావు లక్ష్మీ! ఇంతకాలంనుంచీ ఎందుకు చెప్పలేదు నీ కిష్టంలేదని! మధ్య నన్ను శ్రమపెట్టటానికా!"

ఎవరూ మాట్లాడలేదు! వరలక్ష్మి ముఖంమాత్రం మబ్బులుక్రమ్మిన చందమామలా వల్లబడిపోయింది.

తెల్లవారితే కాంతం పుట్టింటికి వెళ్ళిపోతుంది! ఎంత వద్దనుకొన్నా ఆ ఆలోచనలు వరలక్ష్మిని వెంటాడటం మానలేదు. మాటలు వినిపిస్తున్నాయి.

"కాంతం ట్రంకు సర్దావా?"

"ఆ! మీ రంగులు కాగితాలుకూడా వేయమంటారా?"

"అక్కరలేదు. ఈ సెలవుల్లో బొమ్మలు వ్రాయటం పనదు. చుట్టాల యిళ్ళన్నీ తిరిగిరావాలి"

"అమ్మా? యెప్పుడే మనం వెళ్ళటం" సుధ ప్రశ్న!

"నివ్వింకా నిద్రపోనేలేదా."

"తండ్రికి తగిన కూతురేగా! మీలాగే దానికి కూడా వూళ్ళు తిరగటమంటే నిద్రాహారాలక్కర లేదు."

"అది సరేకానీ మంగమ్మగారితో చెప్పావా ఎల్లుండి తెల్లవారుఝాము బండికి వెళతామని."

"చెప్పాను."

గడియవేసిన మధ్య గుమ్మం తలుపు లవతల గదిలోనుంచి యీ మాటలన్నీ వరలక్ష్మి వింటూనే ఉంది! తనకెవరూ కాకుండా అందరూ అయిన వాళ్ళు వెళుతూవుంటే తనకెందుకీఆందోళన—? జవాబు రావడం లేదు.

"పిన్ని కూడా వస్తుందా అమ్మా?" సుధ అడిగిన యీ ప్రశ్నతో వరలక్ష్మి హృదయం నిజంగా గాయపడింది.

"రాదమ్మా! ఇక్కడే వుంటుంది."

"ఉహూ! రావాలి."

"పిన్ని రాదు! కావలిస్తే నువ్విక్కడుండిపోపిన్ని దగ్గర."

ఈమాట నచ్చింది వరలక్ష్మికి! నిజంగా సుధను విడిచిపెట్టి నెల్లాళ్ళు తాను మాత్రం యెలా వుంటుంది? నవ్వొచ్చింది వరలక్ష్మికి! ఉండక యేం చేస్తుంది? వాళ్ళెవరు తానెవరు? నెల్లాళ్ళేకాదు జీవితమంతా కావచ్చు. అయినా యిప్పుడు సుధ వుంటానంటే వుంచుకోవటమే బావుంటుంది! ఉండిపోసుధా! అమ్మ తిరిగి వచ్చేవరకూ మనమిద్దరం యిక్కడే వుందాం" అందామని మధ్య గుమ్మం దగ్గరకు వెళుతూవుంది. ఇంతలో సుధ అన్నది. "ఉహూ! నే నుండను! పిన్నీ నీకూడా రమ్మను" అనాలనుకొన్న మాటలు గొంతు వరకూ వచ్చి ఆగిపోయాయి! ముందుకు వెళ్ళ లేక వెనక్కి రాలేక అక్కడే ఆగిపోయింది వరలక్ష్మి!

"గారం చేయకు దెబ్బలు తింటావు" అన్న కాంతం మాటలు. తర్వాత మరి యెవరిమాటలూ వినిపించనేలేదు. వరలక్ష్మి తిరిగి వచ్చి పడుకుంది ఆలోచిస్తూ!

వరలక్ష్మి నాలుగేళ్ళ క్రితమే — పెద్దమనిషి కావటంవల్ల—5 వ ఫారం చదువుతూ చదువుతూ స్కూలు మానేసింది. ఇంకా చదవాలని యెంత ప్రయత్నించినా యీ విషయంలోమాత్రం మంగమ్మ తన పంతమే నెగ్గించుకొంది! ఎదురింటివారమ్మాయి సుందరం స్కూలు ఫైనలు చదువుతూ పెళ్ళికాకుండా నూతిలో పడి చనిపోవటమే అమ్మ పట్టుదలగా తన చదువు మానిపించటానికి కారణమని వరలక్ష్మికి తెలుసు. గడిచిన రెండేళ్ళనుంచీ తన పెళ్ళి సంబంధానికి అమ్మ విశ్వప్రయత్నము చేస్తూవుండటం, రామారావు తోడుపడటం యింకా యేదీ నిశ్చయంకాకపోవటం అన్నీ తెలుసు వరలక్ష్మికి! ఒక్కొక్కప్పుడు అనుకోకుండా పెండ్లి తలపులువచ్చి ఆలోచించి ఆలోచించి తనలో తానే సిగ్గుపడుతూ వుంటుంది వరలక్ష్మి!

ఆవేళ వరలక్ష్మికి అసలు నిద్రపట్టలేదు. 'మరిచిపోయాను' అనుకొన్న ప్రాతగాథలు సరిక్రొత్తవిగా సాక్షాత్కరించాయి. మనసు గుకుసుళ్ళు తిరుగుతూ వుంది. ఆలోచనా ప్రవాహం పరవళ్ళు త్రొక్కుతూ వుంది. "తన మనసు రామారావు మీదికి పోతూ వుందా?" ఇటువంటి భావన కలిగినందుకు తన మీద తనకే కోపం వచ్చింది. స్వయంగా తిట్టుకొంది. ఏమిటి యీ విచిత్రానుభూతి! సుబ్బారావంటే తనకెందుకు ఇష్టంలేక పోవాలి? రామారావంటేయిష్టమా? ఈ మాట మాత్రం తాను అంగీకరించలేదు. పెళ్ళయి భార్యా బిడ్డలతో కాపురంచేసికొంటున్న రామారావు మీద తన కెలా వుంటుంది యిష్టం?" అయినా మనసును "త్రోసిరాజు" అనటానికి భయపడుతూ వున్నట్లుగా అనుమానం కలిగింది వరలక్ష్మికి!

గడియారం టంగు టంగుమని రెండు కొట్టింది! ఏమిటి! తానింత వరకూ నిద్రపోనే లేదా? ఎక్కడ నుంచో వచ్చిన యెవరో— యెందుకో — యెక్కడికో—వెళుతూ వుంటే తన కెందుకు బాధ? నవ్వుకొంది వరలక్ష్మి! కాని ఆ నవ్వులో నవ్వు లేదు.

వరలక్ష్మి ఉలిక్కిపడింది. నిలువెల్లా కంపించి పోయింది. లేవాలి అనుకొంటూనే లేవలేకపోయింది. ఇంత రాత్రివేళ మధ్య తలుపు వెనకాలనుంచి రామారావు తనను పిలుస్తున్నాడు! ఎప్పుడూ లేనిది యేమి

టిది! ఈసారి మరికొంచెం గట్టిగా—గాబరాగా వినిపించిందా పిలుపు. "వరలక్ష్మీ! వరలక్ష్మీ!" ఏమిటది? ఏం చేయాలితాను? వెళ్ళాలా అక్కర లేదా? ఎందుకు? అంతా యేదో సుడిగుండంలా వుంది! అమ్మను లేపితే! "భ—భా" అంటే—?ఏమిటీ భావం! ఎందు కలిగింది. తనకా అపవిత్రభావం? ఇలా అనుకొంటూ వుండగానే రామారావు మంగమ్మగారినే పిలవటం—తలుపు బాదటం—మంగమ్మగారు లేవటం జరిగింది. మంగమ్మగారు పెరట్లోనుంచి తిరిగి వెళ్ళబోతూ వుంటే "అమ్మా—" అంటూ మధ్య తలుపు గడియ తీసి ముందు నడిచింది వరలక్ష్మి! మంగమ్మ అనుసరించింది! ఎప్పుడో బంధించిన తలుపులు అవాడలా అకస్మాత్తుగా తెరచుకొన్నాయి.

"కొంచెం చూస్తూ వుండండి. డాక్టరును పిలుచుకొస్తాను" అంటూ రామారావు బయటకు పరుగెత్తాడు. మరో రెండురోజుల్లో ఆనందంగా పుట్టింటికి వెళ్ళబోతూవున్న కాంతానికి యిలా ముంచుకు వస్తుందని యెవరనుకొన్నారు. డాక్టరు వచ్చాడు! ఇంజక్షన్లు ఇచ్చాడు. న్యుమోనియా అన్నాడు. కాస్సేపటికి గుండెలలోని పోటు తగ్గిందేమో కొట్టుకోవటం మాని పడుకొంది కాంతం! కన్ను తెరవలేదు. నోరు మెదపలేదు!

తెల్లవారింది. తమ యింటికి అత్తవారింటికి టెలిగ్రాములు ఇచ్చాడు రామారావు. ఎన్ని మందులు వాడినా గాలి పీల్చటం తప్పితే మరో కదలిక కలుగలేదు కాంతంలో; సుధను సముదాయించటం-కాంతానికి మందివ్వటం-రామారావుకు కావలసినవి చూడటం-వంటచేయటం అన్నీ వరలక్ష్మి తానే చూస్తూవుంది.

మధ్యాహ్నం ఒంటిగంట అయింది. అప్పటికి కాస్త తీరికయి కాంతం మంచం దగ్గరగా వాలుకుర్చీ వేసుకొని కూర్చుని కాంతంవంక చూస్తున్న రామారావుకు "అన్నం వడ్డించమంటారా" అన్న మాటలు వినగానే మతిపోయినట్లయింది. ప్రొద్దుటనుంచీ కన్ను తెరవని కాంతం యింత స్పష్టంగా యెలా మాట్లాడింది? కాంతంకాదు. మరెవరు? అచ్చంగా కాంతం గొంతు లాంటి గొంతు మరెవరికుంది?

"రెండు గంటలు కావస్తూవుంది! ప్రొద్దుట నుంచీ కాఫీ అయినా త్రాగలేదు! కాస్త భోజనం చేయండి మేష్టారు!" రామారావు ఆశ్చర్యానికి అంతు లేదు. వరలక్ష్మి గొంతు కాంతం కంఠంలా వుంటుందా! ఇంతవరకూ తనకు తెలియలేదే! వెనుతిరిగి చూశాడు! దగ్గరలో సుధను ఎత్తుకొని నిలుచునివుంది వరలక్ష్మి! ఒకసారి కాంతంవైపు మరోసారి వరలక్ష్మివైపు చూశాడు రామారావు. ఏవేవో వింత భావాలు మంతనాలాడాయి మనసులో!

రామారావు భోజనం చేస్తున్నంతసేపూ వరలక్ష్మికి క్రొత్త క్రొత్త ఊహాలు రావటం మొదలుపెట్టాయి! "యీ చాకిరీ అంతా తనెందుకు చేస్తూ వున్నట్టు? తనకున్న సుధమీది ప్రేమవల్లా—కాంతం మీది సానుభూతివల్లనా—లేక రామారావుమీది దయ చేతనా? లేక మానవ ధర్మనిర్వహణారూ?" ఇలా ఆలోచిస్తూనే పరధ్యానంగా రామారావు వద్దు వద్దంటున్నా వినకుండా యింకా యింకా కంచంలో అన్నం వేస్తూనేవుంది. విసుగెత్తి రామారావు చటుక్కున వరలక్ష్మి చేయిపట్టుకొన్నాడు—గుప్పిటిలోని అన్నం కంచంలో వేయనీయకుండా! ఇద్దరూ ఒకేసారి ముఖ ముఖాలు చూచుకొన్నారు. నిర్ఘాంత పోయారు. ఒకేసారి తమ చేతులుకూడా చూచుకొన్నారు: "ఒకరి" చేతిలో "మరొకరి" చేయి. ఆ "మరొకరి" చేతిలో "ఒకరి" కోసమయిన వరి అన్నం! ఇద్దరకూ నవ్వు వచ్చింది! కాని యెవరూ నవ్వలేదు. ఇద్దరూ ఒకేసారి చేతులు వదిలేశారు. వరలక్ష్మి గుప్పిటలోని అన్నం రామారావు కంచంలో పడక తప్పిందికాదు!

అసాయంత్రానికి రామారావు తల్లీ—కాంతం తల్లీ కూడా వచ్చారు. కాంతానికి కాస్త నెమ్మదించింది! మాట్లాడింది! మందు స్వయంగా త్రాగింది! వారం రోజులు గడిచేటప్పటికి కాంతానికి బాగా నెమ్మదించింది! ఇంకా పథ్యం మాత్రం యివ్వలేదు. ఎంతమంది చుట్టాలు వచ్చినా రామారావు సంరక్షణ మాత్రం వరలక్ష్మికి తప్పలేదు! కాంతాన్ని—తప్పితే—సుధను తప్ప—రామారావును కన్నెత్తిచూచినవారే లేరాయె! అన్నాళ్ళూ ఆ యింటికి యిల్లాలు కాని యిల్లాలు వరలక్ష్మి! ఈ వారం రోజులలోను ఒక భయంకర విచిత్రం మాత్రం జరిగింది! లోకం అనుకొంటున్న మాట "రామారావుకీ తనకూ సంబంధముంది" అని తన తల్లి నోటివెంట వినగానే వరలక్ష్మి నిలువునా కూలిపోయింది!

"ఇందుకా నువ్వింతకాలంనుంచీ పెళ్లికొడుకు వచ్చు లేదంటూ సాకులు చెప్తూవుంట? నేనెంతయితే భయపడ్డానో అంత అఘాయిత్యం చేశావు!" కోపం పట్టలేక దుఃఖంలోకి దిగింది మంగమ్మ.

"నాకీ దుఃఖం పెట్టకపోతే వాడిచేత విషం తెప్పించి పెట్టి నన్ను చంపేయరాదూ" వరలక్ష్మికి నోటమాట రావటంలేదు. కొయ్యబారి నిలుచుండి పోయింది.

"ఇంట్లో చేరనిచ్చినందుకు మంచి ఉపకారం చేశాడు-దుర్మార్గుడు" ఇక సహించుకో లేకపోయింది వరలక్ష్మి.

"చాల్లే ఊరుకో! నోటికి వచ్చినట్లల్లా మాట్లాడకు!"—

"నిన్నంటే లేనికోపం వాడినంటే యెందుకు వచ్చిందో—ఈ అభిమానమంతా యేమిటో తెలుస్తూనే వుంది."

ఛీఛీ! తల్లివై ఉండికూడా—" ఇక మాటాడ లేకపోయింది వరలక్ష్మి.

ఆ తల్లి పడే హృదయారాటం కూతురుకేం తెలుసు! కూతురుపడే చిత్తక్షోభ తల్లికేం తెలుసు! ఎంతదూరమో యీ తారతమ్యం! ఎలాగయితే— బంగారమ్మ ద్వారా వచ్చిన యీ నీలివార్తకు జన్మస్థానం సుబ్బారావని తేలింది. సుబ్బారావు నలుగురితోనూ క్లబ్బులో "నిజమే, ఋజావుచేస్తాను" అంటున్నాడట.

తనకే గనక చేతనయితే లోకంలో వున్న పాపం—దుఃఖం—అంతా కలిపి సుబ్బారావుమీదికి పంపక పోదునా అనుకొంది వరలక్ష్మి. దుఃఖం కోపంగా మారింది! సుబ్బారావుకు బుద్ధిచెప్పాలి! పగతీర్చుకోవాలి! కాని తానేం చేయగలదు? లోకం నోరెలా మూయగలదు? "రామారావును పెళ్లాడేస్తే" గుండెలు దడ దడ లాడాయి. అసలు తనకీ వూహ యెందుకు కలిగింది! సుబ్బారావుమీద వచ్చిన కోపం చేతనా! చచ్చినాపోని—వచ్చిన జనాపవాదం వల్లనా? "రామారావును పెళ్లాడితే" అన్న కోరిక ఆలోచించేకొలదీ ప్రాతదిలాగే అనుమానం కలిగింది! పరోపకారం అనుకొన్న తనసేవలో యింత స్వార్థముందా? ఈసారి వరలక్ష్మికి భయంలేదు—కోపం లేదు—నిశ్చలంగా నవ్వుకొంది. ప్రాగన్నుగా కునుకు పట్టబోయే సమయంలో పెద్దగా పడికొంకుల యేడుపు వినిపించింది! లేచి పరుగెత్తింది వరలక్ష్మి! "పిన్నీ" అంటూ వరలక్ష్మికంఠం కౌగిలించుకొంది సుధ! సన్నిపాతం ధనుర్వాతంలోకి దింపటంవల్ల అనుకోకుండా పోయింది కాంతం! రామారావును, సుధను యెవరి చేతుల్లో పెట్టిపోయిందో ఆ భగవంతునకే యెరుక!

కాంతం దహన సంస్కారాలు పూర్తి అయ్యాయి. బంధువులవెంట స్వగ్రామం బయలుదేరాడు రామారావు! "రా అమ్మా! అమ్మలేని బిడ్డవయ్యావా తల్లీ" అని యేడుస్తూ సుధను ఎత్తుకో బోయింది రామారావు తల్లి! సుధ భయంతో వరలక్ష్మి కాళ్లకు పెనవైచుకొంది! ముసలావిడ బలవంతంగా తీసికోబోయింది! సుధ వెళ్లకుండా—యేడుస్తూ—పొరపాటున— అలవాటయిన మాట—"అమ్మా" అంటూ వరలక్ష్మిని గట్టిగా పట్టుకొంది! "పిన్ని" కి బదులు అమ్మా" అన్న సుధ పిలుపు వరలక్ష్మి గుండెలు నాటింది! హృదయాంతరాళంలో దాగివున్న అవ్యక్త భావాన్ని మేలు కొలిపింది! ఒక్క ఉదటున సుధను ఎత్తుకొని గుండెల కద్దుకొంది వరలక్ష్మి! వీధిలో బళ్ళవాళ్లు బండి అందదని తొందర పెట్టారు. ఎవరు రమ్మన్నా రాలేదు సుధ!

"పోనీలెండి నా దగ్గరనే వుంటుంది" దుఃఖంతో పూడుకుపోయిన వరలక్ష్మి గొంతు గంభీరంగా ధ్వనించింది. ఎవరు పూరుకొన్నా మంగమ్మమాత్రం పూరుకోలేక పోయింది.

"అదేమిటే వాళ్లింతా వుండగా నీ దగ్గరెలా వుంటుంది."

"సుధ! నా దగ్గరే వుంటుంది" తీక్షణంగా అంది వరలక్ష్మి! మంగమ్మకు ఒళ్ళు మండింది! "కలకాలం నీ దగ్గరే వుంటుందా?"

"అవును కలకాలం నా దగ్గరే వుంటుంది" ఆ మాట యెవరికెలా అర్థమయ్యిందో కానీ మంగమ్మకు మాత్రం అర్థమయ్యీ కూడా కానట్లే వుంది!

"అంటే అతన్ని పెళ్లాడతావా? వీల్లేదు" అన్నట్లు శాసించింది మంగమ్మ కంఠం.

"అవును—" అనేసి గబగబా వెళ్ళి సుధతో పాటు మంచంమీద పడిపోయింది వరలక్ష్మి! మంగమ్మేకాదు మరెవరూకూడా మరి మాట్లాడలేదు!

తొలకరివర్షం ఒక్క పెట్టున కురిసి వెలిసింది. రోజూ నీళ్లుపోసే అలవాటున సుధ వేడినీళ్లు పట్టుకువెళ్లిపోస్తూ వుంది తన మల్లె మొక్కకి!

"సుధా! మొక్కకు వేడినీళ్లు పోయకూడదమ్మా"

"మరి మల్లె మొక్క తడిసిపోయిందిగా! చన్నీళ్లు పోస్తే-పిన్నీ దానికి చలివేయదా పాపం!" సుధ కన్నులలోని ముగ్ధప్రేమ — స్వార్థరహితమైన ప్రేమ చూచి ఆనందంతో సుధను ఎత్తుకొని ముద్దాడి రహస్యంగా అంది వరలక్ష్మి!

"నన్ను పిన్నీ అనకూడదు తెలుసా"

"నువ్వు పిన్నివి కాదా?"

"కాదు"

"ఎవరు మరి"

"అమ్మను"

"మా అమ్మ చచ్చిపోయిందిగా"

"లేదు! మీ అమ్మ చచ్చిపోలేదు. బ్రతికేవుంది—వుంది" అంటూ ఉద్వేగంలో దుఃఖం ఆపుకోలేక బావురుమంది వరలక్ష్మి! అర్థంకాక తానుకూడా ప్రారంభించింది సుధ! ఊరుకో బెట్టి లోపలకు తీసుకుపోయింది సుధను లక్ష్మి!

"పిన్నీ అంటే యేడుస్తావా?" చిన్న చేతులలో చెంపలు నిమురుతూ అడిగింది సుధ! దుఃఖం ఆగక పళ్లతో పెదాలు బిగపట్టి "ఊఁ" అన్నట్టు తలూపింది వరలక్ష్మి!

"అమ్మ అంటే యేడవ్వా"

'ఊహూ' అన్నట్లుగా తల అడ్డంగా ఆడించింది!

"అయితే అమ్మా అంటాను—అమ్మా—" వరలక్ష్మి గుండెలు పగిలాయి! దుఃఖం కట్టలు త్రెంచుకొని పొర్లుతూవుంది! కాని ఆదుఃఖంలో దుఃఖం లేదు పట్టరాని ఆనందం—అనుభవంకాని ఆనందం అలా అనిపించింది. ఆ తల్లీ కూతుళ్లిద్దరూ ఒకళ్లనొకళ్లు కౌగిలించుకొని అలా యెంతసేపున్నారో!

"అమ్మా! నాన్నగారెప్పుడు వస్తారు?" తల్లి భుజం మీదనుంచి, తల ఎత్తకుండానే అడిగింది కూతురు.

"వస్తారమ్మా! వస్తారు" అనేసి విస్తుబోయింది వరలక్ష్మి! ఈ "వస్తారు" అనేమాట తన కెలా వచ్చింది! ఎవరు చెప్పారు? ఏమిటీ ప్రయోగం ఎక్కడిది తనకీ అనుభవం! కొన్ని వేల సంవత్సరాల నుంచి జీర్ణించిపోయి వున్న సాంప్రదాయ ప్రాతినిధ్యమా? తరతరాల స్త్రీ సంస్కృతి ప్రభావమా?

అన్నీ సవ్యంగానే జరిగిపోయాయి. నెలలోనే వరలక్ష్మి రామారావుల కళ్యాణం దేవాలయంలో వెంకటేశ్వరస్వామి సాక్షిగా జరిగిపోయింది. "వరలక్ష్మి డ్రాయింగు మేష్టారుతో—" అన్న అమ్మలక్కలు, వరలక్ష్మిమీద పగసాధించాలని అపవాదు పుట్టించిన సుబ్బారావు ఇకయేం చేయాలో అర్థంకాక వూరుకొన్నారు. నిజానికి సుబ్బారావామాట పుట్టించక పోతేయీ పెళ్ళి జరిగేది కాదేమో!

తెల్లవారేటప్పటికి వూరంతా ఒకటేగోల: "రాత్రి బంగారమ్మను సుబ్బారావునూ ఎవరో మర్డర్ చేశారు! బంగారమ్మ అన్నగారు చలపతి కనుపించటం లేదు"

పదిగంటలు కావస్తున్నా రామారావు స్కూలుకు వెళ్ళటానికి కంగారుపడటం లేదు. రతీ మన్మథుల చిత్రం పూర్తిచేస్తున్నాడు. అంతా అయినట్లే! ఇక నల్లగ్రుడ్లు మాత్రం దిద్దాలి! అదే చేస్తున్నాడు!

"అన్నం వడ్డించమంటారా"

రామారావు వినిపించుకొన్నట్లుగా లేదు.

"స్కూలుకు టయిమైపోయింది భోజనం చేయండి మే—" మేష్టారూ అనబోయి ఆగిపోయింది వరలక్ష్మి! రామారావు వరలక్ష్మి కళ్లల్లోకి చూచి నవ్వాడు! నవ్వినట్లు కనబడకుండా నవ్వింది వరలక్ష్మి! చిత్రం పూర్తిచేసి లేచాడు! వరలక్ష్మి తదేకదీక్షతో చూస్తూవుంది! చటుక్కున కౌగిలించుకొన్నాడామెను. "టయిమయినట్టుంది. భోజనం చేయండి" కౌగిటిలో నుండికూడా కర్తవ్యాన్ని మరచిపోలేదు వరలక్ష్మి!

"ఇకమాట్లాడనివ్వను" అన్నట్లుగా రామారావు తన పెదవులలో ఆమె పెదవులు దాచాడు. ఆ వేళ మహమ్మదీయుల పండుగ సెలవని — స్కూలు లేదని — తెలియని వరలక్ష్మి రామారావు తన మమకారంలోపడి విధ్యుక్తధర్మాన్ని విస్మరిస్తున్నాడని యింకా ఆందోళన పడుతూనే వుంది.

తిరిగిచూచేటప్పటికి తనసొంత మల్లంటు పూచిన మల్లెపూలు తెచ్చి రామారావు వ్రాసిన "రతీమన్మథ" చిత్రంముందుంచి, నమస్కరిస్తూవున్న సుధ కనుపించిందా నూతనదంపతులకు!

# అముద్రిత విజ్ఞానేశ్వరము

శ్రీ కోట లక్ష్మీనారాయణ

విజ్ఞానేశ్వరమను ప్రబంధమును కీ. శే. కోటికలపూడి వేంకట కృష్ణ సోమయాజి రచించెను. ఆ పేరను సంస్కృతమున నొక ధర్మశాస్త్రము గలదు. అందలి ప్రథమ కాండమునఁ గల చివరి భాగము నా కవిపండితుఁ డాంధ్రీకరించి యైదాశ్వాసముల ప్రబంధముగా రచించి యాంధ్రయోషామతల్లి కొక యమూల్యాభరణమును సమర్పించెను. శ్రీ సీతారామస్వామి కంకితమొసఁగి జన్మ పావన మొనర్చికొనెను.

వేంకట కృష్ణ సోమయాజి వెలనాఁటి శాఖకుఁ జెందిన వైదిక బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. హరితసగోత్రుఁడు. తండ్రి వేంకటరామయ్య. ఇతర ప్రబంధములలో, దల్లిపేరును జేర్కొనెనేమో కాని విజ్ఞానేశ్వరమున మాత్రము తన వంశావళి వర్ణనమునఁ గాని గద్యమునఁగాని యుదాహరింపలేదు.

విజ్ఞానేశ్వరమున గల యీ క్రింది పద్యము ఆ విషయవివరణముకొఱకు యథాతథముగ వ్రాయుచున్నాను.

సీ. "ధరణి మదియ్య వృద్ధప్రపితామహుం
డగు కృష్ణపండితు నభినుతింతు
మామకీయ్య ప్రపితామహుండయిన వ
ల్లంభట్లు మదిలోపలను దలంతు
మత్పితామహుడైన, మహనియ్యకీలిఁకి
శివరామునకు నమస్కృతు లొనర్తు
హరితసగోత్రుడై యయ్యలరు మజ్జనకుని
వేంకటరామాఖ్యు వినుతిసేతు
సకల సద్గుణమణిగణ సహితులై మ
హా పతివ్రతలై దనరారునట్టి
వారివారి వధూటుల గౌరవమున
ప్రస్తుతింతు నిరంతర భక్తిగలగ"

గద్యమున నిట్లున్నది.

"ఇతి శ్రీమత్కోటికలపూడి కులపవిత్ర వేంకటరామపుత్ర వినుత సుకవిరాజి వేంకటకృష్ణసోమయాజి"

ఆ ప్రబంధము మాతృకనుండి సోమయాజి పౌత్రుఁడు సోమయాజియొక ప్రతిని, "గంనవరపు నరుశింహ్వరామంనగా" రొకప్రతిని వ్రాసికొనిరట్లును ప్రస్తుత ప్రతిని లిఖించుకొనిన అయ్యల సోమయాజుల రామకృష్ణయ్య యను నతఁడు తెల్పినాఁడు.

తృతీయాశ్వాస గద్యములో

"మన్మథనామ సం మాఘ శు ౧౪ గు రోజున మొదలుచేసి యీ బ ౩ శుక్రవారం సర్కి విజ్ఞానేశ్వరము తృతీయాశ్వాసం అయ్యల సోమయాజుల రామకృష్ణయ్య వ్రాసుకొనెను. శ్రీరామాయనమః శ్రీకృష్ణార్పణమస్తు. శ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీ కోటికలపూడి సోమయాజులగారి ప్రతి చూచి వ్రాసినాను."

ఇచట గ్రంథకర్త సోమయాజియే యైన మాతృక చూచి యనియే వ్రాయునుగాని 'ప్రతిచూచి' యనుటచే నా సోమయాజి, గ్రంథకర్త సోమయాజి పౌత్రుఁడని స్పష్టము. పౌత్రుఁడు సోమయాజినిఁగూర్చి వేఱొకచోట వివరములతో వ్రాయుచును.

చతుర్థాశ్వాసాంత గద్యమున నిట్లున్నది.

"దుర్ముఖనామ సం శ్రావణ బ ౩౦ స్థిరవారం సర్కి కోటికలపూడివారి ప్రతిలో వుంన క్రమాన్ను విజ్ఞానేశ్వరం నాలుగో అశ్వాసం అయ్యల సోమయాజుల రామకృష్ణయ్య శ్రీ రామార్పణముగా వ్రాసుకొనెను. యీ పుస్తకం గంనవరపు నరుశింహ్వరామంనగారు నాకు యిచ్చివేసినారు."

ఆ రామకృష్ణయ్యకు కవిత్వసాంప్రదాయములు ఛందో వ్యాకరణాగములు బాగుగ దెలియనందున వ్యావహారిక భాషలో వ్రాసికొనుటచేఁ గాఁబోలు లేఖకదోషములు పెక్కులు చేసినాఁడు. మాతృకను జూచి వ్రాసి

కానిపని కాకపోవుటచేతనే స్వల్పదోషములు కూడ నచ్చటచ్చటఁ గానఁబడుచున్నవి. అట్లని గ్రంథకర్త వ్యావహారిక పదప్రయోగములు చేయలేదని కాదు.

కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ కవి జీవితములు మూఁడవ భాగమున వేంకట కృష్ణ సోమయాజినిఁ గూర్చి సంగ్రహముగ వ్రాసిరి. అం దాతని కవిత్వమున దోషములున్నను గవితాధార చక్కనిదని మాత్రము పేర్కొనిరి. .

నేను "కోదండరామకవి" యను శీర్షిక నొక వ్యాసము వ్రాసినాను. అది 1954వ సంవత్సరము మేనెల భారతి సంచికలో ప్రచురింపఁబడినది. దానిలో వేంకట కృష్ణ సోమయాజినిఁ గూర్చి కొంచెము దెలిపితిని. అది యిది.

"ఇతని (కోదండరామ కవి) తండ్రి వేంకట కృష్ణ సోమయాజి. బొబ్బిలి ప్రభువగు శ్రీ రావు రాయుడప్ప రంగారాయల పురోహితుఁడును అస్థానకవియునై దిలీపచరిత్రాద్యష్టాదశప్రబంధకర్తయై వన్నెకెక్కెను."

ఈ సోమయాజికిఁ బ్రథమకళత్రమునందు అయిదుగురు కుమారులును ఒక కూఁతురును జన్మించిరి. ఈయన బొబ్బిలి ప్రాంతమునఁ గల కుసుమూరాగ్రహారస్థుఁడును వేదవిదుఁడు నగు గన్నవరపు వేంకటావధాని కుమార్తె వేంకమాంబను పెండ్లియాడి జన్న మొనరించి సోమయాజి యయ్యెను. ఆమె మొదటి కొడుకు బాల్యముననే మరణించెను. రెండవవాఁడు కోదండ రామకవి.

ప్రథమ కుమార వియోగానంతర మయ్యయు వేంకమాంబ కోదండరామతీర్థు లను నొక స్వాములవారి నాహ్వానించి భిక్షయిడి వారి యాశీర్వాదమున మఱల చటెయేట నొక కుమారునిఁ గని యా స్వాములవారి జ్ఞాపకార్థము ఆ బాలునికిఁ గోదండరాముఁ డని నామకరణము చేసెను.

కోదండరామకవి తే 28-8-1807 దికి సరియగు ప్రభవ సంవత్సర శ్రావణ బహుళ ఏకాదశినాఁడు జన్మించెను. పునర్వసునక్షత్ర చతుర్థపాదము. జన్మకాల గురు మహాదశా శేష సంవత్సరములు మూఁడు."

పై విషయములనుబట్టి వేంకటకృష్ణసోమయాజికి యిద్దరు భార్యలున్నట్లును ప్రథమభార్యకు అయిదుగురు కుమారుల నొక కుమార్తెఁ గని చనిపోయినట్లును దెలియుచున్నది. అవ్వల నాచారప్రకారము సంవత్సరములోపలఁగాని మూఁడవయేటఁగాని వేంకమాంబ నుద్వాహము చేసికొనియుండును. ప్రథమ భార్య కాఁపురమునకు వచ్చుసరికా తనికా రోజులలో నిరువదియైదేండ్లుండవచ్చును. ఆర్గురు పిల్లలం గనుక నథమ పక్షము పదునేను లేక పదునెన్మిదేళ్లు పట్టును. అనఁగా నాతనికిఁ బ్రథమభార్యావియోగసమయానికి నలువది మూఁడేళ్లుండవచ్చును.

సోమయాజి కుమారులలో రామదాసు ఒకఁడు. అతఁడు 1800 ప్రాంతమున జన్మించియుండును. అతఁడు పెరిగి పెద్దవాఁడైన పిదపఁ బెండ్లియు భార్య కాఁపురమునకు వచ్చుటయు నామెకు 1825 సంవత్సరం సెప్టెంబరు నెలలోఁ గుమార జననమును ఆ చిరుతనికి తాతపేరే సోమయాజి యని పెట్టుటయు జరిగినది.

సోమయాజికి 1802 లో గాని 1803 లోఁగాని ద్వితీయ వివాహము జరిగియుండును. ఆమెకు మొదటి కొడుకు పుట్టి గిట్టుటయు నామె విచారమును, గోదండ రామతీర్థుల యాశీస్సును, 1807 లో రెండవ కుమారుఁడైన కోదండరాముని జననము జరిగినవి.

అప్పటికి సోమయాజికి నలువదియేఁడేండ్లని తలంప నవకాశములు కలవు. ఆ వయస్సున యజ్ఞము నాతఁడు చేసెనో తత్పూర్వమే చేసెనో నిర్ధారించుట కాధారము లింతఁగాఁ గానఁబడకున్నవి.

రాయణప్ప రంగారాయనిఁ బెంచికొనిన వెంకట రంగారావు బొబ్బిలియుద్ధమున మరణించిన గోపాల కృష్ణ రంగారాయని కుమారుఁడే. అతఁడు 1794 వ నిజ రాజ్యమును సంపాదించికొనెను. అతని కాలమునఁ గూడ సోమయాజి యుండెనుగాని బొబ్బిలియుద్ధము నేల ప్రబంధముగ వ్రాయఁగడంగలేదో అతని ప్రభువు లేల కోరలేదో తెలియదు. బహుశః అప్పటికి దిట్టకవి నారాయణకవి రంగారాయ చరిత్ర ప్రబంధము వ్రాసి నట్లుఁ దెలిసియుంటఁజేసి యీతఁ డా ప్రయత్నమునకు సుముఖుఁడు కాలేదనుకొనవచ్చును. వీరేశలింగపంతులు గారి కవి జీవితములు మూఁడవ భాగమున నీరీతిఁగ నున్నది.

"శ్వేతాచల మాహాత్మ్యము మూఁడాశ్వాసముల గ్రంథము. బొబ్బిలిరాజగు రాయణప్పరంగారావునకుఁ గృతి యిచ్చెను. ఈభూపుఁడు 1801 నుండి 1830 వఱకు రాజ్యముచేసెను.

ఆ గ్రంథములోని పద్యము.

సీ. ధీరత మేఘసందేశంబు తెనిగించి
 ప్రీతి దిలీపచరిత్ర మనెడు
గొప్ప ప్రబంధంబుఁ జెప్పి శ్రీరాముల
 కర్పించితివి మున్ను పేర్పు మీఱఁ
గార్తాంతికులు మెచ్చఁగా శ్రీపతి గ్రంథ
 గతిని మాకు జాతకము లిఖించి
మా కొసంగితి విప్పు డేకాగ్రచిత్తత
 వంచితంబుగఁ దెనిఁగించుచున్న
కూర్మ మాహాత్మ్య మొసఁగుము, కూర్మిమాకు
రమ్య చారిత్ర! వేంకట రాయ పుత్ర!
కీర్తి శౌదార్య! వెంకట కృష్ణవర్య!
యనుచు బహుమతి చేయ నాహ్లాదమునను"

అని కవి వ్రాసికొనుటఁబట్టి మేఘసందేశ మాంధ్రీకరించి వ్రాసిన ప్రబంధమును దిలీపచరిత్ర మును శ్రీరామచంద్రమూర్తి కంకితమిచ్చెను. శ్వేతాచలమాహాత్మ్యము రాయణప్ప రంగారావునకుఁ గృతియొసంగెను. కూర్మమాహాత్మ్యమును గూడఁ దనకే యంకిత మిమ్మని యమ్మనుజేశ్వరుఁ డర్థించిన ట్లున్నది. ఇంతవఱకు కవికి నామాంతమున సోమయాజి శబ్ద మున్నట్లుఁ గానఁబడదు. విజ్ఞానేశ్వరమున సోమయాజిగా నున్నది.

దిలీప చరిత్ర ముద్రింపించిన కీ. శే. మంత్రిప్రగడ భుజంగరావుగారు వేంకటకృష్ణసోమయాజి విజ్ఞానేశ్వరము వ్రాసెననియు నయ్యది తమకు లభింపలేదనియు వ్రాసినట్లు నామిత్రులు చెప్పఁగా వింటిని. దిలీప చరిత్రలో విజ్ఞానేశ్వర ప్రస్తావనయే యున్నచో దానికిఁబూర్వమే యిది రచింపఁబడవలయును.

విజ్ఞానేశ్వరమున నాతని యితరగ్రంథ ప్రస్తావన లేదు కాఁబట్టి యదియే ప్రథమగ్రంథమాయన్న ప్రశ్న ముత్పన్న మగుచున్నది.

రాయణప్ప రంగారావునకుఁ గృతియిచ్చినవి రెండు. అతఁడు 1801 నుండి 1830 వఱకుఁ బాలించెను. రెండు ప్రబంధములు శ్రీరామచంద్రమూర్తి కంకిత మిచ్చెను గనుక నయ్యవి 1801 సంవత్సరమునకు బూర్వమే రచియించియుండునా ?

విజ్ఞానేశ్వరమున సోమయాజి తన ప్రభువగు రాయణప్ప రంగారావును బ్రశంసించెను. అప్పల నా రాజుకడ దివానుగ నున్న ఇనుగంటి సీతారామస్వామినిఁ జేకొని యాతని ప్రోత్సాహమునఁ దానా ధర్మశాస్త్రానువాదరచనమునకు గడంగితినని కవి తెలుపుటచే నాగ్రంథము 1802 కుఁ దరువాతిదనుటలో సందియము లేదు.

విజ్ఞానేశ్వర ప్రబంధ రచనాకాలము నాఁటికి వేంకటకృష్ణసోమయాజి యేఁబదేండ్లకుఁ బైఁబడిన వయస్సుకలిగి విశేష లోకానుభవము గడించి యాధ్యాత్మికచింతాపరతంత్రుఁడై ధర్మశాస్త్రమునకు సంబంధించిన పెక్కు గ్రంథములను జదివిన మేధానిధియైనట్లుఁ గాన్పించును.

సోమయాజి రెండవభార్య వెంకమ్మకు 1807 సంవత్సరమున కోదండరామకవి జన్మించెను. అతఁడు "నూనూగుమీసాల నూత్నయౌవనమందు" ద్వ్యర్థి ద్విశేషచరిత్ర హాస్యరస ప్రబంధము రచించెను. అనఁగా 1807 తరువాత 18 ఏండ్లకు అనఁగా 1825 సంవత్సర మగును. కోదండరామకవి తోడివారి కా కావ్యములోని శృంగారఘట్ట వర్ణన పద్యములు వినిపించుచుండ వేంకటకృష్ణ సోమయాజి పరోక్షమున నుండి యాలించి చట్టన ప్రత్యక్షమై చీవాట్లుపెట్టి యా తాళపత్ర గ్రంథమును లాగికొనెను.

పై సందర్భమునుబట్టి సోమయాజి 1825 ప్రాంతమువఱకు జీవించియుండెననుట నిశ్చయము.

సోమయాజి యష్టాదశ ప్రబంధకర్త. కాని యింతవఱకాతనివి అయిదు గ్రంథములే తెలిసినవి.

1. మేఘసందేశము. అనువాదము. ఆంధ్రప్రబంధము. అముద్రితము. శ్రీరామాంకితము.

2. శ్వేతాచల మాహాత్మ్యము. ఆంధ్ర ప్రబంధము. అముద్రితము. రాయణప్పరంగారాయునికిఁగృతి.

3. కూర్మ మాహాత్మ్యము. ఆంధ్ర ప్రబంధము. అముద్రితము. రాయణప్ప రంగారాయునికి గృతి యీఁబడినది.

పై రెండు మాహాత్మ్య ప్రబంధములును గృతిఁ గైకొంటఁబట్టి రాజును దరాస్థానకవి సోమయాజియు నాముష్మికకావాస్తికాములై యుండిరనుట స్పష్టము.

4. దిలీపచరిత్ర. ప్రబంధము. కీ. శే. మంత్రి ప్రగడ భుజంగరావుగారి సంపాదకత్వమున ముద్రింపఁబడినది. శ్రీరామాంకితము.

5. విజ్ఞానేశ్వరము. ఆంధ్రప్రబంధము. అముద్రితము.

1939 లోనో 1940 లోనో నా ప్రోత్సాహముచే వేంకటకృష్ణ సోమయాజి ప్రపౌత్రుఁడు చినకోదండరామయ్య తనవద్ద నున్న తాళపత్ర గ్రంథమాతృకలను ప్రతులు వ్రాసికొనుటకు మదరాసులోని ఓరియంటల్ పుస్తక భాండాగారమువారి కిచ్చియుండెను. వానిలో సోమయాజికృత గ్రంథము లేవి కలవో నాకుఁ దెలియలేదు.

శ్రీ ముట్నూరి సంగమేశము. ఎం. ఏ గారు మొన్న పండుగ సెలవులకు బొబ్బిలి వచ్చినపుడు తాము భామాకలాపములను గూర్చి పరిశోధించుచున్నట్లును అందుల కనుకూలముగ నుండుటకుఁ గోదండ రామకృత భామాకలాపములను బొమ్మలాట కలాపములను సంపాదించి యిమ్మని నన్నుఁ గోరినారు.

ఆ ప్రయత్నములు చేయుచు నే నాయా చోటులకు బోవుచుండ నొక పల్లెటూరిలో నొక గృహస్థుని వద్ద నొక తాళపత్రగ్రంథమును జూచు భాగ్యము నాకు లభించినది. అందు రెండు మూఁడు పత్రములు జదివి విజ్ఞానేశ్వర ప్రబంధమని గ్రహించితిని. వేంకటకృష్ణ సోమయాజికృతమనియు వయ్యది లభింపలేదనియు భుజంగరావుగారు వ్రాసిరని వినియున్నందున నే నా గ్రంథము నిమ్మని వాని నడిగినాను. అతఁ డిరువది రూప్యము లిచ్చి యీ గ్రంథము సంపాదించినట్లును ఆ పైక మిచ్చినచో దాని నొసఁగెదననియుఁ జెప్పెను.

నా కార్థికస్తోమతు లేకున్నను భాషాభిమానము ప్రోత్సహించుటచే నే నా యిరువది రూప్యము లిచ్చి యీ తాళపత్రగ్రంథమును బుచ్చుకొని పెన్నిధిఁగన్న పేదలాగున గృహోన్ముఖుఁడనైనాను.

ఇది నూటయేఁబదేండ్లనాటి గ్రంథము. వ్యావహారికభాషా విలేఖకుఁడు వ్రాసికొనిన ప్రతి ఇది.

వేంకటకృష్ణ సోమయాజి విజ్ఞానేశ్వర ప్రథమాశ్వాసమున నిష్టదేవతాస్తోత్రములును దన ప్రభువగు రాయణప్పరంగారావును బ్రశంసించుటయును జేసెను. పిమ్మట నారాజచంద్రునివద్ద మంత్రిగనుండిన యినుగంటి సీతారామస్వామి సుగుణ సంపత్తిని శ్లాఘించెను. తన తాతముత్తాతల నభివర్ణించెను. సీతారామపురమున వెలసిన శ్రీ సీతారామస్వామికిఁ దన గ్రంథము నంకిత మొనర్చెను.

పంచమాశ్వాసమున

"క. శ్రీ తరుణీ కులాంబుధి నై
వాల్మీక శక్రాది దివిజ వర్గనుత శ్రీ
మూలశ్యామల విగ్రహ
సీతారామపురిధామ సీతారామా!

బొబ్బిలిసంస్థాపకులలో రెండవవాఁడు రాజా లింగప్ప బహదురు. తొలుత నతఁడు రాజామున జాగీరుదారుగ నుండుటచే నచటనుండి పాలించెను. ఆ రాజామునకు నుత్తరదిశను నాలుఁగైదు మైళ్ళ దూరమున సీతారామపుర మున్నది. అచ్చట సీతారామస్వామి ఆలయ మిప్పటికిని సక్రమస్థితిలో నున్నది. బొబ్బిలిరాజుల మొదటి దేవాలయ మదియే—తరువాత బొబ్బిలిలో శ్రీ వేణుగోపాలదేవునియాలయము నిర్మించిరి.

విజ్ఞానేశ్వరము ప్రథమాశ్వాసములోని కొన్ని పద్యములు:

ఉ. శ్రీ వసుధాసుధాకర ప
రిష్కృత రత్నకిరీట ముఖ్య నా
నావిధ భూషణాంకిత ఘ
నాఘన సంనిభ దేహదీప్తి సం
భావితభక్తబహిర్గణుఁ డ
పారకృపామృతరక్షితాంఘ్రి స
సేవక చాతకుండు రఘు
సింహుఁడు మత్కృతి నేలుగావుతన్.

శా. మీమాంసప్రముఖాది శాస్త్రములు కీ
ర్తిం గొల్వగా ఋగ్యజు
స్సామాథర్వణ ముఖ్యవేదములు శ
శ్వద్భక్తి సేవింపగా
ప్రేమం దక్కిన విద్యలెల్ల నుపస
ర్పింపం బ్రకాశించు వా
గ్భామారత్నము బ్రోచుగాత మృదువా
క్సంధాత్రియై మత్కృతిన్.

రాయణప్ప రంగారాయని వర్ణన:

సీ. ప్రాభవాన్వితజనా-గ్రణులలో నెవరైన
తలతురే మదిని స-త్యవ్రతంబు
ధరనహింసావ్రత-పరులలో నెవరైన
నిర్జింతురే శత్రు-నికరములను
విభవజితామర-విభులలో నెవరైన
మానిరే క్షుద్రభో-గానుభవము
ప్రబల కార్యప్రస-వర్తకులలో నెవరైన
నడిపిరే మితభాష-ణ వ్రతంబు
కాంచనములు మణులు-గలిగిన నెవరైన
పుడమి సద్గుణములె-తొడవులనుచు
దాల్తురే ప్రతాప-ధనుఁడు రాయణప్రభూ
విభుని సాటి రారు-విబుధులైన.

మంత్రి యినుగంటి సీతారామస్వామి వర్ణన

శా. ఆ రాజేంద్రునకుం బ్రధానపురుషుం డై వాహినీ
వల్లభుం
డై రాజ్యాభ్యుదయ ప్రయోజనపరుం, డై
భావుకుం డై మహో
దారకుం డై రిపుగర్వనిర్దళన విద్యాయుక్తు డై
యొప్పు సీ
తారామప్రభుమౌళి యాతని చరిత్రం బెంచగా
శక్యమే!

(దారకుండై) తప్పు, దారుండై అననొప్పు—
ఇట్టివియే ఇంకను గొన్ని పద్యములు గలవు.

సీ. కలలోననైన బొం-క్కఁడు బొంక్కనట్టినీ
చులకు దేశాంతర-స్థులను జేయు
గొన డుపాయనముపా-యనము గైకొన్నగు
ణాయులకు చోరదం-డము విధించు
న్యాయరీతిని వ్యవ-హారముల్ దీర్చు న
న్యాయవర్తకుల-కార్యములు జెరుచు
పాలించు ప్రజలను-పాటు దప్పక పాటి
దప్పిన వారి మ-దం బణంచు.
దుర్జనులను ద్రోచు శరణాగ-తులను గాచు
బంధువుల బ్రోచు శత్రుభూ-పతుల నేచు
శ్రితజనాధేయు డిన్గంటి-సీతరామ
రాయ డలరారు విద్వద్వి-ధేయు డగుచు.

సీ. సత్యవర్తనమున-జనుల బాలించును
న్యాయపద్ధతిని ధనంబు గొనును
ధర్మమార్గమున శాత్రవుల నిర్జించును
పౌరుషంబున యశఃపటిమ గాచు
పాత్రం బెరింగి సంభావించు విబుధుల
మొగమాట మందక-తగవుదీర్చు
కాపట్యరహితుఁ డై-గావించు దానంబు
ప్రీతి వర్ధిల్ల నాశ్రితుల బ్రోచు
వినుత గుణుఁడు భాస్వ-దినుగంటి వంశాబ్ధి
తారకారమణుఁడు-సూరివినుత
వితరణుఁడు విలాస-యుతుఁడు సీతరామ
రాయఁ డలరు సుజన గేయుఁ డగుచు—

ఉ. ఆ విభుఁ డొక్కనాఁడు విన-యంబున నిట్లనె
నన్ను జూచి మే
ధావులు ధర్మశాస్త్రకథి-త ప్రబల వ్యవహార
కాండము
ర్వీవరు డింపుమీర చది-వించుట మేలనుచు
న్వచింతు ర
ప్పావన వాక్యముల్ వినిన-పార్థివు డిట్లొనరింప
కుండునే.

క. ప్రావీణ్యము మీరగ మా
రీ విజ్ఞానేశ్వరం బ-హీనచమత్కా
రావిర్భావముగ నాంధ్రము
గావింపగవలయు నట్లు-గాకున్న రొసగన్

క. వ్యవహారకాండమైనం
బ్రవిమలమతి తెనుఁగుజేసి-పండితులగు స
త్కవులు వినుచుండ మాకున్
శ్రవణానందంబు వసుంధ-రం జేయుమనెనూ

(గణభంగము)

వ. యిట్టిధంబున దేవాంశసంభవుండగు నమ్మ
హానుభావుండు వచియించ్చిన నప్పుంసపుంగ్గవుండు
సకలవిధంబుల మాకుం బ్రాపకుండనుటయు తత్కీర్తి
కాముని వచనం బుధయతారకంబగుటయు తదను
మతంబుగా తెనుగింపంబూనిన కృతికి సీతారామ నామ
పరబ్రహ్మస్వరూపుని నాయకునిగా జేయదలంచి
తదీయానంత కళ్యాణగుణంబులలో కొన్ని కొన్ని
గుణంబు లభివర్ణించెద."

పైనిచేర్కొనిన 'ప్రావీణ్యము మీరగ' అను
పద్యమును 'వ్యవహారకాండమైనం' అను పద్యమును
విజ్ఞానేశ్వరంబంతయు ననువదించకపోయినను ముఖ్య

మైన వ్యవహార కాండమునైనఁ దెనిఁగింపుమని యిన్గంటి సీతారామస్వామి కోరుటచేత రాజధర్మంబులఁగూర్చి తెలుపుభాగమును మాత్రమే యాంధ్రీకరింపఁ బూనినట్లు గవి వ్రాసికొనియెను.

తాళపత్రము 22 వెనుకప్రక్క నిట్లున్నది.

గద్య:—ఇతి శ్రీమత్కొట్టికలపూడి కులపవిత్ర వెంకటరామపుత్ర వినుతసుకవిరాజి వెంకటకృష్ణ సోమయాజి ప్రణీతంబైన విజ్ఞానేశ్వర వ్యవహారకాండంబునందు రాజధర్మంబులును రాజశాసననిరూపణంబును..."

పై పద్యములనుబట్టి యిన్గంటి సీతారామస్వామి 1801 నుండి 1830 వరకు బొబ్బిలి నేలిన రాయణప్ప రంగారాయుని దివానుగ నున్నట్లు దెలియును. అతఁ డెట్టిగుణములు కలవాఁడో కవి వర్ణించెను. ఆ దివాను ప్రోత్సాహమున సోమయాజి విజ్ఞానేశ్వర మాంధ్రీకరించి సీతారామునకుఁ గృతియిచ్చెను.

ఇచట నొక విశేషము గానవచ్చుచున్నది.

"వ. ఇవ్విధంబున దేవాంశసంభవుం డగు నమ్మహానుభావుంకు" అనుచు దివానును పొగడెను. "సకలవిఘ్నంబుల మాకుం బ్రాపకుండగుట నిం" అనుట వలన సోమయాజి బహుపాపకార్యముల నందుచుండెననుట స్పష్టము. "ఉభయతారకంబగుటయు" అనుటలో నంతరార్థము ధ్వనించుచున్నది. దైవపరముగా సీతారామస్వామికిఁ గృతియిచ్చుటచే నాముష్మిక కామాప్తియును వ్యక్తిపరముగా దివానునుద్దేశించి ఇనుగంటి సీతారామస్వామివలన నైహికకామాప్తియు సిద్ధించుచున్న భావము ద్యోతకమగుచున్నది.

ఆగ్రంథరచనాకాలమున కింక నాంగ్లేయుల పరిపాలనము సౌష్ఠవముగఁ గొనసాగకుండెను. రాజులించుమించు నిరంకుశులుగ నుండిరనవచ్చు. వారే శాసనాధికారులు. ప్రజాసామాన్యము విద్యావిహీన స్థితిలో నుండుటచే నానాబాధ లనుభవించుచుండిరి. ప్రాచీనకాలమునఁ జాణక్యుని యర్థశాస్త్రము, మనుస్మృతి, గౌతమసూత్రములు, శుక్రనీతి మున్నగు ధర్మశాస్త్ర గ్రంథములు రాజులయధికారాదులను ప్రజల బాధ్యతలను దెలుపుచుండెను. విజ్ఞానేశ్వరము గూడ నట్టిదే సంస్కృతభాషలోఁ గలదు—

ఇచట నినుగంటి సీతారామస్వామినిగుఱించి కొంచెము వ్రాయుట యప్రస్తుతము కాదని యుపక్రమించుచున్నాను.

ఈసీతారామయ్యనే "పెద దివాంజీ వా"రనుట కలదు. పద్మనాయక వంశజుఁడు. రాయణప్పరంగారావునకు ఆప్తబంధువు. ఉంగరాడ గ్రామవాసి. ఆ గ్రామము రాజా లింగప్పరంగారావు పాలించిన కాలమున కుత్తరముగా నేడెనిమిది మైళ్ళ దూరానఁ గలదు. ఆదివాను చండశాసనుఁడనియు నపరచాణక్యుఁడనియు నాఁటిజనులలోఁ ప్రజ లనుకొనుచుండిరి. రాయణప్ప రంగారావు అమాయికుఁడు. నిరంతరాధ్యాత్మికచింతావ్యాసంగమునఁ గాలము బుచ్చుచుండెను. దివానే సర్వతంత్రస్వతంత్రుఁడై రాజ్యమును దన గుప్పిటఁ బెట్టుకొని వ్యవహరించుచుండెను.

అట్టి సీతారామస్వామిని వేంకటకృష్ణ సోమయాజి కడుంగడు బ్రస్తుతించెను. అమాయికులైన రాజులవద్ద సన్నిహితబంధువులు అతితెలివి మేధావులు దివానులుగ నున్నచో "నంబి పెట్టినదే ప్రసాద" మను సామెత నిజమగును.

ఆ సీతారామస్వామినిగుఱించి యొక గాథ నాఁడు నేఁడును బ్రచారమునఁ గలదు. ఆ కారణము చేతనే యినుగంటివారనిన నీ ప్రాంతములలోనివారి కొడళ్లు జడదరించుచుండు నందురు.

సీతారామస్వామి బొబ్బిలి దివానుగ నున్నపుడు పొరుగున గల సాలూరు జమీ నొక రాణి పాలించుచుండెనఁట. వారి గ్రామములు కొన్ని బొబ్బిలి జమీలోపల నక్కడక్కడ నుండెను. పెద పెంకియను గ్రామమట్టిది.

ఆ గ్రామమునకుఁ బశ్చిమముగా బొబ్బిలివారి కృష్ణసాగరమను నొక పెద్దచెర్వు గలదు. దాని దిగువను పెద పెంకి గ్రామ భూములు రైతులు సేద్యము చేయుచుండిరి. వారు సాలూరువారికి క్రమముగఁ బన్నులు చెల్లింపకుండిరి. అటు బొబ్బిలివారితో నీటికై తగవులాడుచుండిరి. దివాను పెద పెంకి గ్రామమును దమకుఁ గ్రయమున కిచ్చినఁ దీసికొందుమని యారాణికి వర్తమాన మంపెను. ఆమె నిరాకరించెననియు నతఁడు బెదరించెననియు నందుమీఁద "మీసమున్న మగవాఁడైనచోఁ జేసుకొనవలసినది చేసుకొ"మ్మని యామె బింకములఁ బలికెననియుఁ జెప్పికొందురు.

వర్షాకాలారంభమైనది. బొబ్బిలి తాలూకాలోని చెరువుల నన్నిటిని దివాను మరమ్మతులు చేయిం

చెను. ఒకనాఁ డాయా గ్రామముల పెత్తనదారుల నతఁడు రావించి యానాఁటిరాత్రి తొలిజామున నందఱు చెఱువులకట్టల నేక కాలమునఁ దెగఁగొట్ట నాజ్ఞాపించెనఁట. వారట్లు గావించిరి.

అర్ధరాత్రమగుసరికి చెర్వుల నీరు కృష్ణసాగరమునఁ బడినది. దానికట్ట తట్టుకొనలేక తెగినది. ప్రవాహము మిక్కిలి యురవడితోఁ బెదపెంకివారి భూముల మీఁద నుండి ప్రవహించి చాలలోతుగ మట్టిని పెకల్చినది. ఆప్రదేశమున నొక వాగేర్పడి నేటికి నట్లే యున్నది!

నాఁటనుండి యా గ్రామభూములు కొన్ని పూర్తిగా వ్యవసాయ యోగ్యములుగాక పంటల కలవి కేర్పడఁ జొచ్చెను. సాలూరు రాణి ప్రగల్భములు పలికి యొట్లయిన బొబ్బిలివారు క్రయానికిఁ దీసికొనుచో విక్రయించు సంసిద్ధతను దివానునకుఁ దెలిపెను. అతఁడు మురిపించి చివఱకుఁ గైకొనెనఁట.

ఇందలి నిజానిజము లటుండుఁగాక. ఆ సీతారామస్వామి చతురత్వమిట్టిదట. ఈ గాథ యొక యుదాహరణముగ జనులు చెప్పికొందురు. అతఁ డెంతటి కఠినహృదయుఁడో యంతటి దయామయుఁ డందురు. సోమయాజి పద్యములలో నా విషయములఁగూడ ధ్వనితము లగుచున్నవి.

“పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే” అని లోకోక్తి. అట్టి మేధావి, కార్యదక్షుఁడు, రాజనీతిజ్ఞుఁడు అయిన సీతారామస్వామికిఁ జరమదశయందు రాచకురుపు వీఁపుపైఁ బుట్టెను. అతని “పరువము, కలిమి, దొరతనము” జూచి సహింపనోపక మృత్యుదేవత యతనిం దన పొట్టబెట్టికొనినది. బొబ్బిలి సంస్థానము నుద్ధరించినవారిలో నాతఁడే యగ్రగణ్యుఁడని ప్రతీతి.

ఇఁక నాముష్మికోపాప్తి నాశించి శ్రీ సీతారామస్వామి పరబ్రహ్మమునకుఁ గృతియిచ్చుచు సోమయాజి విరచించిన స్తోత్రపద్యములు.

సీ. శ్రీ భాస్కరాన్వయ - క్షీరాబ్ధిచంద్రుఁడై
దనరె నెవ్వాఁడు స - ద్గుణము దనర (ద్గు)
బాల్యంబునను దివ్య - బాణంబుచే తాట
కను ద్రుంచె నెవ్వాఁడు - మునులు పొగడ
మారీచముఖ్యాసు - రారుల గెలిచి ర
క్షించె నెవ్వాఁడు కౌ - శికుని మఖము (మ)
పాదాబ్జరజముచే - పాషాణ మింతిగ
గావించె నెవ్వాఁ డ - ఖండ మహిమ
దేవతలు మెచ్చ నెవ్వాఁడు - దేవదేవు
విల్లు నడిమికి విరిచి పృ - థ్వీతనూజ
పరిణయంబయ్యె నట్టి దీ - వ్యత్ప్రతాపు
భానువంశ ప్రదీపుని - ప్రస్తుతింతు

కొన్ని పద్యాంతిమములు

క. ఏవంవిధ సుగుణమణికి వి
భావసుకులజాగ్రతికి నృ-పగ్రామణికిం
శ్రీ వైదేహీముఖరా
జీవనభోమణికి భక్త-చింతామణికిన్

క. రామునకు తిరస్కృత భృగు
రామునకు మహీసుతాభి-రామునకు ఘన
శ్యామునకు విశ్వవిదిత సు
త్రామునకు కకుత్స్థకుల సుధా-ధామునకున్.

క. ధీరునకు బద్ధపారా
వారున కరివీరదునిశా-వారునకు మహో
దారున కతి సుకుమారా
కార నిరాకృత బలాంతకకుమారునకున్.

క. పాషాణీకృత గౌతమ
యోషాదోషాపహరణ-యోగ్యాంఘ్రికలా
శేషణ తత్పరయోగిమ
నీషాస్థానస్థితాచల-నియుక్కృతికిన్.

క. రాజాధిరాజునకు వి
భ్రాజిత తేజునకు సకల-భక్తామర ధా
త్రీజన కుగ్రసువాసీ
రాజమనఃపిహిత మృదుప-దాంభోజునకున్.

క. కౌసల్యా సూనునకు వి
లాసరతీసునకు భుజబ-లక్షుభిత ఖరా
ద్యాసుర కులీనునకు నిజ
దాసమనః కుముదవనసు-ధాభానునకున్.

క. శ్రీ వైదేహీ వీక్షణ
జీవంజీవావళీ ప్ర-సేవిత వదనేం
దీవర బాంధవ బింబా
ప్రావిత దరహాస బంధు-రజ్యోత్స్నునకున్.

పంచమాశ్వాసాంత గద్య మిట్లున్నది:

"ఇతి శ్రీమత్కొట్టికలపూడి కులపవిత్ర వినుత సుకవిరాజ - వేంకటరామపుత్ర వినుత సుకవిరాజ వేంకటకృష్ణ సోమయాజి ప్రణీతంబైన విజ్ఞానేశ్వరం బను వ్యవహారకాండంబునందు అస్వామివిక్రయ ప్రకరణంబును దత్తాప్రదానికంబును దత్తానపాకర్మ ప్రకరణంబును కుటుంబవిరుద్ధదాన తిరస్కారణంబును క్రీతానుశయంబును సువర్ణాదిపరీక్షణంబును వేతనానపాప్రకరణంబును వాక్పారుష్యంబును దండపారుష్యంబును సాహసప్రకరణంబును వైజికదండంబును తులాదికూటకృద్దండంబును సారద్రవ్యాసారద్రవ్య సమ్మేళనదండంబును విక్రయాసంప్రధానంబును (మొదలగునవి).

వేంకటకృష్ణ సోమయాజి కవిత్వమునందుఁ దత్సమపదజాల మెక్కువగాఁ గాన్పించును. అచ్చ తెనుఁగు పదములు తక్కువ. కవిత్వ సంప్రదాయములకుఁ బ్రాముఖ్యత కానరాదు. విజ్ఞానేశ్వరము కేవలానువాదగ్రంథ మగుటఁజేసి భావప్రాధాన్యతయే యధికము. సంస్కృతపండితుఁ డగుటచేతనే ధర్మశాస్త్రము నాంధ్రపద్యగ్రంథముగా ననువాదము చేయఁగలిగెను. ఆతని స్వతంత్ర భావములు జొప్పించుట కవకాశములు తక్కువ. కవిత్వ రీతులు చూపినచో ననువాదములో భావస్ఫురణము సన్నగిల్లునని యతఁడా ఫక్కి ననుసరింపకపోవచ్చును.

సోమయాజి కుమారుఁడే కోదండరామకవి యగుటచేత నతఁడు మనుస్మృతినిఁ బద్యరూపముగఁ దెనిగించెను.

వేంకటకృష్ణ సోమయాజి పౌత్రుఁడు వేంకటకృష్ణ సోమయాజి యున్నట్లు వెనుకఁ బేర్కొని యుంటిని. ఆతనిగూర్చి సంగ్రహముగ వ్రాయుచున్నాను.

## పౌత్రుఁడు వేంకటకృష్ణ సోమయాజి

ఈ సోమయాజి కీ. శే. బొబ్బిలి మహారాజావారి, వారి తల్లిగారి, వారి పితామహుల యాస్థానముల యందు బాల్యమునుండి యున్నవాఁడు. దిలీపచరిత్రాది, ప్రబంధకర్తయగు వేంకటకృష్ణ సోమయాజి పౌత్రుఁడు రామదాసుకుమారుఁడు. 1825వ సంవత్సరము సెప్టెంబరు నెలలో జన్మించి దీర్ఘాయుష్మంతుఁడై రాజాదరణ పాత్రుఁడై రాజకీయములలో ప్రముఖపాత్ర నిర్వహించి ప్రశాంత జీవితము చరమదశలోఁ గడిపి 1912 వ సంవత్సరము ఆగస్టు 12 న బరమపదించెను.

బొబ్బిలిపురమున "బుధానందినీసభ" ను మహారాజావారు స్థాపించి రందు సోమయాజి కార్యదర్శిగ జాలఁ గాలముండెను. అతఁడు పెక్కువ్యాసములు వ్రాసి సమావేశములలోఁ జదివి ప్రశంసింపఁబడెను. ఆతని రచనలు.

1. కన్యాశుల్క నిషేధము. ఇయ్యది 1894 న మహారాజావారి సంపాదకీయమున ముద్రింపఁబడినది.

2. విధవావివాహనిరాసకోపన్యాసము. కీ. శే. కందుకూరి వీరేశలింగముగారి వాదములను శాస్త్రీయముగ ఖండించుచు వ్రాసినది. దీనిని మహారాజావారే 1896 లోఁ బ్రచురించిరి.

3. ఆశౌచనిర్ణయము, కేవల ధర్మశాస్త్ర చర్చ. ఆ గ్రంథమున సోమయాజి యనంతర మాతని కుమారుఁడు 1915 లో బ్రచురించిరి.

4. ధర్మశాస్త్ర విషయకోపన్యాసము.

5. హిందూమతము.

6. హోరారిక చంద్రిక. జ్యోతిష గ్రంథము. మహారాజావారు 1919 లో సోమయాజి మరణమునకు రెండేండ్లముందు ముద్రింపించిరి.

ఇవిగాక అతని వింక నెన్నో యముద్రితముగ నుండెను.

ఇతఁడు ధర్మశాస్త్రములు పూర్ణముగఁ ద్రచ్చిన మేధాసంపన్నుఁ డగుటచేత బొబ్బిలి సంస్థానాధిపతులకుఁ బెక్కువిధముల దోడ్పడి వారివారి యనుగ్రహపాత్రుఁడయ్యెను.

మహారాజావారిని వేంకటగిరి రాజకుటుంబము నుండి దత్తస్వీకారము చేసికొనిన బొబ్బిలి రాణి లక్ష్మీచెల్లమాంబ సోమయాజికి సంతోషపూర్వకముగ 1873 సంవత్సరమునఁ జినభోగిలి యను గ్రామమున గొంతభూమిని దానపూర్వకముగ నొసఁగి సత్కరించెను. ఆ దాన'పట్టా' రిజిష్టరు చేయఁబడినది.

ఆతఁడు సంస్కృత నాటకములను జదివి యాశ్రితబంధుమిత్రసమక్షమున నాయాపాత్రముల

యాచితినిగూర్చి చెప్పెడివాఁడు. ముద్రారాక్షస మాతని యభిమాన నాటకము.

ఇతఁడు మెల్లఁగా చిఱునవ్వుమోముతో మాటలాడు స్వభావము గలవాఁడు. భావపూరిత వాక్చమత్కృతి యాతని సొమ్ము.

ఈ సోమయాజికి నలువురు భార్య లొకరితరువాత నొకరుగలరు. రెండవభార్య కిరువురు పుత్రికలు. నాల్గవభార్య వలమాంబ. ఈమె కుమారులలోఁ గొందఱు సజీవులై యున్నారు. తక్కినవారికి సంతానము లేదు.

విజ్ఞానేశ్వరములోని పద్యములు పాఠకులకుఁ బరిచయముకొఱకు వ్రాయుచున్నాను.

1 వ ఆశ్వాసములో

గీ. భీతిచేనైన రాగంబు-చేతనైన
లోభముననైన ధరణిపా-లున కధర్మ
శరణ ముపదేశ మొనరించు - సభ్యులెల్ల
తద్వివాదాతిశయమందు - దండ్యు లరయ.

ఆ. దైవబలము లేని-తరి పౌరుషంబెంత
ప్రబలమైన నూటి-పడదు కార్య
సరణి యనుచు పౌరు-షము మానరాదు భూ
పతికి భూషణంబు - పౌరుషంబు.

క. దైవబలంబ్బున పురుష
ప్రావీణ్యంబునను కర్మ-ఫలసిద్ధి యగున్
కేవల దైవగతిన్ ధర
జీవల్లభునకు ఫలించు - నే విభవంబులూ.

2 వ ఆశ్వాసములో

ఆ. కొడుకు ఋణము దీర్చు-కొనవహుజ్ఞాదైన నా
గాక (తగిన) తగిన వయసు - రాకమునుపు
విత్త మిమ్ముటంచు - నుత్తమర్ణుఁడు వాని
చెంత కరిగ నేని - శిక్ష నొందు.

క. గురుశిష్యులకు ధరిత్రీ
శ్వర భటులకు దంపతులకు-జనక సుతులకుం
నరపతి వ్యవహారపు నై
ఖరులు విచారింప తరచు-గా జనదు సుమీ.

3 వ ఆశ్వాసములో

క. వనితల వ్యవహారములకు
వనితల సాక్ష్యములు నిలుప-వలయును శేషిం
చిన సంకరజాతులకు
విను సంకరజాతి సాక్ష్య - విధి జరుపదగున్.

4 వ ఆశ్వాసములో

చ. జనకుఁడు, తల్లి, భర్త సహా-జ వ్రజ మిచ్చిన
సొమ్ము పెండ్లి చే
సెను నిజదేహబంధువు ల-లంకరణార్థ
మొసంగునట్టి కాం
చన మణిభూషణాది విల-సద్రవిణంబులు
రిక్థ ముఖ్య కాం
చనములు స్త్రీధనంబు లని - శాస్త్రములందును
గాన నెఱ్యోకున్

గీ. వినుము జీవించియున్న కా-మినుల ధనము
ధవతనూజాది దేహబాం-ధవులు బలిమి
బుచ్చుకొనిన వారికి-భూవిభుండు
మించి తస్కరశిక్ష గా-వించవలయు.

5 వ ఆశ్వాసములో

క. మాయాద్యూత క్రీడా
పాయంబుల మానవుల క-పాయంబగు, భూ
నాయకుఁ డా మాయావుల
శ్రీయుతుడై తోలవలయు-దేశము వెడలన్.

గీ. స్వల్పమూల్యార్జితములైన-వస్తువులకు
ప్రబలమూల్యప్రభాకార-పరిమళములు
గూర్చి యమ్మిన యతి దుష్ట-గుణఘనంబు
క్రేతలకు క్రమ్మర సమ-ర్పింపవలయు.

భాషాభిమాను లీ గ్రంథోద్ధరణకు బ్రయత్నింతురు గాక.

# అమ్మ

శ్రీ కొఠారి హనుమంతరావు

రైలు అమిత వేగంతో టకటకమని కటువైన శబ్దాలని చేసుకొంటూ ఏవో చిన్న చిన్న స్టేషన్‌లనీ, వాట్లలోనుండి తెల్లబోయి ఆగకుండా పోతున్న రైలుని చూస్తున్న జనాన్ని, అక్కడక్కడ చెరువులని, కాలువలని, బీళ్లనీ పొలాలనీ దాటుకొంటూ పోతున్నది. అంతా మాయగా, బొమ్మలాటలాగ అనిపిస్తున్నది నాకు. నా మనస్సుమాత్రం రెపరెపలాడుతూ రైలుకన్నా వేగంగానే ముందుకి ప్రయాణంచేస్తున్నది. ఎప్పుడో రెండుమూడు సంవత్సరాలకి ఒకసారి సెలవుమీద తెనుగుదేశంలోకి రావడం, చుట్టాలనూ, స్నేహితులనూ చూడ్డం అనేది ఉద్యోగరీత్యా ఇతర ప్రాంతాలలో సెటిల్ అయిపోయిన నాబోటివాళ్లకు ఉత్సాహాన్ని కలిగిస్తూ వుంటుంది. ఆదివారంనాడు బయలుదేరి వస్తున్నానని బెజవాడలోఉన్న మా చెల్లెలు లక్ష్మికీ, విశాఖపట్నంలోఉన్న నా ముఖ్య స్నేహితుడు రమణకీ ఉత్తరాలు వ్రాశాను. విశాఖపట్నంలో ఒకటో రెండో రోజులు ఉండి బెజవాడ వెళ్దామని సంకల్పం, కాని సెలవు ఇంకా తొందరగానే సంపాదించి శుక్రవారంనాడే బయలుదేరాను. ఈసారి నా తొందరకి తగినంత కారణం లేకపోలేదు. మా చెల్లెలినీ దాని పిల్లలనీ చూసి రెండేళ్లయింది. దానికి ఇద్దరు కూతుళ్ల తర్వాత పుట్టిన మొదటికొడుకుని ఇంకా నేను చూడనే లేదు. కాగా మా స్నేహితుడు రమణకి ఈమధ్యనే పెళ్లయింది. అతడిని చూడాలని ఎంతో ఆదుర్దాగా వుంది. అయిదేళ్ళయింది అతడిని చూసి.

అయిదేళ్ళు! నేనిప్పుడు చెయ్యగలిగిందల్లా ఈ అయిదేళ్లనూ తలచుకొని ఒక దీర్ఘనిశ్వాసం విడవడమే. నా జీవితం నా అదుపులోనుంచి ఏనాడో తప్పిపోయింది. ఇంక అది బాగుపడదు. నాబోటి మనుష్యులు సుఖపడడంకోసం పుట్టరు. కారణం జీవితంలో సుఖపడడం అంటే ఒక నిశ్చితాభిప్రాయం లేకపోవడమే. కాని నాకుపూర్తిగా విరుద్ధం మా రమణజీవితం. ఈ అయిదేళ్లలోనూ రమణ జీవితాన్ని బాగా లొంగదీసుకొన్నాడు. పరిస్థితులను బాగా ఉపయోగించుకొని వృద్ధిలోకి వచ్చేడు. యమ్. యస్. సీ ఫస్టుగా పేసయాడు. ఆంధ్రాయూనివర్సిటీ కాలేజీలో లెక్చరరుగా పనిచేస్తున్నాడు. వచ్చే ఏడాది అమెరికా వెళ్తాడట! అతడి గృహస్థజీవితం ఎంతో హాయిగా ఉంది. అతడు ప్రేమించి పెళ్ళి చేసుకొన్నాడు. జీవితంలో రమణ బాగుపడ్డందుకు నాకు సంతృప్తిగా, సంతోషంగా ఉంది.

నేనూ, రమణా గాఢ స్నేహితులమైనా అతడికీ నాకూ అభిరుచులలో గాని, అభిప్రాయాలలో గాని, కనీసం శారీరకమైన రూపంలోనూ, పొడుగులోనూ గాని ఏమీ సామరస్యం లేదు. అతడు ఒడ్డూ, పొడుగూ ఉన్నవాడు. బలిష్ఠుడు. అందగాడు. నేనందుకు పూర్తిగా విరుద్ధం. అతడికి కార్యకలాపాల ప్రమేయం ఎక్కువ. హుషారుగా పదిమందితో పరిచయం కావాలని కల్పించుకొని నవ్వుతూ తిరిగే స్వభావం. అందర్నీ ఆకర్షిస్తాడు. కాని వెకిలి మనిషి మాత్రం కాడు. అతడిది గట్టివ్యక్తిత్వం. మనస్సులో లోతు ఉంది. అతడికి నేనంటే ఎంతో అపేక్ష. అందుకనే అతడికి పరిచయస్థులు ఎందరో ఉన్నా నా ముందు మాత్రం ఎంతో చనువుగా దాచుకోకుండా మాట్లాడతాడు. గత ఐదేళ్ళగా మేమిద్దరం కలుసుకోకపోయినా, ఎడతెగకుండా ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతూనే ఉన్నాయి.

నేనూ రమణా చిన్నతనంనుంచీ స్నేహితులం కాదు. విజయనగరంలో ఇంటరు చదివే రోజుల్లో ఇద్దరికీ పరిచయం కలిగింది. ఇద్దరం ఒకే క్లాసు. ఒకే

గ్రూప్‌లో ఉన్నా అంతమంది మధ్య ప్రత్యేకంగా స్నేహంచేసే అవకాశం నాకు అంతగా లేకపోయేది. చిన్నతనం నుంచీ నాకు ఏకాకిగా ఉండే గుణం ఎక్కువ. స్నేహితులను అన్వేషించను. రమణతో పరిచయం కూడా దానంతట అదే వచ్చింది. నేనూ, రమణా బేడ్‌మిన్‌టన్ కోర్టులో కలుసుకొనేవాళ్ళం. అతను బేడ్‌మిన్‌టనే కాక ఎన్నో ఆటలు ఆడేవాడు. నేనొక్క బేడ్‌మిన్‌టన్ మాత్రం బాగా ఆడేవాడిని. అతను నన్ను ఆటలో మెచ్చుకొనేవాడు. మా పరిచయం అట్లా ఆరంభం అయింది. అతను పరీక్షలలో చాలా బాగా మార్కులు తెచ్చుకొనేవాడు. కష్టపడి చదివేవాడు. అతడి నిత్యజీవితంలో ఎంతో దీక్ష ఉండేది. నేనంత శ్రద్ధగా చదవలేకపోయేవాడిని. నాకా సైన్సుపాఠాలు అంతగా గ్రహింపుకు వచ్చేవి కావు. అది గమనించే ఎలాగో అదృష్టవశాత్తూ ఇంటరు పేసయాక బి. యస్. సీ కాకుండా బి. ఏ. లో చేరడానికి ప్రయత్నించాను. నాకు సాహిత్యంలో అప్పటికే కొంత సరదా ఉండేది. అందుకని బి.ఏ.ఇంగ్లీషు, తెలుగో చదువుదామనుకొన్నాను. కాని నాకందులో ప్రవేశార్హత లేకపోయింది. బి.యస్.సీ. లో చేరవలసి వచ్చింది. దానితో నాకు చదువుమీద విరక్తి కలిగింది. ఈ కాలేజీ చదువంతా నాకేదో ద్రోహం చేస్తున్నట్లు బాధ కలిగేది. క్లాసులో వెనక బెంచీలమీద కూర్చొని టాగోరు రచనలు, హార్డీ నవలలు చదువుకొనేవాడిని. ఆ రోజులని తలచుకొంటే ఇప్పుడు నాకు నవ్వొస్తుంది. విచారం కలుగుతుంది. కాని అప్పుడుమాత్రం క్లాసులో పాఠాలు వినకుండా సాహిత్యం చదువుకోవటంలో నా మట్టుకు నాకు బాగా తృప్తిగా ఉండేది. చివరికి నేను బి. యస్. సీ. పేసు కావడానికి రమణే కారణం. ఇన్నాళ్ళూ రమణారావు అని రాసుకొనేవాడు నా కోరికను మన్నించి ఈసారి పరీక్ష అప్లికేషన్‌లో పూర్తిగా జానకీరమణారావు అని రాసుకొన్నాడు. అంచేత అతడూ నేనూ పరీక్షలో ప్రక్క ప్రక్కల్నే పడ్డాం. అదే నేను పరీక్ష పేసుకావడానికి కారణం. తర్వాత నేను రైల్వేలో ఉద్యోగం సంపాదించి తెనుగుదేశం విడిచిపోయాను. నా అభిరుచులకీ, చదివిన చదువుకీ, చేస్తున్న ఉద్యోగానికీ ఏమీ సంబంధం లేదు.

ఇదంతా నాకూ రమణకూగల సాధారణ పరిచయం. దీనికన్నా మా స్నేహానికీ, పరస్పర ఆకర్షణకీ ముఖ్యకారణం ఉంది. రమణకి తండ్రి లేడు. చిన్నప్పుడే చచ్చిపోయాడు. అతనిని పూర్తిగా వాళ్ళ అమ్మే పెంచింది. నాకు తల్లి లేదు. మా చెల్లెలు లక్ష్మి పుట్టిన ఏడాదికి మా అమ్మ చచ్చిపోయింది. మా అమ్మ ఎలా ఉండేదో కూడా నాకు జ్ఞాపకం లేదు. మా చెల్లెలు అచ్చు మా అమ్మ పోలికేనని మా నాన్నగారు అనేవారు. లక్ష్మిని చూసి గతించిన మా అమ్మను చూసినట్లే సంతృప్తిపడి దుఃఖపడతాను.

నాకు రమణ అత్యంత సన్నిహితుడు కావడానికి ఈ లేడాయే కారణం. అతను తల్లి తనని చిన్నతనంనుంచీ ఎంత కష్టపడి పెంచిందో చెప్పేవాడు. నేను మా అమ్మని జ్ఞాపకం చేసుకొంటూ వినేవాడిని. రమణని పెంచటంకోసం అతడి తల్లి పడిన కష్టం అంటూ లేదు. అసలే బీదగా ఉండే వాళ్ళ కుటుంబం రమణ తండ్రి మరణంతో వీధిని పడింది. అతడి తల్లి అప్పుడు ఇంకొకరి ఇంట్లో వంట మనిషిగా చేరి రమణని పోషించింది. అతను కొంచెం పెద్దవాడయాక నోటి మంచితనం చేత వాళ్లదగ్గిరా వీళ్లదగ్గిరా ప్రాధేయపడి వారాలు సంపాదించి పెట్టింది. తను సంపాదిస్తున్న ఆ కొద్దిపాటి డబ్బుతోనూ అతడిని స్కూలులో ప్రవేశపెట్టింది. జీతం కట్టడానికి డబ్బు చాలకపోతే ఫ్రీ అని నలుగుర్నీ యాచించింది. అతను ఒక్కొక్క క్లాసే పేసవుతూ పైకి వస్తూవుంటే అతడిమీద ఆమె ప్రోగు జేసుకొంటున్న ఆశలు కూడా ఒక్కొక్కమెట్టే హెచ్చుతూ వచ్చేయి. రమణపరీక్ష పేసయిన రోజున "పరీక్ష పేసయావమ్మా!" అని ఆమె రెండు పాదాలకీ నమస్కారం చెయ్యడం అలవాటు. అలాగే స్కూల్ ఫైనల్ పేసయిన రోజున కూడా చేశాడు. ఆమె ఆనందంతో మాట్లాడలేక పోయింది.

"సంతోషం నాయనా! అదేదో ఉద్యోగం అన్నావు: ఇంజనీరుగారిని బతిమాలుకొని ఆ ఉద్యోగం అయేటట్టు ప్రయత్నిస్తే మన కష్టాలు గట్టెక్కుతాయి." అంది కొంతసేపటికి.

"అవును. ఇప్పుడే ఇంజనీరుగారి దగ్గిరకి వెళ్తున్నాను" అన్నాడు రమణ. రమణ స్కూల్ ఫైనల్ ఫస్టుగా పేసయాడు. అతడికి కాలేజీలో చదవాలని

ఉంది. కాని ఆ ఉద్దేశం అమ్మతో చెప్పలేదు. తన చదువుకోసం అమ్మ ఎంత కష్టపడుతోందో ప్రత్యక్షంగా చూస్తున్నాడు. చేతులారా ఇంకా ఆమెను కష్టపెట్టలేడు.

కాని తీరా ఆ ఇంజనీరు గారిని ఉద్యోగానికి సిఫార్సు చెయ్యమని అడిగితే .స్కూల్ ఫైనల్ క్వాలిఫికేషన్‌తో ఏమాత్రం ఉద్యోగం వస్తుంది అని నవ్వు చెప్పి, చదువుకొని వృద్ధిలోకి రాతగినవాడు కనుక బి. ఏ. వరకూ చదువుకయ్యే ఖర్చు తను భరిస్తానని మాట ఇచ్చి కాలేజీలో చేర్పించారు. వారి ప్రోత్సాహంవల్లనే రమణ బి. యస్. సీ వరకూ అడ్డు లేకుండా పేసయాడు. బి. యస్. సీ. లో కాలేజీకి ఫస్టుగా పేసయాడు. అంచేత కాలేజీలో డిమాన్‌స్ట్రేటరు ఉద్యోగం లభ్యమయింది. అలా రెండేళ్లు పనిచేసి, కొంత డబ్బు కూడబెట్టుకొని, ఆంధ్రా యూనివర్సిటీకి వెళ్లి ఎమ్. యస్. సీ చదివి పాసయాడు. తర్వాత అక్కడే ముందు డిమాన్‌స్ట్రేటరుగా చేరి ఇప్పుడు లెక్చరరు అయాడు.

రమణకోసం అతడి తల్లి మొత్తంమీద ఇరవై సంవత్సరాలు కష్టాలు పడింది. ఈ కష్టాలన్నిటిలోనూ ఒక్కటిమాత్రం రమణ హృదయంలోకి హత్తుకుపోయింది. మా స్నేహం బాగా అభివృద్ధి చెందాక ఎంతో మనస్ఫూర్తిగా ఒకనాడు నాతో చెప్పేడు—

"అంతవరకూ నాకు మా అమ్మఅంటే ఎంతో భక్తి ఉండేది. ఒక నిర్మల దేవతామూర్తిని చూసినట్లు చూసేవాడిని. కాని ఆ వేళతో గాలివంటి నా ఊహలన్నీ పోయి చిక్కని నిజాన్ని ఎదుర్కొన్నాను. మా అమ్మని దొంగగా సహించలేక బాధపడ్డాను. కాని దొంగతనం చేసింది నా స్వంత అమ్మ! నాకోసం! ఓర్చుకోక తీరదు" అన్నాడు. రమణ స్కూల్ ఫైనల్ పరీక్షకి కట్టడానికి డబ్బు సంపాదించే అన్ని ప్రయత్నాలూ విఫలంకాగా చివరకు ఆమె ఈ పనిచేసింది. మరో పరిస్థితిలో ఐతే ఆమెను నిలువునా కోసినా దొంగతనం చెయ్యదు. కొడుకుకోసం నీతిని చంపుకొని దొంగతనం చేసింది. దొంగతనమే కాదు, అతడికోసం ఏమైనా చేస్తుంది. ఇది ఆమెలో దైన్యమో, ఔన్నత్యమో మాత్రం నాకర్థం కాలేదు.

ఇలా నాతో తన మనస్సులో దాచుకొన్న విషయాలు ఎన్నో చెప్పేవాడు. అవన్నీ ఇప్పుడు జ్ఞాపకం వచ్చి ఆరాటం కలుగుతోంది. రైలు భయంకరమైన రాత్రిలోంచి పోతోంది. నాకేమో ఒక లోకంలోంచి ఇంకో లోకం లోకి పోతున్నట్లుగా అనిపించింది, ఆ చీకటీ, ఆ రైలూ, ఒంటరిగా ఆ ప్రయాణమూను. నేను మెల్లిగా చోటు చేసుకొని పడుకొన్నాను. కాని నిద్రమాత్రం అంత తేలికగా రాలేదు.

రైలు వాల్తేరు చేరేసరికి మర్నాడు ఉదయం పది గంటలు దాటింది. కంపార్టుమెంట్ గేట్ దగ్గర నిలబడి ప్లాట్ ఫారంమీద రమణకోసం చూశాను. దూరంగా కనిపించాడు. చెయ్యి ఊపి నావైపై ఆగబోతున్న దిక్కుకి తొందరగా వచ్చేడు. రైలు దిగేసరికి నాచేతిని అతడిచేతిలోకి తీసికొన్నాడు. ఎంతో అప్యాయంగా మాట్లాడాడు. రైల్లో ఉన్నంతసేపు ఇదివరకంత స్వేచ్ఛగా నిస్సంకోచంగా నేనూ, రమణా మాట్లాడుకొంటామా అని ఒకమూల అనుమానిస్తునే ఉన్నాను. కాని ఆ అనుమానాలన్నీ వాయుఘాత మేఘాలవలె చెదరగొట్టాడు రమణ. నాభుజంమీద చెయ్యివేసి స్టేషన్ లోంచి బయటికి తీసుకువెళ్లాడు. నేను కుశల ప్రశ్నలు చేశాను.

"మీ అమ్మగారు ఆరోగ్యంగా ఉన్నారా?" అని అడిగాను.

"ఆ! ఉంది." అన్నాడు ముక్తసరిగా. ఇంటికి వెళ్ళగానే భార్యని నాకు పరిచయం చేశాడు. ఆమె ఒట్టి చదువుకొన్నదే కాదు. నిజంగా తెలివైనదీ, చురుకైనదీని. నా భోజనాదులభారం అంతా ఆమెకే వదిలేసి "కాలేజీకి వెళ్లొస్తాను బ్రదర్ రెస్టు తీసుకో. మధ్యాహ్నం ఐదింటికల్లా వచ్చేస్తానులే" అని వెళ్ళిపోయాడు. రోజూ పొద్దున్నే వెళిపోతాడట. ఇంటికొచ్చేసరికి రాత్రి ఏడు గంటలు దాటుతుందట. ఆవేళ నాకోసం పెందరాళే వస్తాడన్న మాట! "అవును మరి. కాలేజీపని చేస్తూ స్వంత రిసెర్చి చేసుకోవద్దూ" అని సరిపెట్టుకొన్నాను. సాయంకాలం ఐదుగంటలకి రమణ వచ్చేడు. నేనూ, రమణా, అతడిభార్యా రాత్రి సినిమాకి పోయాం.

మర్నాడు ప్రొద్దున్న నేను బద్ధకంగా ఇంకా ఏపనీ తోచకుండా కూర్చున్నాను. అతడు స్నానం చేసి, బట్టలు వేసుకొని తయారైనాడు.

"ఎక్కడికి?" అన్నట్లు చూశాను.

"కొద్దిగా పనుంది. కాలేజికి వెళ్ళివస్తానోయ్. ఒంటిగంటవుతుంది నేను వచ్చేసరికి. నాకోసం చూడక నువ్వు భోజనం చేసెయ్" అన్నాడు.

"ఇవాళ ఆదివారం కదటోయ్! కాలేజీ ఏమిటి?" అన్నాను.

"మా రిసెర్చి డైరెక్టరుది అంతా ఒక ప్రత్యేక గుణం లే. అతనికి ఇంట్లో పనీ పాటూ ఏమీ వుండదు. ఆదివారం నాడు ప్రత్యేకంగా వచ్చి డిపార్టుమెంట్లో పీకమీద కూర్చుంటాడు. ఆ వేళ ఎవరెవరయితే కనిపిస్తారో వాళ్ళంతా శ్రద్ధగా రిసెర్చి చేస్తున్నట్లు, లేని వాళ్ళు ఎందుకూ కొరగాకుండా తిరుగుతున్నట్లూ నిర్ధారణ చేసుకొంటాడు. ఇవాళ నన్ను ప్రత్యేకంగా రమ్మనికూడా చెప్పేడు. ఉద్యోగంలో బాస్ అన్న వాడు ధర్మకొద్దీ దొరుకుతూవుంటాడు" అని వెళిపోయాడు. నాకేమీ ఆ ఇంట్లో తోచలేదు. ఊళ్ళో ఇంకెవ్వరూ తెలియదు. నా పరిస్థితి గమనించి లోపల పని చేసుకుంటున్న రమణ భార్య నాకు రమణ పుస్తకాల షెల్ఫు చూపెట్టి వెళిపోయింది. నేను ఆ పుస్తకాలు తిరగ వెయ్యసాగాను కాని అవికూడా నాకంతగా సరదా కలిగించలేదు. వాట్లలో కొన్ని నేను ఏనాడో చదివేసినవి. తక్కినవి నాకు సంబంధించనివి.

ఆ సమయంలో వచ్చింది రమణ తల్లి. నిన్న మధ్యాహ్నం ఒక్కసారి కనిపించింది. మళ్లీ ఇప్పుడే కనిపించడం.

"అయితే నువ్వు ఏ ఊళ్లో ఉంటున్నావు బాబూ?" అడిగింది.

"చక్రధర్ పూర్ లో ఉంటున్నానండీ."

"జీతం ఏమిస్తారు?"

"ఏదో నూటపాతిక."

"చాలా చిక్కిపోయావు."

"ఒంట్లో ఆరోగ్యంగా ఉండడం లేదండీ."

"నా ఒంట్లోనూ ఆరోగ్యం సరిగా లేదు. నాయనా! ఒకపూట తింటే ఇంకోపూట సయించదు. నీతో మందు పుచ్చుకొందామా అంటే ఈ ఇంట్లో నా గోల ఎవరికి పట్టింది? నేను చచ్చేనో బ్రతికేనో చూసేవాళ్లెవరు?" అంటూనే ఆమె కూలబడి బొట బొట కళ్ళనీళ్లు కార్చేసి పైటతో తుడుచుకొంటూ వెక్కి వెక్కి ఏడ్చేసింది. నేను బిత్తరపోయి చూశాను. ఆమె హఠాత్తుగా శ్రుతి హెచ్చించి "అర్ధాన్నపు అడివి ఐపోయింది నా బ్రతుకు. చిన్నప్పటినుంచీ వాళ్లింటా వీళ్లింటా వంటపని చేశాను. ఇప్పుడు కొడుకు పంచనే వంటదానిలా ఉన్నాను. నామాట ఎవ్వరూ వినరు. చిన్నప్పటినుంచీ నెత్తురు పిండుకొని పోషించాను. ఇప్పుడు వాడూ పెళ్లాం ఒకటైపోయి నా మాట వినకుండా నన్ను అష్టకష్టాలూ పెట్టి బ్రతికి నియ్యకుండా చేస్తున్నారు." అంటూ 'గో' మని కంఠం ఎత్తి ఇల్లు అదిరిపోయేలా ఏడవసాగింది. ఈ గోలకి రమణ భార్య గదిలోకి వచ్చి చూసి విసుగుదలతో మొహం ముడుచుకొని వెళిపోయింది. నాకామెను ఓదార్చడం ఎలాగో తెలియలేదు. ఊరికే నిలబడ్డాను. రెండు నిముషాలలో ఆమె తేరుకొని, మొహం తుడుచుకొని లోపలికి వెళ్ళిపోయింది. ఆ ఇంట్లో పరిస్థితులు సరిగా లేవని అర్థం అవుతోంది. నిన్నటినుంచీ గమనిస్తున్నాను. రమణ గాని, రమణ భార్యగాని ఆమెతో అత్యవసర పరిస్థితి ఏర్పడితే గాని మాట్లాడడం లేదు.

రమణ కాలేజీ నుంచి తిరిగి వచ్చిన దగ్గర్నించీ దీన్ని గురించే అడుగుదామని అనుకొంటున్నాను. కాని సంకోచం కలుగుతోంది.

"మీ అమ్మగారికి ఆరోగ్యం సరిగా లేదనుకొంటాను." అని మాత్రం అనగలిగాను చివరికి.

"ఏం? బాగానే వుంటోంది." అన్నాడు. ఒక్క నిముషం ఆగి, "మా అమ్మ రానురానూ అసహ్యంగా తయారైందోయ్. ఇంట్లో సుఖం లేకుండా చేస్తోంది. ఆవిడకి తెలియదు, చెబితే వినదు. మా ఆవిడకీ, మా అమ్మకీ పడదు. అదే ఈ చికాకంతటికీ కారణం." అన్నాడు. రమణకి ఎమ్. యస్. సీ. చదువుతున్న రోజుల్లో పెళ్ళయింది. అతడికి ఇంటరు, బి. యస్. సి. చదవడానికి ధన సహాయం చేసిన ఇంజనీరుగారే కూతుర్నిచ్చి పెళ్ళి చేశారు.

"నాకు మేనమామ ఒకడున్నాడు. చిన్నప్పటి నుంచీ మేము ఉన్నామో చచ్చేమో చూడలేదు గాని నేను వృద్ధిలోకి వచ్చి ఎమ్. యస్. సీ చదువుతూ

వుంటే పిల్లనిస్తామ పెళ్లిచేసుకోమని చెప్పొచ్చారు. అప్పటికే ఈ సంబంధం నాకు ఓ సూదరిగా నిశ్చయం అయిపోయింది. నే నా మేనమామ కూతుర్ని చేసుకోనన్నాను. నాకూ మా అమ్మకీ లేసన్నై పోయింది. నాకు పెళ్ళయిన దగ్గర్నుంచీ అమ్మతో పడటంలేదు. ప్రతి చిన్నదానికీ మా ఆవిడని సాధిస్తుంది. చాలారోజులు మా ఆవిడ మా అమ్మతో సర్దుకుపోడానికే ప్రయత్నించింది. కాని మా అమ్మ ధోరణి మితిమీరిపోయి సహించడానికి రాకుండా అయిపోయింది. నోటికొచ్చిన తిట్లుతిట్టేస్తుంది. చివరకి మా ఆవిడ ఎదురుతిరిగింది. అత్తగారు తిట్టేతిట్లన్నీ సహించి రాయిలా ఊరుకోమని మా ఆవిడని సముదాయించలేను; మా అమ్మని సరైన దారిలో పెట్టలేను. అధ్వాన్నంగా ఉంది నా స్థితి. ఇంట్లో ప్రతి చిన్నపనీ తన ఇష్టంవచ్చినట్లు జరగాలని ఆమె అభిప్రాయం. ఒకసారి మా ఆవిడ నా జీతంవచ్చిన రోజున అవసరంఉండి రెండు చీరలు కొనుక్కుంది. ఆ రాత్రి మా అమ్మతో యుద్ధమైపోయింది. పెద్ద వాదన లేవదీసి భోజనం మానేసి పడుకుంది. అలాగే రోజూ ఏదోవస్తూవుంటుంది. ఇంకోనాడు ప్రొద్దున్న వంటకి బియ్యం ఎన్నివెయ్యాలో తనని అడగకుండా వేసినందుకు పెద్దదెబ్బలాట లేవదీసింది. ఏంచెయ్యను? నిజానికి ఎన్ని బియ్యం వెయ్యాలో మా అమ్మని అడుగుతే మా ఆవిడకి ఆఖరికి అన్నం చాలకుండా అయ్యేటట్టు చెబుతుంది. ఇంతటి సంకుచితత్వాన్ని ఎలా దారిలోకి తేవాలో తెలియదు." అన్నాడు. వర్షంలో తడిసిన రెండు కాకుల్లాగ ఒకర్నొకరు ఓదార్చుకొంటూ ఇరవై ఏళ్లు కష్టాలలో కలిసి బ్రతికిన ఆ తల్లీ కొడుకుల సంబంధం చివరకి ఇలా పరిణమించినందుకు నాకు చాలా విచారంకలిగింది. రెండునిముషాలు ఆగి రఘునే మళ్లీ అందుకొన్నాడు.

"పదిరోజులక్రిందట పరిస్థితి మరీ విషమించిపోయింది. ఈ త్రిపుణ్యారికి మా ఆవిడని తిట్టిపోస్తోంది. కని పెంచినందుకు మా అమ్మ ఏమన్నా నేను పడాలి గాని మా ఆవిడ ఎందుకు ఓర్చుకోవాలి? నేను చూస్తూ ఊరుకోలేకపోయాను. కలుగజేసుకొని ఏదో చెయ్యక పోతే లాభంలేదని పించింది. "ఇలాగైతే నేనింక ఊరుకోలేనమ్మా, నెలనెలా నలభయ్యో ఏభయ్యో రూపాయలు పంపిస్తూ వుంటాను, మీఅన్నయ్య దగ్గరో ఎవరిదగ్గిరో వుండు. నాఇంట్లో ఉండనక్కరలేదు. నీమూలాన ఇంట్లో ఎవరికీ సుఖంలేకుండా పోతోంది." అన్నాను.

ఈమాటలు నేను బాగా ఆలోచించి తెచ్చిపెట్టుకొన్న ఉద్రేకంతో అన్నాను. అప్పటికైనా ఆ ధోరణి మారుతుందేమోనని కాని తర్వాతంతా మా అమ్మని అలా అన్నందుకు బాధపడ్డాను. ఇరవైఏళ్లు కనిపెంచిన కొడుకు నోటంట చివరకు ఆమాటలు వచ్చేసరికి ఆమె మనస్సు ఎంత కుమిలిపోయి వుంటుందో అనిపించింది. ఆరాత్రి నాకు నిద్రలో పీడకల వచ్చింది. మాఅమ్మ నామీద కోపం కొద్దీ నూతిలో పడిపోయినట్లు కలవచ్చింది. నేను భయపడి పోయి లేచాను. మర్నాటినుంచీ మాఅమ్మ ఏడుపు బాగా ఎక్కువైపోయింది. "నువ్వూ నీ పెళ్లాం కలిసి వెళ్లగొడదామని చూస్తున్నారు. నాచేత చాకిరీ చేయించుకొని పెద్దవాడివయావు. ఇంక నా అవసరం నీకులేదు. నన్ను ఇంట్లోంచి పొమ్మంటున్నావు. నేనింక బ్రతకలేను. ఏనుయ్యో గొయ్యో చూసు

కొంటాను" అంటూ క్రొత్తధోరణి మొదలెట్టింది. నాకు భయం వేసింది. ఇంక మా అమ్మను ఏమనాలో, ఎలా దారిలో పెట్టాలో తెలియదు. ఇలా అరిచి అరిచి ఎప్పుడో ఓనాడు పిచ్చెత్తి పోతుందేమో అని పిస్తోంది" అని ముగించాడు. "అయ్యో!" అనిపించింది నాకు. తన కొడుకుమీద సర్వ అధికారాలూ తనవే అనుకొంటుంది ఆ తల్లి. కొడుకుకోసం ఎన్ని కష్టాలైనా పడుతుంది. ఎంతో గాఢంగా ప్రేమిస్తుంది కొడుకుని. కాని ఆ ప్రేమలో నిర్మలత లేదు. హృదయాన్ని వికసింప చెయ్యదు. చాలా సంకుచితమైనది. తనబిడ్డని ప్రాణంకన్నా ఎక్కువగా ప్రేమిస్తూనే ఇతరుల బిడ్డల్ని శత్రువులకన్నా ఎక్కువగా ద్వేషించగలిగేటంత సంకుచితత్వం అది! తన బిడ్డకోసం ఇంకో తల్లిబిడ్డను ఖూనీ చెయ్యడానికి కూడా వెనుదియ్యదు తల్లి హృదయం! రమణ తల్లి పరిస్థితి అలాగే వుంది. ఆమె కొడుకే సర్వస్వం అనుకొంది. తనకీ, తన కొడుకుకీ మధ్య కోడలువచ్చి ఇద్దర్నీ వేరుచెయ్యడం ఆమె సహించలేకపోతోంది. ఆమెకు ఇంట్లో పనులు చేసిపెట్టి, మనవలని కనే కోడలు కావాలిగాని, తన కొడుకు ప్రేమని ఆక్రమించుకొనే కోడలు అక్కరలేదు. అది పగగామారి ఇంటిని నరకప్రాయం చేస్తోంది. ఈ ఉద్రేకంలో, ఈ పరాజయంలో ఆమెకు మతిభ్రమణంకూడా కలుగవచ్చు. ఇప్పటికే ఆమె మోహం దీనంగా, పిచ్చిదానిలా అర్థంలేకుండా ఉంది. పాపం! రమణ! తల్లిప్రేమ సాలెపట్టులా తన చుట్టూ అల్లుకొంటే అందులో ఈగలాగ చిక్కుకొని బాధ పడుతున్నాడు.

మర్నాడు నేను విశాఖపట్నంనుండి బెజవాడ బయలుదేరాను. రైల్లో అంతా రమణ గురించే ఆలోచన. రైలు బెజవాడ ప్లాట్‌ఫారమ్‌మీద ఆగేవరకూ నాకు మా చెల్లెలు, దాని కుటుంబం గురించి స్మరణే లేదు. ప్లాట్‌ఫారమ్‌మీద మా బావ కనిపించాడు. ఇద్దరం జట్కాబండిమీద ఇంటికి చేరుకొన్నాం. మా చెల్లెలు పిల్లలు ముగ్గురూ నన్ను చుట్టుకొంటే ఆ సందడిలో మునిగిపోయాను. చాలాసేపు సరదాగా గడిచిపోయింది.

"నీళ్లు కాగేయి స్నానానికి రా అన్నయ్యా!" అని పిలిచింది మా చెల్లెలు లక్ష్మి.

"వస్తున్నానమ్మా!" అని అప్రయత్నంగా అన్నాను. కాని అందులో 'అమ్మా' అనే మాటతో గుండె గతుక్కుమంది. మా చెల్లెలు సరిగా మా అమ్మ పోలిక. ఆ ఆప్యాయతతోటే, ఆ ప్రేమతోటే సరిగా మా అమ్మ నా కళ్లముందు నిలిచినట్లయింది. తువ్వాలు తీసుకొని బరువుగుండెతో స్నానానికి బయలుదేరాను.

# మైథిలీశరణగుప్త పంచవటి

### శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

సంస్కృత హిందీ రామకావ్యరచయితలైన, వాల్మీకి, తులసీదాస మహాకవులు తమ మహాకావ్యాలలో లక్ష్మణుని అలౌకికత్యాగము, తపస్సు, సంయమిత్వాది మహాగుణాల కీయవలసిన ఆధిక్యత ఈయలేదు. వారు సదా లక్ష్మణుని - అగ్రజుడైన శ్రీరామచంద్రుని అనుగామిగా, ఆజ్ఞాపరిపాలకునిగా కర్తవ్యపరాయణునిగా మాత్రమే చిత్రించారు. అంతియకాక వారు లక్ష్మణుని యందు క్రోధావేశములను గూడ ప్రదర్శింపజేసిరి. ఉదారహృదయులగు శ్రీ గుప్తలక్ష్మణునికి కల్గిన యీ అవహేళనను సహించలేక పోయారు. వారు కేవలము లక్ష్మణుని మహత్తర గుణాలను ప్రదర్శించడానికే యీ 'పంచవటి' కావ్యాన్ని వ్రాశారు. వాల్మీకి, తులసీదాసులు లక్ష్మణునికే కాక– పంచవటి ప్రసంగానికే అన్యాయం చేశారా అనిపిస్తుంది. రామాయణంలో పంచవటీ ప్రసంగం మహత్తర మయింది. పంచవటిలో ఘటిల్లిన శూర్పణఖా పరాభవం—రామరావణ యుద్ధానికి హేతుభూత మయింది. దశకంఠుడగు రావణుడు మోసగించి సీతను అపహరించుకొని పోయి రామునిచే పరివారసమేతంగా సంహరించబడ్డాడు.

ఒకవేళ శూర్పణఖా పరాభవ రహితంగా రామరావణ యుద్ధమే సంభవించినచో, రాముడు కేవలం లోకకళ్యాణార్థం—రావణుని సంహరించి వుంటే రామాయణగాథలో రామణీయకత కొంతవరకు లోపించగలదు. వాల్మీకి—తులసీదాసులు యీ శూర్పణఖా పరాభవఘట్టాన్ని సంక్షిప్తంగా మాత్రమే వర్ణించారు. ఆ ఘట్టంలో కావ్యసౌందర్య ప్రదర్శనావశ్యకత వారికి దృగ్గోచరము కాలేదుగాబోలు!

శ్రీ మైథిలీ శరణగుప్త యీ చిన్ని ప్రసంగంలోని మార్మికతను గుర్తించగల్గారు. ఈ ప్రసంగంలో లక్ష్మణుని మహత్తరభావాలను వ్యక్తీకరించు నుద్దేశ్యంతోనే యీ ఖండకావ్యాన్ని వ్రాశారు కూడా. ఇందులో శ్రీ గుప్త ఐతిహాసిక సత్యాన్ని స్వల్పంగా దూరంచేసినా తమ అసమాన ప్రతిభాకల్పనలచే కథావస్తువులో పరివర్తన కల్గించి రామణీయకత కలిగించారు. తమ కమనీయకల్పన, సహాయంతో కావ్యానికి ద్విగుణీకృత సౌందర్యాన్నీయగల్గారు.

రామాయణగాథ లోకప్రసిద్ధమయింది. ఆ కథానుసారం—అగస్త్యుని సలహాప్రకారం శ్రీరామచంద్రుడు గోదావరీతీరంలో దండకారణ్యంలో పంచవటి అనే సుందర ప్రదేశంలో పర్ణకుటీరం నిర్మించుకుని సీతాలక్ష్మణులతో నివసిస్తున్నాడు. ఒకనాడు రామచంద్రుడు—సీతా లక్ష్మణ సహితుడై కుటీర ప్రాంగణంలో ఆనందంగా కూర్చుని ఉండగా రావణుని సోదరి శూర్పణఖ వారిని చూచింది. అంతే ముగ్ధురాలై సుందర స్త్రీరూపధారిణియై రామచంద్రుని దగ్గఱకు వెళ్లి వివాహప్రస్తావన లేవదీసింది. రాముడు తాను సపత్నీకుడనని చెప్పి ఆమెను లక్ష్మణుని దగ్గఱకు పంపుతాడు. లక్ష్మణుడు తాను రామదాసుడనని చెప్ప విని శూర్పణఖ మరల రాముని కోరి తిరస్కృతయై సీతను చూచి—ఈమెయే తనమార్గానికడ్డమని తలచి ఆమెను తన మార్గాన్నుంచి తొలిగించ ప్రయత్నించబోతుంది. భయభీతయైన సీతనుజూచి శ్రీరామచంద్రుడు లక్ష్మణునికి శూర్పణఖ ముక్కు–చెవులు ఖండించి విరూప ఆజ్ఞాపిస్తాడు. ఆజ్ఞనందుకుంటూనే తన కర్తవ్యం పూర్తిచేస్తాడు లక్ష్మణుడు. స్వల్పభేదాలుతప్ప యించుమించు వాల్మీకిరామాయణం — తులసీరామాయణం — అధ్యాత్మ రామాయణం—రామచంద్రిక మొదలగు గ్రంథాలలో యీ ప్రసంగం ఇక్కరీతిగా ఉంది.

ఇక శ్రీ మైథిలీశరణగుప్త 'పంచవటి' విషయం' కథాసమయం రాత్రి సుఖప్రద ప్రశాంత వాతావరణం. కామదేవునిలా, సుందరుడై—యోగి వేషధారియై—

---

శ్రీ మైథిలీ శరణగుప్త హిందీలో 'పంచవటి' అను ఖండకావ్యం వ్రాశారు.

నిర్భీకమనస్కుడైన లక్ష్మణుడు పంచవటిలో పర్ణకుటీ రాని కెదురుగా—స్వచ్ఛశిలపైన ఆసీనుడై ఉన్నాడు. నిద్రాశూన్యమైన అతని నయనాలు చలిస్తున్నాయి. ధనుర్బాణాలు హస్తాలంకారమై ఉన్నాయి. ఆ మానవుడు లోలోపల ఏవో—ఏవేవో ఆలోచించుకుంటున్నాడు. ఏలనో అకస్మాత్తుగా అతనికి తన పత్ని ఊర్మిళాదేవి తలపులోనికి వస్తుంది. మనోరమ్యన ఎద ప్రవేశించగానే క్షణమాత్రం కనులు మూస్తాడు లక్ష్మణుడు. కనులు తెరిచి తిలకించేసరికి తన కెదురుగా, అనన్య సామాన్య కన్యాలావణ్య రూపరేఖావిలాసాలతో—హాస్యవదనయైన రమణి ఒకతె నిస్సంకోచ భావంతో నిలబడి ఉండటం చూసి ఆశ్చర్యపడినాడు. ఆ లలనకనులలో అతృప్త కామవాసన తొంగి చూస్తాంది. ఆమె భంగిమలు లక్ష్మణునికి విచిత్రంగా కనిపించాయి. మౌనం వహించిన లక్ష్మణుని చూసి ఆ స్త్రీ వార్తాలాపనలోకి దిగుతుంది. పురుషజాతిలోని నిర్మమతను తూలనాడుతుంది. "ఓ రంజిత రహస్యమయ బాలా! నీ పరిచయం చెప్పు?" అని లక్ష్మణుడు ప్రశ్నిస్తాడు. ఆ ప్రశ్న ఆమెను మరింత వ్యాకుల పరుస్తుంది. లక్ష్మణుని నిష్ఠురునిగా దూషించి అతనిని పొందగోరుతుంది. తన ఐశ్వర్య సామర్థ్యాలను వర్ణించుకుంటుంది. లక్ష్మణునికి నిష్కామ తపస్సు అవశ్యకమని తెలియజేస్తుంది. ఆమె వివాహ ప్రస్తావన విన్న లక్ష్మణుడు—"పాపము శమించు గాక! నేను వివాహితుడను బాలా!" అంటాడు. అది విని ఆమె తర్కం ప్రారంభిస్తుంది. "పురుషులు మాత్రం బహు భార్యలు కలవారు కాలేదా?"

"నీవు వేరొకరిని వివాహమాడి సుఖించు."

ఆ మాటలు విన్న శూర్పణఖ — నీవు నా చిత్త చోరుడవు, కపట హృదయుడవని, నిందిస్తుంది. ఆ మాటలు విన్న లక్ష్మణుడు — 'నీ మనస్సు మోహ మగ్నమయినది. దానిని అదుపాజ్ఞలలో నుంచుకుని ప్రశాంతంగా పోయి జీవించు!" అంటాడు.

అదే సమయంలో పర్ణకుటీర ద్వారం తెరుచుకుని సీత వస్తుంది. వస్తూనే 'సకరంభాసంవాదం' ప్రారంభమయిన దనుకుంటుంది. ఆమె కూడా వారి సంభాషణలో జోక్యం కల్గించుకుంటుంది. 'మజ్జాగతయై—లజ్జను వీడి స్వయంగా వివాహ ప్రస్తావన చేసే యీ రమణిని తిరస్కరించకు లక్ష్మణా' అంటుంది. లక్ష్మణుడామె మాటలు పెడచెవిని పెట్టుట చూసి—"సరే—"ఆగు—" అని శ్రీ రామచంద్రుని పిలుస్తుంది. శ్రీరామచంద్రుని, నీలమేఘ స్వరూపం, సహృదయత చూసి ఆ రమణి రామునుద్దేశించి—

'జయమాలవంటి నావరమాలను ధరించు" అంటుంది. రాముడామెతో-"రమణీ నా ప్రేమాంధుడయిన—నాసోదరుని ప్రేమను జయించు!" అంటాడు ఆ మాటలువిన్న అరమణి లక్ష్మణునిపై పునర్దృక్ప్రసారం చేస్తుంది. దానితో లక్ష్మణుడు—చాలు యిక మాటాడకు. నీ సంభాషణలు—నీ ప్రవర్తన—నీహృదయాన్ని తెలియజేశాయి. సపత్నీకుడై ఉన్న పూజ్య సోదరుల యందాసక్తురాలవైతివి. అట్టి నిన్ను మనసున కూడా భార్యగా అంగీకరించజాలను—ఆదరించ జాలను."

"అయితే నీకిరువైపులనుంచి తిరస్కారమే సంప్రాప్తించింది. నీ సంభాషణవల్ల — నీవు ముందుగనే నాసోదరుని మోహించినట్లు తెలుస్తోంది. కావ నేనెంత మాత్రం నిన్ను గ్రహించజాల" అంటాడు రాముడు. ఆరమణిలో నిరాశా-క్షోభా బయలుదేరుతాయి. తత్ఫలితంగా ఆమె కరాళ రాక్షసరూపం ధరిస్తుంది. రామ లక్ష్మణులు పరస్పరం చూసుకుంటారు. భయభీతయైన సీతకు ధైర్యం చెప్తారు. లక్ష్మణుడు క్షణంలో తీక్ష్ణ కరవాలం చేబూని ఆ రాక్షసి ముక్కు—చెవులను కోసి పారేస్తాడు. ఆ రాక్షసి ఘోరంగా విలపిస్తూ—శోకిస్తూ దుమారాన్ని లేవదీసుకుంటూ పారిపోతుంది. భవిష్యత్పరిణామాన్ని చింతిస్తూన్న సీతకు రామలక్ష్మణులు ధైర్యం చెప్తారు.

మరుక్షణంలో ఆమోదభావాలు వారివదనారవిందాలలో వెల్లివిరుస్తాయి. ముగ్గురు పకపక నవ్వుకుంటారు. ఈరీతిగా మైథిలీశరణగుప్త తమ 'పంచవటి' కావ్యానికి కావ్యోచితసౌందర్యం సరిదిద్దగల్గారు.

శ్రీ మైథిలీ శరణగుప్త యీ కావ్యంలో చేసిన ముఖ్యమైన మార్పులు.

(1) శూర్పణఖ ఆగమన సమయాన్ని పగటికి బదులుగా రాత్రి అంతిమఝాముగా వ్రాశారు.

(2) శూర్పణఖా గమన సమయానికి-లక్ష్మణుని ఒంటరిగా పత్నీస్మరణలో ఉన్నట్లు చిత్రించారు.

(3) శూర్పణఖను వార్తాలాపనలో చతురగా, తర్కంలో పండితురాలుగా చిత్రించి ఆమె ప్రేమ ప్రస్తావనను కళాపూర్ణంగానూ, స్వాభావికంగానూ చిత్రించారు.

(4) పంచవటిలో శూర్పణఖ రామలక్ష్మణులద్వారా తిరస్కృతి కావడంలో వారిలో విశేషమయిన ఆదర్శం దృగ్గోచరమౌతుంది.

(5) పంచవటిలో శూర్పణఖ ప్రప్రథమంగా లక్ష్మణునితో వివాహ ప్రస్తావన చేస్తుంది. అతను స్వీకరించకపోగా రామునియందు లక్ష్మణునికంటె అధికమయిన కోమలత్వము, ఆర్ద్రత, గొప్పతనము చూసి రామునితో వివాహ ప్రస్తావన చేస్తుంది.

(6) పంచవటిలో ప్రథమంగా శూర్పణఖ పేరుగాని—ఆమె రాక్షసి అనే విషయాన్నిగాని ప్రకటించలేదు. తత్కారణంగా — లక్ష్మణుని శీలము మహత్తర మయినదయినది.

# సుహృదభినందనము

శ్రీ నండూరి రామకృష్ణమాచార్య

ఆమని వేపపుష్పాడి రసార్ద్రి,
మనోజ్ఞ నవీన తింత్రిణీ
కోమల శర్కరా మహిమకున్,
కదలీఫలపాక సిద్ధికిన్,
మామిడి పిందిలే వగరు మాటిడి,
క్రొత్త ఉగాది తెచ్చె యీ
భూమికి; షడ్రుచుల్ మరగు
భోగులుగందు తెలుంగు సోదరుల్

బంగరుకలలు హృదయాన రంగరించి
రెక్కల పాడుగు ప్రాతకోరికలనెల్ల
క్రొత్త సంవత్సరం బానగూర్చు మీకు!
అందుకొనుడు! మా సుహృదభినందనమ్ము.

చూతఫలోద్గమమ్ము, వనసుందరి
ఆమని మేల్ముసుంగు కై
సేతలు, మల్లెపూ వలపు సిగ్గుల
వెన్నెల లొల్కు; షడ్రసో
పేతముగాగ మా తెలుగు బిడ్డల
జీవితమెల్ల దిద్ది, యీ
నూతన వత్సరంబిక మనోరథ
సిద్ధులొసంగి మేగుతన్!

# వచ్చేకాలం

శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి

[గతసంచిక తరువాయి]

## 3

* * కుటుంబయ్యగారి యిల్లు - ముందు గది; సాయంకాలం. సోమనాథం కుర్చీలో కూర్చుని పేపరు చదువుతూ వుంటాడు. నోట్లో చుట్టవుంటుంది.

చంద్రశేఖరం: (బయటినుంచి) కుటుంబయ్యగారూ!

సోమనాథం: (లోనుండి) ఎవరూ?

చంద్ర : నేనూ, చంద్రశేఖరాన్ని.

సోమ : అక్కణ్నించే అరుస్తావేం? లోపలికి రారాదూ?

[శేఖరం లోపలికి వచ్చాడు; సోమనాథం, అతను రాగానే పేపరు బల్లమీద పడేసి, కళ్ళజోడు తీసి చేత్తో పట్టుకొన్నాడు.]

సోమ : ఏమిరోయ్, ఈమధ్య కనిపించడం మానీసేవు.

చంద్ర : (కుర్చీలో కూర్చుంటూ) ఎందుకు మానీసేనూ!

సోమ : ఏమో. ఎందుకు మానీసేవో.

చంద్ర : మీరే కనిపించడం మానీసేరు.

సోమ : నేనా?

చంద్ర : ఇక్కడికి తరచొస్తూనే ఉన్నాను.

సోమ : ఒస్తున్నావా? నేనీమధ్య తిరుగుతున్నాను కదూ మరి.

చంద్ర : ఎందుకు?

సోమ : ఆవేళ మీవాడివగ్గిరి కెందుకొచ్చేను? అందుకు.

చంద్ర : ఏమైనా కుదిరిందా?

సోమ : ఏదీ?

చంద్ర : ఇహ నేనూ చూస్తాలెండి; కాని కుటుంబయ్యగా రేరీ?

సోమ : కాకినాడెళ్లేడు తెలీదూ?

చంద్ర : కాకినాడా? అవునవును. వెళ్తానని చెప్పేరు. అయితే మళ్లీ ఎప్పుడొస్తారు?

సోమ : పిల్లాన్నీ చిన్నదాన్నీ తీసుకొని సోంవారవొస్తాడు.

చంద్ర : ఇవాళ శుక్రవారం కదూ?

సోమ : అవును.

చంద్ర : (కుర్చీలోంచి లేచి నిల్చున్నాడు.)

సోమ : మీ యజమాని సెలా ఉన్నాడు? ఏమైనా తేరుకున్నాడా?

చంద్ర : (అటూ ఇటూ నడుస్తూ) బాగా నేఉన్నాడు.

సోమ : ఏమోలే. ఆవేళే "హరీ" అనేస్తాడను కున్నాను.

చంద్ర : (సిగరెట్టు అంటిస్తూ) అటువంటిభయం లేదు.

సోమ : కాని ముసలాడికి పాపం గొప్ప దెబ్బ తగిలింది.

చంద్ర : అవును.

సోమ : పెద్దకొడుకా? మరోహడా?

చంద్ర : అవును.

సోమ : ఆఖరిసారి చూడ్డానికైనా వీల్లేకపోయింది ముండావాడికి.

చంద్ర : అవును.

సోమ : సప్తసముద్రాలూ దాటి చావడంకోసం కుర్రాడు ఎక్కడకెళ్లేడో చూడు.

చంద్ర : అవును.

సోమ : అంతేరా బాబూ! చావెప్పుడొస్తుందో చెప్పలేం.

చంద్ర : అవునవును.

సోమ : ఊరనో, అడవినో, ఉదకమధ్యముననో? యెప్పుడో విడచుట? ఏతుణంబో?

చంద్ర : సోమనాథంగారూ ఈ వేదాంతం కట్టిపెట్టండి.

సోము : చావెప్పుడొస్తుందో చెప్పలేనంటున్నాను. అదీ వేదాంతమేనా నీకు?

చంద్ర : వేదాంతమనో కాదో నాకు తెలీదు గాని, నేనిప్పుడు మీతో చావుగురించి మాట్లాడదల్చుకోలేదు.

సోము : మానీ, చావుగురించి మాట్లాడకపోతే పెళ్లి గురించి మాట్లాడు. ఎవడొద్దన్నాడు?

చంద్ర : పెళ్లిగురించే మాట్లాడతాను.

సోము : నీకు పెళ్లీ పెడాకులూ అక్కర్లేదు కదా! మరెవడి పెళ్లిగురించి మాట్లాడతావు?

చంద్ర : కామేశ్వరేది?

సోము : అదెందుకూ?

చంద్ర : ఇంట్లో ఉందా?

సోము : లేదు.

చంద్ర : ఎక్కడికెళ్లింది?

సోము : ఇక్కడ ఒక్కర్తెవీ కూచుంటే ఏం తోస్తుందని మా ఇంటికి పమ్పించేను. మా ఇంట్లో పిల్లలు గోలగోల. అంచేత నేనిక్కడ సైతాయించేను.

చంద్ర : మంచి పన్చేసేరు.

సోము : నీ మనసులో ఏదో ఉన్నట్టుంది?

చంద్ర : ఉంది.

సోము : ఏవిటో చెప్పమరి.

చంద్ర : మీరు... అల్లరేం చెయ్యరుకద?

సోము : నే నల్లరిచేస్తానా? గుంటవెధవ వను కున్నావా ఏవిటి?

చంద్ర : మీ సాయంకావా లిప్పుడు.

సోము : కావాలిస్తే తీసుకో.

చంద్ర : మీరు కోపం తెచ్చుకోకూడదు.

సోము : కోపమెందుకూ?

చంద్ర : చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి.

సోము : అలాగే వ్యవహరిద్దాం.

చంద్ర : ఎవ్వరితోనూ చెప్పకూడదు.

సోము : అంత పరమరహస్యం నాతో చెప్పడ మెందుకూ?

చంద్ర : మీతో చెప్పకతప్పదు. ఈ విషయంలో మీరే నాక్కావలసిన మనుషులు.

సోము : అదేదో ముందుచెప్పి తగలడ్డాదూ?

చంద్ర : అల్లరిచెయ్యనని అసరా ఇవ్వండి ముందు.

సోము : అల్లరిచెయ్యను. సరా? సంతోషమేనా?

చంద్ర : సంతోషమే

సోము : మరి వేగిరం చెప్పు.

చంద్ర : ఇదో ఆడపిల్లకి సంబంధించిన విషయం.

సోము : ఆడపిల్లా?

చంద్ర : ఆడపిల్లే! మనం సాయంచేసి ఆమెనో ఒడ్డుకు చేర్చాలి.

సోము : ఎవరా ఆడపిల్ల?

చంద్ర : ఒడ్డుకి చేర్చడానికి సాయం చేస్తారా? చెయ్యరా?

సోము : అలాగే చేరుద్దాం. ముందు సంగతేవిటో చెప్పు.

చంద్ర : ఏంలేదు. మన కామేశ్వరుందికదూ!

సోము : అవును. కామేశ్వరి.

చంద్ర : రమణయ్య రెండోకొడుకున్నాడు తెలుసు కదూ?

సోము : అవును. రెండోకొడుకు. వాడికీ దానికీ ఏవిటయిం దిప్పుడు?

చంద్ర : వాడిప్పుడు కామేశ్వర్ని పెళ్లా న్నంటున్నాడు.

సోము : ఏవిటేవిటి?!

చంద్ర : రమణయ్యగారి రెండోకొడుకు. పేరు మోహన్రావు. వాడిప్పుడు మన కామే శ్వర్ని పెళ్లాడ నంటున్నాడు.

సోము : అదేమిట్రా? వెర్రెత్తిందా ఏవిట్నీకు? రమణయ్య కొడుకేవిటి? కామేశ్వరేవిటి? పెళ్లేవిటి?

చంద్ర : అలా గాభరాపడి కేకవెయ్యకండి.

సోము : మర్నాకేం బోధపడకుండా ఉందిరా? వివరంగా చెప్పు.

చంద్ర : చెప్పేకదూ. పెళ్ళాడతా నన్చెప్పి పిల్లని లొంగదీసుకున్నాడు. ఇప్పుడు ఫో ఫొమ్మం టున్నాడు.

సోము : ఏవిటీ, లొంగదీసేసుకున్నాడూ? (అంటూ కుర్చీలోంచి లేచిపోయాడు)

చంద్ర : లొంగదీసుకున్నాడు.

సోమ : అంత పనే ?!
చంద్ర : అంత పనే!
సోమ : ఇప్పుడు ఫో ఫొమ్మంటున్నాడా ?!
చంద్ర : అమాటే అంటున్నాడు.
సోమ : హమ్మ దొంగగాడిదకొడకా, హమ్మ దొంగ గాడిద కొడకా! ఎంతపన్జేసేవురా! ఎంత పన్జేసేవురా! (అంటూ అటూ ఇటూ పచారుచేసి ఆగి) అయితే ఇప్పుడేం చేదాఁ వంటావ్! వెళ్లి వాడి నడిరగ్గొడదావా?!

[ఇంతలో జగన్నాథం ప్రవేశించి]

జగ : "ఎవర్నడ్డి విరగ్గొట్టడం ?"

[జగన్నాథం ఇదివరకటిలాంటి బట్టలే వేసుకున్నాడు. ఇదివరకులాగే మెథాడికల్‌గా జోళ్లువిప్పుకున్నాడు. ఇదివరకులాగే సీరియస్‌గా వున్నాడు.

సోమ : (శేఖరంతో) ఏవిఁట్రా వాడిపేరూ ?
చంద్ర : ఏం లేదు.
సోమ : ఆ వెధవ పేరేవిఁట్రా?
జగ : ఏ వెధవ పేరు?
చంద్ర : ఏం లేదు. మీరలా కూర్చోండి సోమనాథం గారూ.
సోమ : నువ్వూ రారా అబ్బాయ్. ఒచ్చి విను. సంగతేవిఁటో నువ్వూ విను.
చంద్ర : సోమనాథంగారూ ! ఇప్పుడు మరావిషయం ఎత్తొద్దు.
సోమ : నే నొహటీ, మా వా డొహటీనా? విన్నీ, వాణ్ణీ విన్నీ !
చంద్ర : ఇందాట్లా ఏవఁని చెప్పేన్నేను?
సోమ : మరేం భయం లేదు. విన్రా అబ్బాయ్!

[జగన్నాథం బల్లమీద పేపరు తీసుకొని వెళ్లి మంచంమీద కూర్చున్నాడు]

జగ : మావఁయ్యేడి నాన్నా ?
సోమ : మావఁయ్యా?
జగ : అవును.
చంద్ర : లేరు. కాకినాడ వెళ్ళేర్ట.
సోమ : అవును. కాకినాడ వెళ్లేడు.
జగ : ఎప్పుడొస్తాడు?
సోమ : సోంవారం.
జగ : సోంవారఁవా ?
సోమ : అవును.
జగ : పొద్దుట బండీకా ?
సోమ : పొద్దు బండీకే.
జగ : అత్తియ్యనీ అమ్మల్నీ తీసుకొస్తాడా?
సోమ : తీసుకొస్తాడు ?
జగ : మావఁయ్య కాశీ వెళ్లాలన్నాడు ?
సోమ : వెళ్తాడు.
జగ : శివరాత్రికా ?
సోమ : శివరాత్రికి.
జగ : నువ్వూ వెళ్తావు కదూ ?
సోమ : వెళ్తాను.
జగ : చంద్రశేఖరంగారూ! మానాన్నకోపం తగ్గింది. మరింక మీరు మామూలుగా మాట్లాడొచ్చు.
చంద్ర : బలే వాడివే !
సోమ : అందుకే మావాడి సలహాకూడా తీసుకుందాఁ వన్నాను.
జగ : నేవెళ్లొస్తాను, శేఖరంగారూ.
చంద్ర : నీఇష్టం.
సోమ : కూచోరా జగ్గన్నా.
చంద్ర : పనుందేమో? వెళ్లనీయండి.
సోమ : వాడేం పైవాడుకాడు. నాకు తెలిసిన మీదట వాడికి తెలిస్తే ఫరవాలేదు. విన్నావా ?
చంద్ర : అవున్లెండి. తరవాచ్చూదాం.
సోమ : పిసినారివాడి భోషాణప్పెట్టెలాంటివాడు మావాడు. అంతా గ్రహించడమేఁగాని పైకేదీ ఒదల్డు.
చంద్ర : సరి నేనేం కాదన్లేదే!
జగ : నే వెళ్తాన్నాన్నా.
సోమ : ఉండ్రా. వెళ్తాను వెళ్తానంటూ మధ్యనువ్వో హడివి.
జగ : శేఖరంగారూ! ఏవిఁటి విషయం? నాన్నెవరికి నడ్డిరగ్గొడదావంటున్నాడు? చెప్పండి ఫరవాలేదు.
చంద్ర : అబ్బే. అదేం కాదోయ్. ఇప్పుడెవర్నీ తన్నవలసిన పనేంలేదు. మీనాన్నగారేదో కోపం చేతలా అన్నారంతే.

జగ : ఎవర్నితన్నాలంటున్నాడో చెప్పండి మరేం చెప్పక్కర్లేదు.

చంద్ర : మోహన్రావని ఓ పెద్దమనిషున్నాడు వాణ్ణి, మీ నాన్నేదో అలా అంటున్నారు. ఎక్కడా ఏఁవీఁ అనకు.

జగ : ఎక్కడా ఏఁవీఁ అనను. మరి నే వొస్తాను (అంటూ కదిలేదు)

సోమ : మిగతా భోగట్టా కూడా విన్రా మరీ!

జగ : మిగతా భోగట్టా నాకు తెలుసు.

చంద్ర : ఏవిఁటి!

సోమ : ఏవిఁటి తెలుస్రా నీకూ?

జగ : మన...మోహన్రావూనూ మరి మన...

సోమ : తెలుసూ?

జగ : తెలుసు.

చంద్ర : అందరికీ అప్పుడే తెలిసిపోయిందా ఏవిఁటి?

జగ : అందరికీ తెలీదు.

సోమ : మరి నీకెలా తెలిసింది?

జగ : నాకు తెలుసు. అంతే.

చంద్ర : అలా కూర్చో జగ్గన్నా.

జగ : నే నుండాలంటారా?

సోమ : ఉండాల్రా, ఒరే శేఖరం మరిప్పుడుమనవేం చెయ్యడం?

జగ : పెళ్లాన్నా నే అంటున్నాడా?

చంద్ర : అవును.

సోమ : బుర్ర బద్దలగొడితే అప్పుడంటాడు పెళ్లాడ తానని, అంతవరకూ అన్డు.

చంద్ర : మీరదీ కాని మరో వుపాయం చెప్పరు.

సోమ : రౌడీ భాషల్లో అదే ఉపాయం.

జగ : మీకేదో ఆలోచనున్నట్టుంది?

చంద్ర : ఉంది.

జగ : ఏవిఁటో చెప్పండి.

చంద్ర : ఇప్పుడీ సంగతి కుటుంబయ్యగారికి తెలియ కూడదు.

జగ : తెలియకూడదు.

సోమ : తెలిస్తే దాన్నీ వాణ్ణీ చంపేసి వాడూ చస్తాడు.

చంద్ర : పెళ్లయాక్కావలిస్తే చెప్పొచ్చు.

జగ : అవును.

సోమ : అప్పుడైనా వాడేం చేస్తాడో చెప్పలేం. మరీపరిస్థితిలో నేకూడా దగ్గిరుండి చేయించే నంటే అప్పుడు కొంత సర్దుకోవచ్చు.

చంద్ర : ఆ మోహన్ గాడు వాడిప్పు డేవిధంగానూ పెళ్ళి కొప్పుకో నంటున్నాడు.

జగ : ఎంచేత?

సోమ : తెగులూ! అంచేత.

చంద్ర : పెళ్లాడతానని తను అనలేదట. అయితే మరెందుకు చేసేవాపనంటే...

జగ : సరదాకి చేసేవనుంటాడు.

చంద్ర : అంతే! ఇప్పుడు కావలిస్తే డబ్బిచ్చేస్తా నంటాడు.

సోమ : డబ్బిచ్చేస్తాడా?!! గొయ్యితీసి కప్పె ట్టేయాల్రా గాడిదకొడుకుని, లాభంలేదు. మర్లాభంలేదురా.

చంద్ర : మీరలా కేకలేస్తే లాభం లేదండీ సోమ నాథంగారూ!

సోమ : లేకపోతే, డబ్బిస్తానంటాడా? పీక నులిఁ వేస్తాను.

చంద్ర : అలాగే నులివేఁద్దురుగాని; ముందు నే చెప్పేది వినండి.

సోమ : వింటున్నా. చెప్పు.

చంద్ర : ఇవాళో రేపో రమణయ్యగారితో కూడా మాట్లాడతాను.

జగ్గ : కొడుకు నతను ఒప్పించగల్డా?

సోమ : వాడి శ్రాద్ధం ఒప్పించగల్డు. వాడొప్పించ లేడు.

చంద్ర : ఏమో చూదాం.

సోమ : వాడొప్పించలేడ్రా!

చంద్ర : అడిగిచూదాం, పోయిందే వుంది?

సోమ : సరే అదీ బాగానే ఉంది. పెద్దవాడు కదా. ఇంగితజ్ఞానం వుంటుందనే అనుకుందాం.

చంద్ర : అది కూడా లాభంలేకుండా ఏదీ కుదర దన్నాడు...

సోమ : ఏదీ కుదరన్నాడు?

చంద్ర : ఎల్లుండాదివారం సాయంకాలం మీరు నా ఇంటికి రావాలి.

సోమ : ఎవర్రా వాలి?
చంద్ర : వీరు.
సోమ : ఎందుకూ?
చంద్ర : చెప్తానుండండి. ఈ సంగతి మరెక్కడా తెలీకూడదు.
సోమ : నరమానవుడన్నవాడికి తెలీ నివ్వను.
చంద్ర : అయితే ఇలా దగ్గరకి రండి. జగన్నాధం నువ్వూ రా!

[వాళ్లు దగ్గరగా వచ్చేరు]

సోమ : ఉశేవ్! శేఖరం!
చంద్ర : ఏమిఁ?
సోమ : అసలు నీకెలా తెలిసిందిరా ఈ సంగతీ?
చంద్ర : చెప్తున్నా కదూ!
సోమ : నీకు తెలిసినట్టుగా కావేఁశ్వరికూడా తెలుసునన్నమాటేనా?
చంద్ర : అన్నమాటే కాకపోతే ఆమె తరఫున ఎలా వ్యవహరిస్తున్నానండీ?!
సోమ : మరి నేనెలా వ్యవహరించడం? తెలిసినట్టా తెలియనట్టా?
చంద్ర : ఆమెతో చెప్పే మీతో చెప్తున్నాను. మిమ్మల్నిక్కడొదిలేసి మీ ఇంటికి ఒట్టినే వెళ్ళిందనుకుంటున్నారా ఏమిటి?
సోమ : అమ్మా! అమ్మా! అంతదయిందిరా, నా కళ్లముందు పుట్టిన కావేఁశ్వరి?
చంద్ర : కష్టంలో ఉన్నప్పుడు లోకం సంగతంతా ఇట్టే తెలుస్తుంది. అంత చిన్నపిల్లా అర క్షణంలో అన్నీ తెలుసుకుంటుంది.
సోమ : బాగా చెప్పేవు.
చంద్ర : మరిప్పుడు ఐడియా ఏమిటో చెప్తాను వినండి.
సోమ : వింటున్నాం. చెప్పు.

[తెర]

## 4

* * రమణయ్యగారింట్లో హాలు. పెద్ద సోఫాలో కూర్చున్నాడు రమణయ్య. రాత్రయింది. పైన విద్యుద్దీపం— ఒక్కటే — వెలుగుతోంది. రమణయ్య, పంచె జుబ్బా వేసుకున్నాడు. నీరసంగా కనిపిస్తున్నాడు. చంద్రశేఖరం అతని పక్కకి ఓ కుర్చీ లాక్కుని కూర్చొనివున్నాడు.

చంద్ర : ఈ సమయంలో మీతో ఈ ప్రసక్తి తెద్దామనుకోలేదు. కాని మరి ఆపిల్లకిది ప్రెస్సింగ్ ప్రోబ్లమయిపోయింది. అంచేత చెప్పేను. చెప్పక తప్పిందికాదు.
రమ : చెప్పేవు. బాగా నేవుంది. తప్పేం లేదయ్యా.
చంద్ర : మోహన్ కనిపించేడా?
రమ : లేదు.
చంద్ర : మరైతే ఎలాగ? ఇవాళ కాని చెప్తారా?
రమ : నిన్న రాత్రికదూ నాతో చెప్పేవు?
చంద్ర : అవును.
రమ : నిన్న పొద్దుట్నుంచీ ఇప్పటిదాకా వాడు నాకంటపళ్ళేదు.
చంద్ర : అయితే ఏం చేదాఁవంటారు?
రమ : యూజ్‌ల్యాస్ శేఖరం!
చంద్ర : ఏఁవిటి?
రమ : లాభంలేదు. నోయూజ్.
చంద్ర : ఏఁవిటి లాభంలేదు?
రమ : నేను వాడితో చెప్పి ప్రయోజనంలేదు.
చంద్ర : చెప్పకుండానే అలా అనేస్తే ఎలా?
రమ : లాభంలేదయ్యా; లాభంలేదు. వాడి సంగతి నాకు తెలుసు.
చంద్ర : అయినా పెద్దవారు, చెపితే ఏఁవంటాడో చూడొచ్చు.
రమ : మామూలప్పుడే నామాట ఖాతరుచెయ్యడు. ఇప్పుడు మరీను.
చంద్ర : మీరిలా అనేస్తే ఇప్పుడాపిల్లగతేం కాను?
రమ : ఆపిల్లసంగతి తల్చుకొంటే నాకు చాలా విచారంగా వుంటోంది.
చంద్ర : క్షమించండి, మీ విచారం నాకేం చేసుకొంటుంది? ఏదైనా దారి చూపించాలిగాని.
రమ : డబ్బేమైనా ఇవ్వాలంటావా?
చంద్ర : డబ్బిస్తే సెటిలయ్యే వ్యవహారం కాదు కదండీ. అలా అయితే ఇదివరకే సెటిలైపోను. మీరూ

మోహంస్లాగే మాట్లాడుతున్నారు.

రమ : అవునయ్యా, డబ్బుతో లాభంలేదు. ఐతే నే నేంచెసేది?

చంద్ర : మీవల్లేం కాదంటారు!

రమ : నావల్లేం అవుతుందనుకోనయ్యా! వాడు నాకొడుకే. అయితే! లాభం లేదు. జులాయివెధవై పోయేడు. పనికిమాలిన వెధవై పోయేడు. మర్లాభంలేదు. [ఇంతలో సోమనాథం వచ్చేడు హఠాత్తుగా.]

సోమ : ఏఁవిఁరా రమణయ్యబాబూ? ఒంట్లో ఎలా ఉంది (అంటూవచ్చి ఓ సోఫాలో కూర్చొంటూ శేఖరంతోఁ ఏరా బాబూ ఉన్నావా (అన్నాడు)

రమ : మీరెవరయ్యా?

సోమ : నేనూ సోమఁనాథాన్ని, మర్చిపోయేవూ?

రమ : ఎవరోయ్ శేఖరం?

చంద్ర : ఆయన టీచర్ గా పన్చేస్తున్నారు.

సోమ : ఆ వేళ ఒచ్చేను కదుటయ్యా?

రమ : ఏ వేళ?

సోమ : టెలిగ్రాం వొచ్చిందీ. ఆ వేళ.

రమ : అవునవును. మీరూ ఉన్నారా వేళ— మావాడు, మా పెద్దవాడు పోయేడు తెలుసు కదూ?

సోమ : ఆరోజు స్వయంగా టెలిగ్రాం చదివితే నే! చెడ్డఘోరం చెడ్డఘోరం జరిగిపోయింది. సంగతివిని విచారించని వాళ్ళెవరనుకో.

రమ : నాకిలా నిద్దరపడట్టంలేదు. తల భారంగా ఉంటోంది. ఎవరోఒచ్చి నెత్తిమొత్తేసి నట్టుగా ఉంది.

సోమ : చేతికందినవాడు, చెట్టంత కొడుకు ఒక్కసారి చెక్కలైపోతే ఎలా ఉంటుందో నాకు తెలుసురా బాబూ, నాకు తెలుసు. కాని ఏం చేస్తాం? ఎంత కావలసినవాడైనా, ఎంత దుఃఖ మొచ్చినా చచ్చినవాడితో మన మూ చావలేంకదా! అంచేత విచారించకురా నాయనా విచారించకు.

రమ : విచారం కాకపోతే ఇంకేఁవుందండీ! చచ్చిపోయి వాడేడిపిస్తున్నాడు. బతికుండీ వీడేడిపిస్తున్నాడు. ఏడుపుకాక ఇంకేఁవుంది నాకు?

సోమ : అలా కూర్చుంటే ఏడవాలనే ఉంటుందిరా. చూడూ! రేపట్నుంచీ చక్కా ఆఫీసుకెళ్ళిపో. ఓ రస్తాలో మళ్ళీ పడ్డావా కొంతకాకపోతే కొంతైనా మనసు చులకనవుతుంది. నామాట విని అలా చెయ్యి. నీ మామూలు పన్లేవిఁటో అవి చూసుకో.

రమ : నా మామూలు పన్లంటే పొద్దున్నించి సాయంకాలం దాకా డబ్బు తేవడం, దాన్ని పెంచడం అనేకదుటండీ. ఆ పన్లు నేనిప్పుడు చెయ్యలేను, చెయ్యలేను.

సోమ : పోనీ మరో పన్చెయ్యి. పెరట్లో అరిటిచెట్ల గొప్పు తవ్వు. వీధిలో వేపమొక్క దగ్గిరుండి వేయించు. పాట్లపాదుకి నీళ్ళుతోడిపొయ్యి. ఏదో ఒకాటి చెయ్యి. నా మాట విను. అలా ఏకున్నామాత్రం కూచోకు.

రమ : నే నేపనీ చెయ్యలేనండీ. ఇంక మరింతే.

సోమ : బాబ్బాబలా అనకు!

రమ : ఆర్జించిందేదో ఆర్జించేను. ఎందుకూ? ఏం లాభం? కుప్పదండగ. కుప్పదండగ.

సోమ : అయిపోయిందేదో అయిపోయింది. మరి విచారించకు.

చంద్ర : మీరువెళ్ళి మరింక రెస్టుతీసుకోండి. ఇక్కడ కూర్చుంటే ఏదో మాట్లాడాలనే ఉంటుంది.

రమ : జీవితఁవంతా ధారపోసి ఇంతాస్తి ఎందుగ్గణించేనండీ? ఎందుకు? ఆఖరికోక జులాయి వెధవ, ముండలకీ, తాగుడికీ, పేకాటకీ ఖర్చు పెట్టడానికితప్ప మరెందుకు? వీడికాళ్లు పట్టుకుని, వాడికాళ్ళు పట్టుకుని, వీణ్ణీ వాణ్ణీ మాయచేసి, అడ్డొచ్చినవాణ్ణల్లా తొక్కి పారేసి ఇంతసొమ్ము సంపాదించిందెందుకూ! ఓకోన పింజవెధవ తప్పతాగి గుడ్డలిప్పుకొని, ముండల్ని పట్టుకుని, చిందులొక్కడానికి గ్గణించేను.

సోమ : ఎవరు చిన్నవాడిగురించిట్రా చెప్తున్నావూ? ఏవిఁరా శేఖరం! అంతేనా? చిన్నవాడి గురించేనా?

చంద్ర : మీరేం రెచ్చగొట్టకండి సోమనాథం గారూ! ఆయన్ని మాట్లాడ కూరుకోనివ్వండి.

సోమ : వాడిగురించంత బెంగెందుకురా రమణయ్య బాబూ!?

రమ : ఆఖరికీ ఆకతాయివెధవ, భ్రష్టువెధవకప్పగించడానికి లైఫంతా రూయిన్ చేసుకుని ఇంతా కష్టపడి ఇదంతా ఆర్జించేను. క్రిమినల్నా, వేగబాండ్నా, స్కౌండ్రల్నా తయారవడంకోసం ఇంతకష్టపడ్డాను. వేస్ట్ వేస్ట్, లైఫంతా క్రిమినల్ వేస్ట్!

సోమ : అలా ఎందుకు డీలా పడిపోతావురా!? ఎల్లకాలం వాడలాగే ఉంటాడనుకోవాలా?! మనుషులు మారరూ?! నామాటవిని కుర్రాడికి బలవంతానైనా పెళ్ళిచేసిపారెయ్, పెళ్ళాం వొచ్చి అశిరమ్మలా పీకలమీద కూచుందిరా అంటే అన్ని తిరుగుళ్ళూ అన్ని చంకటాలూ ఇట్టే అణిగిపోతాయి. నామాట వినలా చెయ్. వేగిరం పెళ్ళిచేసెయ్ (అంటూ శేఖరంవైపు మీనింగ్ ఫుల్ గా చూసేడు)

రమ : వాడికి పెళ్లి చేసి ఏ ఆడపిల్ల గొంతుకా నే కొయ్యలేనండీ.

సోమ : పెళ్లయితే అదే వాణ్ని తిప్పుకోగల్దు. మరేం భయంలేదు. అదే వెళ్ళి వాడిగొంతుక పట్టుకుంటుంది.

రమ : అబ్బే లాభం లేదండీ లాభం లేదు. అయినా చెట్టు ఆకుల్లోనే తెలుస్తుందనేది మా అమ్మ. ఈ వెధవ నా వంశానికి విషబీజంలా మొలకెత్తేడు. సర్వనాశనం చేసి పారేస్తాడు.

సోమ : అలా అనుకోకురా !

రమ : అంతే నండీ! అంతే! నా యింట్లో విషవృక్షం విస్తరించుకొచ్చుంది. నీ సారం నీసారం పీల్చుకు తినేస్తుంది. నిన్నూ నన్నూ మాడ్చి చంపేస్తుంది. పునాదుల్తోటే ఇంటిని కూల్చేస్తుంది. ఆఖరి కెవడో ఒకడొచ్చి నరికి పారేస్తాడు. తీరిపోతుంది.

సోమ : ఒరే రమణయ్యబాబూ !

చంద్ర : సోమనాథం గారూ! మీ రిక్కడ కెందుకొచ్చినట్టు?

సోమ : వీణ్నోసారి చూద్దామనొచ్చేన్రా.

చంద్ర : చూసేరుకదూ?

సోమ : ఆ!

చంద్ర : మరెళ్లండి.

రమ : కూర్చోనీవోయ్ అతణ్ని.

చంద్ర : మీ రింక వెళ్ళి పడుకోవాలండీ. ఆయన్ని వెళ్లనీయండి.

సోమ : నిన్నుకూడా చూదామనొచ్చేన్రా.

చంద్ర : మనం అనుకున్న విషయమయేనా?

సోమ : మరి దేనిగురించనుకున్నావు?

చంద్ర : ఇక్కడేం లాభంలేదు. రేపు మనం అనుకున్నప్రకారం చెయ్యవలసిందే.

సోమ : (రమణయ్య చూడకుండా అతన్ని శేఖరానికి చూపిస్తూ) లాభం లేదా?

చంద్ర : లాభం లేదు.

సోమ : మరైతే నే పోనా?

చంద్ర : వెళ్లిరండి. రేపొద్దుట మళ్లీ కలుస్తాను.

సోమ : ఒస్తారా రమణయ్ బాబూ!

రమ : వెళిపోతున్నారా? కొంచెంసేపు కూర్చోరూ!

సోమ : నేను కూచుందికేం? కాని నువ్వు-మాదూ-రెస్టు తీసుకోవాలంటున్నాడు శేఖరం. వాడు చెప్పినట్టూ చెయ్యి, పోయి పడుకో. మళ్ళీనొస్తాను. (శేఖర్ తో) ఒస్తారా.

చంద్ర : మంచిది.

సోమ : (గుమ్మందాకా వెళ్లి) రేపొద్దు నోసారి కనిపించాలిస్మీ.

చంద్ర : అలాగే.

సోమ : మర్చిపోయేవు గనక.

చంద్ర : ఒస్తాను. మర్చిపోను.

సోమ : మళ్ళీ వెళ్తాను. (అని వెళ్లిపోయేడు)

చంద్ర : రమణయ్ గారూ!

రమ : (వినలేదు)

చంద్ర : రమణయ్యగారు!

రమ : ఏమిటయ్యా?

చంద్ర : నే చెప్పేది కొంచెం వినండి.

రమ : ఏమిటి?

చంద్ర : "మా వాడు చెడ్డవాడు. వాడికి పెళ్లి చేసి ఏ ఆడపిల్ల గొంతుకా నే కొయ్యలేను" అంటూ

ఆ కబుర్లూ ఈ కబుర్లూ ఇప్పుడు చెప్పి లాభం లేదు. వింటున్నారా? మంచివాడైనా సరే చెడ్డవాడైనా సరే మీవాడు ఇప్పుడా పిల్లని పెళ్ళాడితీరవలసిందే! అలా అని ఒప్పుకుంటారా? ఒప్పుకోరా?

రమ : ఒప్పుకోవలసిందే మరి.

చంద్ర : డబ్బిచ్చేస్తే ఊరుకుంటుందా? అని మీ వాళ్లాగే మీరూ అనరుకద!?

రమ : అననయ్యా అనను. ఇందాట్లా ఏదో పొర పాటున అన్నాను.

చంద్ర : మీవాడు మరిప్పుడు ఆపిల్లని పెళ్లాడ్డానికి ఒప్పుకోడం లేదు.

రమ : ఒప్పుకోడం లేదని చెప్పేవుకదూ?

చంద్ర : మీరేమైఁనా చెప్పి ఒప్పించగల్రా? లేరా?

రమ : వినడయ్యా వాడు నామాట వినడు.

చంద్ర : వినకపోతే పోనీయండి. కాని, ఆపిల్లతో మీ వాడికి పెళ్లి ఏర్పాటవడం మీకిష్టమేఁగదా!?

రమ : ఇష్టమేఁ కదా అనడిగితే నే నేం చెప్పనోయ్?

చంద్ర : అయితే మీ కిష్టం లేదా?

రమ : ఏదో వాడికి పెళ్లంటూ ఒకటయితే నా కిష్టమేఁనోయ్. ఇష్టమేఁ.

చంద్ర : ఆ యేర్పాటంతా నే చూసుకుంటాను. పూచీ నా నెత్తిని ఒదిలేగల్రా?

రమ : నీ ఇష్టం వచ్చినట్టు కానీవోయ్. నీఇష్టం వచ్చినట్టు కానీ.

చంద్ర : అయితే, చూడండి!

రమ : ఏఁవిఁటి?

చంద్ర : మరింక ఈ ప్రసక్తి మీవాడితో మీరు లేవ క్కర్లేదు. లేకండి.

రమ : సరేనోయ్. సరే.

చంద్ర : నే నేదో విధంగా అంతా ఏర్పాటు చేస్తాను.

రమ : నీ ఇష్టం.

చంద్ర : అంతా ఏర్పాటయాక మిమ్మల్నాశీర్వదించ డానికి రమ్మంటే రాగల్రా?

రమ : (ఒక్క క్షణం వుండి) దానికేఁవుంది? ఒస్తాను.

చంద్ర : అయితే నేనంతా ఏదో విధంగా సెటిల్ చెయ్యడానికి మీరు సమ్మతించినట్టేనా?

రమ : మళ్ళీ అడగాలా అది?

చంద్ర : థాంక్స్ వెరీ మచ్! మరైతే చూడండి. ఇప్పుడు పద్దగ్గిరవుతోంది.

రమ : వెళిపోతావా నువ్వు? ఇంట్లో ఎవరూ లేరే

చంద్ర : సర్వెంట్సొచ్చే దాకా నేనుంటా లెండి.! మీరు వెళ్ళి మరి పడుకోండి.

రమ : నాకు నిద్దర పట్టడం లేదోయ్:

చంద్ర : అదే పడుతుంది. వెళ్ళి పడుకోండి. ఊఁ లెండి.

రమ : లేవనా?

చంద్ర : లెండి లెండి.

రమ : (నెమ్మదిగా లేచి ఒక రెండడుగులు వేసేడు) ఒళ్ళు తూగుతోందోయ్!

చంద్ర : తూగదలా నెమ్మదిగా వెళ్లండి.

[రమణయ్య నెమ్మదిగా మెట్లెక్కి మేడ మీదికి వెళిపోయేడు. మర్నాటికార్యక్రమం గురించి ఆలోచిస్తూ శేఖరం అటూ ఇటూ పచారు చేస్తున్నాడు. వీధివైపు మోటారు సైకిలు ఆగిన చప్పుడయింది. కాసేపట్లో మోహను హాల్లోకి వచ్చేడు.]

మోహ : హా...లో!

చంద్ర : ఒచ్చేవా బాబూ! నీ కోసమేఁ చూస్తున్నాను.

మోహ : రాత్రయినా ఇక్కడే ఉన్నావూ?

చంద్ర : ఉన్నాను. చూట్టం లేదూ?

మోహ : ఏంచేస్తున్నావిక్కడింతసేపు?

చంద్ర : నీ కోసం ఎదురుచూస్తున్నాను.

మోహ : ఇల్లంతా ఇంత నిశ్శబ్దంగా ఉంది. నా అత్త, బంధువులంతా కొంపతీసి వెళిపోయేరా ఏవిఁటి?

చంద్ర : వెళిపోయేరు.

మోహ : హా! నిష్క్రమించిరా?

చంద్ర : నిష్క్రమించేరు.

మోహ : మే గాడ్ బ్లెస్ దెమ్!

చంద్ర : బంధువులంటే ఏఁ వంతభిమానం?!

మోహ : వాళ్లు మహేంద్రజాలుంటే నేను పిచ్చాస్పత్రికి పోయుందును. బంధువులతో బాధనే భరించజాల, భరించజాల.

చంద్ర : అంత కష్టమేం నీకది?

మోహ : ఎవరైనా ఇంట్లో చావనం భయం. పరామర్శ ప్రియులు ముఖ్యంగా బంధువులు తండోప తండంబులుగా దండెత్తి వత్తురు. కన్నీటితో మనను తడిపివేయుదురు. ప్రాణంబులు మనవి పీకివేయుదురు.

చంద్ర : సరే వాళ్లగోలా నీ గోలా అలావుంచి ముందుగా నామాట విను.

మోహ : నా యొక్క చుట్టాలూ పక్కాలూ నిజంగా జలిపోయినట్టేనా?

చంద్ర : జలిపోయేరని చెప్పేకదూ.

మోహ : వాళ్ల గోలయిపోయింది. మరి నీగోలేమిటో చెప్పు.

చంద్ర : తమ రాకకోసం ఎదురు చూస్తున్నాని చెప్పేనా? లేదా?

మోహ : చెప్తివి, నిజమే!

చంద్ర : ఎందుకు మరి నీకోసం వెయిట్ చేస్తున్నానో అడిగేవా?

మోహ : అడుగుచున్నాను. చెప్పుము.

చంద్ర : ఏం లేదు. కామేశ్వరీ...

మోహ : ఆఁ కామేశ్వరి? (అని కొంచెం గాభరా పడ్డాడు).

చంద్ర : (జవాబివ్వలేదు).

మోహ : కామేశ్వరేమిటి? ఏమిటంటుంది కామేశ్వరి? ఏమైనా అందా?

చంద్ర : అంతటితో ఉంది అయ్యగారి పస!

మోహ : యూ మీన్ టుసే... నేను భయపడతానంటున్నావా?

చంద్ర : అబ్బే లేదు లేదు.

మోహ : దాన్ని చూస్తే నాకెందుకూ భయం?

చంద్ర : ఆమెన్నాస్తే నీకు భయమన్నానా? 'కామేశ్వరి' అని అన్నానో లేదో ఏమిటేమిటని గాభరాపడి పోతున్నావు మరి.

మోహ : గాభరా ఎందుకూ? మళ్లీ ఏమైనా అందేమో అని అడిగేనంతే.

చంద్ర : మరేం అన్లేదు.

మోహ : అంతా సెటిలయి పోయినట్టేనా?

చంద్ర : సెటిలై పోయినట్టే! వాళ్ళ ఫాదరు కాకినాడెళ్లేడు. ఎల్లుండొచ్చేస్తాడు. రాగానే మళ్ళీ మాట్లాడుకొని ఆ సంగతేదో తేల్చేసుకుందాం. అంతా సెటిలైపోతుంది.

మోహ : సరే అలాగే కానీ, కాని చూడూ?

చంద్ర : ఏమిటి?

మోహ : వాళ్ళు ముందుకి మళ్లీ పేచీ పెట్టకుండా మనం చూసుకోవాలి.

చంద్ర : ఎందుకు చూసుకోవూ? చూసుకుందాం.

మోహ : అందుచేత ఆ సెటిల్ చేసేదేదో లాయర్ ద్వారా సెటిల్ చేయించేస్తే మంచిది.

చంద్ర : అలాగే చేదాం.

మోహ : మరి...వాళ్లకెవరైనా ప్లీడరున్నాడా?

చంద్ర : నాకు తెలిసినంతమట్టుకు లేదు.

మోహ : అయితే నేనొకటి చెప్తా విను.

చంద్ర : ఏమిటి?

మోహ : నువ్వంటే వాళ్లకి నమ్మకమేనా?

చంద్ర : నమ్మకమే.

మోహ : అయితే నే చెప్పేవట్టు చెయ్యి

చంద్ర : ఏమిటది?

మోహ : నా వకీలున్నాడు తెలుసుకదూ?

చంద్ర : ఎవరు, శివశంకరంగారా?

మోహ : వాడి మొహం వాడూ వకీలే! మదికట్టు కోర్టు కెళ్తానంటాడు.

చంద్ర : మరెవరు నీ ప్లీడరు?

మోహ : నా ఫ్రెండు కుమారున్నాడు కదూ?

చంద్ర : కుమారా?

మోహ : అవును, కుమారే, జూనియరే కాని ఫ్యూచర్ లీడర్ ఆఫ్ ది బార్ వాడే. వాడు బాగా ఫ్రెండు. మనకి బాగా పనికొచ్చేవాడెవడంటే వాడు తప్ప మరోళ్లేడు. సత్యం అసత్యం ఇలాంటి నాన్సెన్సు కేర్ చేసే మనిషి కాడు.

చంద్ర : సరే అయితే ఏం చేద్దామంటావు?

మోహ : నీకు చాలా మంచి వకీల్ని కుదురుస్తావన్నప్పి వాళ్ళని మనవాడి దగ్గిరకి తీసుకురా. ఇంతకంటే ఎక్కువ సొమ్ము—ఖర్చుల్లేండుగ తప్పించి—నీకు కోర్టెక్కినా రాదని వాడిచేత వాళ్లకి చెప్పించేసి వీలైనంత తక్కువలో తేల్చేద్దాం. కాయితాలు కూడా కట్టుబిట్టంగా మనక్కావలసినట్టు రాయించేసుకోవచ్చు. ఏమంటావు? నా అయిడియా ఎలా వుంది?

చంద్ర : బ్రిలియంటుగా ఉంది.

మోహ : మరి చూడు మా ఫాదరేమంటాడో ను. నాకు తెలివి తేటల్లేవు, పనికి మాలిన వెధవనంటాడు.

చంద్ర : నీకు తెలివి తేటల్లేక పోలేదు.

మోహ : మరైతే మా ఫాదర్తో అలా చెప్పవేమీ?

చంద్ర : అలాగే చెప్తాకాని నీ కోసం ఎందుకు వెయిటు చేస్తున్నానంటే కామేశ్వరి గురించి చెప్పడానిక్కాదు. ఆ విషయం సెటిలయిపోయినట్టే.

మోహ : మరేమిటైతే?

చంద్ర : రేపు సాయంకాలం నువ్వు మాలాడ్జికి రావాలి.

మోహ : ఏం?

చంద్ర : చిన్నపార్టీ.

మోహ : పార్టీయేల?

చంద్ర : నాకీ ఉద్యోగం ఒచ్చి కెవడికైనా ఎప్పుడైనా పార్టీ ఇచ్చేనా?

మోహ : ఇవ్వలేదు.

చంద్ర : మన ఫ్రెండ్సంతా ఇలా తిసేస్తున్నారు. అంచేత కెపెరేంజి చేసేను. నువ్వుకూడా రావాలి.

మోహ : రానూ?!! పార్టీల కెళ్ళడమే నా మెయినాక్యుపేషనాఫ్ లైఫ్ కదా! అయితే ఎవరెవ రొస్తారు? ఎన్నిగంటలకి?

చంద్ర : మన ఫ్రెండ్సే ఒచ్చేవాళ్ళు, సిక్సొసర్టీకిరా. చాలు.

మోహ : అమితఖండము వెన్నరొట్టెయున్ :అవెలాగూ ఉంటాయి. మరి విగతావి?

చంద్ర : తినువాయి తెరపై చూడుము, నుశ్నపోతా.

మోహ : రైటో.

చంద్ర : రేపు మర్చిపోకు.

మోహ : మరువను మరువను.

చంద్ర : అయితే గుడ్ నైట్.

మోహ : టా టా.

[తెర]

## 5

* * చంద్రశేఖరం వుండే యిల్లు చాలా చిన్నది. ముందుకో గది. వెనక్కో గది. మధ్య చిన్న నడవ. ముందు వైపు చిన్న వరాండా. వెనకవైపు చిన్నవరాండా. అంతే. చుట్టూ పెద్ద తోటుంది. తోటని అప్పట్లో కొట్టేస్తున్నారు. ఊరికది ఒక కొన. ఆ రోజు ఆదివారం; సాయంకాలం. శేఖరం ముందుగదిలో బల్లని ఆనుకొని నిల్చున్నాడు. ముందు గది విశాలమైనదనే చెప్పాలి. వీధివైపు ద్వారంపక్క ఓ కిటికీ ఉంది. దానికి నాలుగు తలుపులు. అడుగు తలుపు లెప్పుడూ మూసే వుంటాయి. గదిలో ఒకే మేజా ఉంది; నాలుగు కుర్చీలున్నాయి; ఒక వాలు కుర్చీ పేముది ఉంది. గోడల్కి రెండు గ్రూప్ ఫోటోలూ, ఒక కేలండరూ, ఒక పాత టెన్నిస్ రేకెటూ తప్ప మరేం లేవు. శేఖరం దగ్గర పనిచేసే వాడు చిన్నారావు వెనక గదిలో ఉన్నాడు. వాడికో నలభయ్యేళ్లుంటాయి.

చంద్ర : చిన్నా

చిన్నా : ఏంబాబూ?

చంద్ర : అష్ట్రే కూడా పట్టుకుపోయేవూ?

చిన్నా : ఇక్కడుందిబాబూ. తెమ్మంటారా?

చంద్ర : ఇలా తే

చిన్నా : తెస్తున్నా (అని చెప్పివచ్చి అష్ట్రే తెచ్చి బల్లమీద పెట్టేడు)

చంద్ర : సోమనాథంగారొస్తున్నారేమో చూడు.

చిన్నా : పొద్దున్నొచ్చిన బాబేనాండి?

చంద్ర : ఆయనే.

చిన్నా : ఆయనైతే ఇంకా రాలేదండి.

చంద్ర : వెళ్లి చూడ్రా.

చిన్నా : చూడక్కర్లేదండి, ఆయనొస్తుంటే మాట్లని పిస్తాయండి.

చంద్ర : ముందువెళ్లి చెప్పివచ్చెయ్యి.

చిన్నా : (వీధిలోకివెళ్లి వచ్చి) రావేదండి. దూరంలో రిచ్చాయేదో ఒస్తుందండి. అంతే.

చంద్ర : రాజారావుకూడా ఇంకా రాలేదు. ఒస్తాడంటావా?

చిన్నా : ఒస్తడండి.

చంద్ర : ఏమోలే. డబ్బుకూడా కొంతెడ్వాన్సిచ్చేసేను.

చిన్నా : డబ్బుచ్చుకు రాకపోడండి. ఆ బయమేం లేదు.

చంద్ర : సరేలే, ఇప్పుడేంచేస్తాం?

చిన్నా : అశ్శిశ్శి! ఒస్తడండి.

చంద్ర : సరే నువ్వెళ్ళి వసారలో కూర్చో. మళ్లీ పిలుస్తేనే రావడం.

చిన్నా : అలాక్కానీండి.

చంద్ర : వసారలో నీదీ వాళ్లదీ సామగ్రంతా ఉందా?

చిన్నా : ఉందండి.

చంద్ర : సరే పోయికూర్చో.

[చిన్నా వసారలోకివెళ్ళేడు. ఇంతలో వీధిలోంచి "ఇక్కడే ఇక్కడే ఆపాపు" అని సోమనాథంమాటలు వినవచ్చేయి. కాస్సేపట్లో అతనూ వచ్చేడు.]

సోమ : (గుమ్మంలో నిల్చొని) ఏవిఁరా రావొచ్చా?

చంద్ర : రండి. ఇంకా ఎవరూ రాలేదు.

సోమ : (వెనక్కి తిరిగి) రామ్మా కామమ్మ తల్లీ. ఇలా! (అంటూ గదిలోకివచ్చేడు. ఆవెనకే కామేశ్వరి వచ్చింది.)

సోమ : (వాలుకుర్చీలో కూర్చొంటూ) అందాకా అలా కూర్చోవే అమ్మాయ్

చంద్ర : (టైమ్‌చూసుకొని) ఈకుర్చీలో అలాకూర్చో (అని ఓకుర్చీకొంచెం ఎడంగా ఈడ్చేడు)

కామే : అక్కర్లేదు(అని వసారగుమ్మందగ్గర నిల్చొంది)

సోమ : ఒకటేఖరం!

చంద్ర : ఏవిఁటి సంగతి?

సోమ : చిన్నయినదీ పెద్దయినదీ ఈ ఆడవాళ్ళతో వేగలేంరా.

చంద్ర : ఏం? అలాఅనేసేరు?

కామే : నేనేదో అడిగేనని. అందుకూ.

సోమ : ఇంటికెళ్ళి తీసుకొచ్చేనా? ఇంటికెళ్లిన దగ్గర్నించి ఇక్కడికొచ్చేదాకా ఎన్ని ప్రశ్నలేసిందో దాన్నే అడుగు.

చంద్ర : మీరుచెప్పండి. దేన్నిగురించి? (అంటూవెళ్లి వీధివైపు కిటికీదగ్గర నిల్చున్నాడు.)

సోమ : దేనిగురించా? ఒక్కదానిగురించే! దాని గురించి దారిపొడుగునా ప్రశ్నలే. అన్నీ అనుమానాలే. వేసినఅనుమానమే వెయ్యడం. అడిగినమాటే అటుతిప్పిటుతిప్పి పన్నెండ్రకాలుగా అడగడం. ఇన్ని సందేహాలూ ఇంతనుమానవుఁ ఉన్న మనిషి వెళ్లి వాడివల్లో ఎలా పడ్డాదో నాకర్థఁవవటంలేదు.

చంద్ర : సోమనాథంగారూ, మీరధికప్రసంగం చెయ్యకండి. ప్లీజ్.

సోమ : అడిగేవు కాబట్టి చెప్పేను. అదీతప్పే?

చంద్ర : ఏంకామేశ్వరీ! ఏవిఁటన్నీ అనుమానం?

కామే : అతనికీ పెళ్లి పూర్తిగా ఇష్టఁవేఁనా అనుకుంటున్నాను.

సోమ : హూఁదిగో అదిరా! వాడు పూర్తిగా ఇష్టపడ్డాడా లేదా? నువ్వువాడితో స్వయంగా మాట్లాడేవా? మాట్లాడకపోతే నీకెలా తెల్సింది? ఎవరు స్వయంగా వెళ్ళి మాట్లా

తేరు? శేఖరంలో ఏమన్నాడో స్పష్టంగా చెప్పగలవా? నువ్వేమీ వినావినకుండా, చూడా చూడకుండా వాడొప్పుకున్నాడని ఎలా స్పష్టంగా చెప్తున్నావు? ఇది వరస. ఈ ప్లీడరు ప్రశ్నలన్నిటికి నే సమాధానం చెప్పగలన్నా?"

చంద్ర : మీరుండండీ.

సోమ : బోనెక్కి ప్రమాణంచేసి సాక్ష్యం చెప్పమంటే అది నా తరమవుతుందిరా?!

చంద్ర : మీరూరుకోండీ.

సోమ : ప్రమాణపూర్తిగా నిజంచెప్తున్నావా అంటే జవాబిచ్చినప్పుడల్లా నెత్తిమీద రామాయణం పెట్టుకు జవాబు చెప్పగల్నా?

చంద్ర : మీరూరుకుంటారా ఊరుకోరా సోమనాథం గారూ?

సోమ : కాదుమాట వరసకి చెప్తున్నాన్రా!

చంద్ర : కామేశ్వరీ ఏమిటినీ అనుమానం? మోహన్‌కి పెళ్లి పూర్తిగా ఇష్టమేనా అనా?

కామే : అవును.

చంద్ర : నేనింతకుముందు చెప్పేకదూ?! మళ్లీ ఎందుకూ అడగడం?

కామే : కాదు. ఆవేళ వాళ్లింట్లో అలామాట్లాడిన వారు ఇప్పుడెలా ఒప్పుకున్నారా అని?

చంద్ర : అది తెలుసుకోడంవల్ల ఇప్పుడు ప్రయోజనమేమైనా ఉందా?

కామే : అలా అంటే నేనేం చెప్పగల్ను?

చంద్ర : ఆరోజున వాళ్లింట్లో నీతో ఎందుకలా మాట్లాడేడో అది వేరే విషయం. అదలా ఉంచు. ఇప్పుడు మనవాడు ఏమీ ఇష్టం లేకుండా ఇక్కడకొస్తున్నాడని నువ్వెందుకనుకోవాలి?

కామే : (సమాధానం ఇయ్యలేదు.)

చంద్ర : చూడూ! ఇప్పుడీ అనుమానాలూ, సందేహాలూ, పెట్టుకూర్చుంటే లాభంలేదు. తెలిసిందా?

కామే : (మాట్లాడిందికాదు)

చంద్ర : నీ మంచికోసం నాకుతోచిన విధంగా ఏదో ఒక ఏర్పాటు చేసేను. అవిఘ్నంగా నడవనీ.

సోమ : చూడూ, అమ్మడూ! వాడు చెప్పినట్టు చెయ్యి. మరేం ఇబ్బంది లేదు.

చంద్ర : అందాకావెళ్లి అలా ఆ వెనగ్గదిలో కూర్చో.

సోమ : అలా చెయ్యి.

[కామేశ్వరి గ్లానిగా వెనకగదిలోకి వెళ్లింది]

సోమ : ఒరే అబ్బాయ్!

చంద్ర : ఇంకమీరేమంటారు?

సోమ : ఈ వయసు ఆడపిల్లల్తో చిక్కంటే చిక్కు కాదురాబాబూ. చెప్తే విన్రు విన్నా బోధపర్చుకోరు.

చంద్ర : అనుభవం తక్కువ మీద అలా ఉంటుందేమో ?

సోమ : అనుభవం లేపోతే పోయింది. వెర్రాలోచన్లు లేకుండా ఉంటేచాలు. ఊహుఁ అలాగా లేదు. బుర్రనిండా భావకవిత్వమే.

చంద్ర : మోహన్‌గాడు దగాచేస్తే మధ్య ఆమె భావకవిత్వమేం చేసింది?

సోమ : నీ కళ్లూ నా కళ్ళూ పెట్టుకుచూస్తే వాడి నిజస్వరూపం కనిపిస్తుంది. భావకవిత్వం గాళ్ళకి వాడు నవమన్మథుళ్లాగే కనిపిస్తాడు గాని పరమ దొంగల్లోఘట్టు రకంగా కనిపించడు.

చంద్ర : (ఒక క్షణం ఉండి) అవును. సరిగ్గానే చెప్పేరు.

సోమ : భావకవిత్వం కొంచెం కొంచెం ఒదిలి పోతోంది. అంచేత ఇంతయ్యాక ఈ రోజుకి మనమ్మాయిగారికి వాడి నిజంబొమ్మ తెలుసుకుందామనే బుద్ధి పుట్టింది.

చంద్ర : వాడి నిజంబొమ్మంత చూడరాని బొమ్మా?

సోమ : ఏం? నీకు తెలీదేమిటి? నన్నడుగుతున్నావు?

చంద్ర : (అటూ ఇటూ పచారుచేస్తూ) తికమకలో పడ్డాను సోమనాథం గారూ!

సోమ : ఏమిటా తికమక?

చంద్ర : ఏం లేదు. (అని మళ్లీ పచారుచేసి) పిల్లదండీ వాడలా అన్యాయం చేసి చేతులు దులిపేసుకొందికి వీల్లేదు.

సోము : దేన్నిగురించలా మాట్లాడు కున్నావురా? ఏఁ వొచ్చిందిప్పుడు?

చంద్ర : ఏం లేదు.

సోము : ఏఁవిఁటో చెప్పకూడదూ?

చంద్ర : ఏం లేదు. మీ జగ్గన్నేడీ?

సోము : మా వాడా?

చంద్ర : మీ వాడే!

సోము : (నెమ్మదిగా) మరి మా వాడొస్తున్నట్టు (వెనక గదివైపు చూపిస్తూ) దీనికి తెలీకూడదు కదూ. అంచేత వాణ్ణి అడుగు వెనక రమ్మన్నాను.

చంద్ర : సరే బాగానే ఉంది. కాని రాజారావింకా రాలేదు.

సోము : రాజారా వెవరు?

["రాజారా వంటే ఈనేనండి" అంటూ అప్పుడే గదిలోకి ప్రవేశించేడు రాజారావు. పాతికా ముప్ఫై సంవత్సరాల మధ్య వయసు వాడు. పొడవుగానూ, వెడల్పుగానూ, ఉన్నాడు. ఎత్తుగా దట్టంగా ఉన్న జుట్టు పెద్దవి ఎర్రటి కళ్ళు. నలుపని చెప్పడానికి వీల్లేని ఛాయ. మనిషి బలంగా ఉన్నాడు. పొడుంరంగు బుష్‌కోటు తొడుక్కున్నాడు నిక్కరు నల్లటిది.]

చంద్ర : ఒచ్చావా! ఇంకా రాలేదేం చెప్మా అనుకుంటున్నాను. అందాకా అలా కూర్చో.

[వీధి గుమ్మం వైపు ఒక చిన్న స్టూలుంది.]

రాజా : (స్టూలుమీద కూర్చొంటూ) మేజ్‌స్ట్రేట్ కచేరీకా డీయాల్లేటయిపోనాదండి.

సోము : వీడెవడ్రా?

చంద్ర : మనపనిమీదే ఒచ్చేడు, మనవాడే, ఏం? మీతో చెప్పేకదూ?

సోము : మరోమనిషొస్తాడని చెప్పేవు, ఊరూ పేరూ చెప్పేవా?

చంద్ర : ఇతగాడే ఆమనిషి.

రాజా : (జేబులోంచి అగ్గిపెట్టె, బీడీతీసి) బీడి కాల్స్తనండి.

చంద్ర : కాల్చుకో.

[సోమునాథంచుట్టా, రాజారావు బీడీ ఒక్కసారే ముట్టించేరు]

చంద్ర : ఎప్పుడూ లాఠీపట్టుకు తిరుగుతూ ఉంటావట? ఇవాళ తేలేదేం?

రాజా : (పొగవదిలి) నా రొండుసేతులూ రొండు లాఠీలండి.

చంద్ర : సరేలే, వాటవసరవేం ఉండదనుకో, కొంచెం అల్లరేకుండా చూడంతే.

రాజా : మనవుఁణ్ణిసోట మరో డల్లరిసెయ్యడానికి లేదండి. అ దేవుఁడు సెప్పినమాటేనండి, ఓ పాలిలాగే తల్లిమాలచ్చిగుడికాడ దీపాల పాండిగాడేటన్నాడంటే, నాయెదటకొచ్చి "ఎట్టో నీఅల్లరి" అన్నడండి. అన్నాడో నేదో రెయ్యిదీపాలొక్క పాలవుపించేలా ఈస్పికొట్నానండి, కొత్తే మూడంతర్లుకొట్టి ముప్పైగజాలెల్లి తూలిపడ్డాడండి, అప్పుణ్ణానే ఎల్లి సెగదీసి సెప్పేనండి. "ఒరి దుంపవీధి దీపాల పాండిగా! ఈ దెవసేను కొంటున్నావూ? ఈడు కొత్తపేట రాజిగాడన్న సంగతి మర్సిపోకు. రెయ్యి చిరసనూసె బుడ్లయితే మా తీరం ఒక్కపిట్టరమెంటు సైటుకిసాటా? నువ్వు చిరసనూసె బుడ్డివి. నాను పిట్టరమెంటు సైట్ని. నా కాలిగేటోట నువ్వెలకొక్కడదూ! అందుచేత ఇక్కణ్ణించి అ రి కెం టు గాం గా బరిమీదెళిపో" అన్నానండి. దాన్తో నాను కర్సుకిచ్చిం దుచ్చుకొని అరికెంటుగాంగా బరిమీద దుంప వీధెళిపోన్డండి, మరప్పణ్ణించి నాయెదర పడితోట్టండి.

చిన్నా : రాజిగా డొచ్చినాడేటండి? మాటినిపిస్తుంది (అంటూ నడవవైపునుంచి గదిలోకి వచ్చేడు చిన్నారావు)

రాజా : ఏఁరోయ్ సిఁవయ్‌మాఁవాఁ!

చిన్నా : ఏఁరోయ్ బావమర్ది!

చంద్ర : ఎందుకురా చిన్నా? ఇక్కణ్ణికంపని? అక్కడే కూర్చో, వెళ్ళు.

రాజా : పనేటిలేకండా కూకుండమంటే ఎంతక్క కూకుంటాడండి మానిసయ్‌మావ. పనొస్తే మాత్తిరం, గట్టిక్కొకొస్తేకాన, సెయ్యొత్తి దణ్ణాలెట్టేస్తడండి.

చిన్నా : ఎళ్లేల్రా! నా నొల్లకుంటేకదా నువ్వు కొత్తపేటకి రగిడీనవుత! ఎక్కువాగ్దెవుడో ఎరిగి వడుసుకో.

రాజా : చేపె నుసిగొలిపితేకాన! ఈ ఎక్కువొగ్దు దొడు దియ్యడానికి, మరేటక్కర్నేదు.

చిన్నా : ఒప్పుడాచేపె? నువ్వు నానా? ఒపుకు చెల్లమ్మక్కడితే ఆడిసెప్పు ల్నాకుతావు. దూదూ అంటే ఒప్తవు. సీఘో అంటే పోతవు. చేపెవరు, నువ్వా నానా?

చంద్ర : చిన్నా! వసవలోకి ఫో, రాజయ్యా! వాడితో మాట్లాడకు.

చిన్నా : మరి కూడండా జేటంట్నాడో?

చంద్ర : నువ్వెళ్లు. మాట్లాడకు.

చిన్నా : (వసవలోకి వెళిపోయేను)

రాజా : తోకముడుసుకక్కడ పడుండు.

చిన్నా : (లో నుంచి) సత్తివుంటే వసవలోకి రా.

చంద్ర : రాజారావ్! వాడితో మాట్లాడకు.

రాజ : ఆడికీ నాకూ నేస్తవేఁనండి, అన్నికాని కలా అనుకోంతాం.

చంద్ర : ఇక్కడేం హోస్యాలక్కర్లేదు.

సోమ : ఒరే అబ్బీ, అలా రెప రెప లాడుతున్నావు. నీ కేటిట్రా పనీ?

రాజా : నా పనా?

సోమ : ఆఁ నీ పనే!

రాజా : యీపులు సాఫుసెయ్యడేఁవండి నా పని. కొత్తపేట రాజిగాడి పేర్నొత్తే పిట్ట లీన్లు తాగవండి, రగిడీసులు బోంచెయ్యరండి. పోలీసోళ్లకి పనక లుండవండి.

సోమ : అంత గొప్పవాడివేఁ విట్నువ్వు?

రాజా : వూరి మొత్తంమీద్దర గొప్పోళ్లందర మంది రికీ నాను రొనకదన్నండి. మరింక మళ్లెక్క మీరే రేసుకోండి.

సోమ : తుప్పతిలా బీడీముక్కా నువ్వు నువ్వే చేవింటి గొప్పోళ్లిందరికీ మద్దత్తిచ్చే వాడివి?!

రాజా : కాదేటండి? మరుప్పుడు నాను మీకు మద్దత్తుకి రా నేదా? యిప్పుడు నాను మీకు దన్నా? మీరొన్నకు దన్నా? సెప్పండి... మాట్లాడ్రేం?

చిన్నా : (లో నుంచి) ఒప్పుడబ్బిస్తే ఆడికే దన్నురా నువ్వు, దొంగనాకొడక!

రాజా : నువ్వొల్లకోరా. లోక తెంపేగల్ను.

సోమ : ఒరే శేఖరంబాబూ! వీడికి తుప్పతల మూరడూ, నీలుగు తెగబారెడూన్రా! వీణ్ణెందుకు లాకొచ్చేవ్?!

చంద్ర : మీరు నన్నిప్పుడేం చిరాకు పెట్టకండి. ఓయ్‌-రాజారావా, రాజయ్యా నీ పేరు?– నువ్వేం మాట్లాడకు (అని పచారుచేస్తూ మధ్య మధ్య వీధిగుమ్మం దగ్గరకీ, కిటికీదగ్గరకీ వెళ్లి చూస్తున్నాడు.)

రాజా : నీలుగు తెగబారెడంటే గ్యాపకం వొచ్చిం దండి. ఓ పాలి డియాస్పీబాబు రమ్మని కబురెట్టినా డండి.

సోమ : డియస్పీనా?

రాజా : ఆఁ డియాస్పీ బాబండి, రమ్మని కబురెట్టే డండి

సోమ : ఎందుకూ? జెయిల్లో వెయ్యడానికా?

రాజా : సెప్పిందాక ఉండ్రేం?

సోమ : చెప్పు చెప్పు.

రాజా : కబురెడితే ఎల్లేనండి. డియాస్పీబాబలా కూకడివున్నాడండి. నన్నిలా కూకడ బెట్టినా డండి.

సోమ : అర్దసింహాసనఁ ఇవ్వలేదూ?!

రాజా : సత్తెపెమానంగ కూకడ బెట్నాడండి. కాని క్లీబులూ, ఏడ్లూ, సబినస్పెట్టర్లూ అవితే మనమీద కలబడి పోతారు గాని దొరదగ్గిర కొత్తే, కూకడబెడతాడండి.

సోమ : సెత్తెక్కించుకోడూ?

రాజా : కూకడ బెట్టేటన్నాడంటే "ఏరారాజిగా" అన్నాడండి, "యేంబాబు కబురెట్టి రమ్మ న్నావూ" అన్ననండి, అంటే ఆ బాబ న్నాడూ: "యేరా రాజిగా సబినాసుపెట్టర్

మీాకే తిరగబడ్డావంట. అంతనీలుగ్గుం కేటి? ఇకముందల చమాపన్చెప్పుకొని తిన్నగుంటావా, లేకపోతే ఏడేళ్ళు మోసేమంటావా?" అని గుడ్డె(రజేసి బల్ల గుద్ది లేకవేసి అడిగినాడండి.

సోమ : ఎవడైనా నిన్నలాగే అడుగుతాడు.

చంద్ర : ఏమిఁటి సోమనాథంగారూ! వాడితో మీా హాస్యా?

సోమ : మనవాణ్ణి ఏడేళ్ళపాటు మోసేస్తానన్నాట్ట ఎవడ్రా అన్నాడు?

రాజా : డియాస్పీ దొరండి.

సోమ : బాగానే ఉందన్నాను. మనవాడు రవణయ్యకి మూడోకొడుగ్గా ఉండదగ్గవాడు.

రాజా : మీాగోలాగ్గేయండి. ఇదివండి. డియాస్పీబాబుగా అనేసరికి నాను బల్లమీాదర్నించి జెగిసిపోనానండి. జెగిసిపోయిఏటన్నానంటే: "బాబూ! వాది సిన్నమనివి. అదిన్నాక మీాకే టితోస్తె అన్చ్యయండి" అన్నానండి. "ఏటది? సెప్పు" అన్నడండి డియాస్పీబాబు, అంటే అప్పుడు సెప్పేనండి "బాబూ! బేరాణ్ణించి, సెన్నాపట్నన్నించి మువ్వాడ్డులా అన్ని గాడీల్లోంచి జేబుకొటుగాళ్ళు కుటుంబాల్తో దిగేసి, పూరంతా ఆక్కరమించేసి, మనూరి కొటుగాళ్ళ కడుపులు కొట్టేస్తన్నారూ! బోపాలన్నించి, పాకీస్తానన్నించి అడాళ్ళ కొడాళ్ళు, మొంగాళ్ళకి మొంగాళ్ళు గాగరాల్లో, లంగాల్లో దాసుకొచ్చి ఈశలకీశెల్లల్ల మందమేస్కసి ఏలకేలు దోసుకు పోతన్నారూ; సముద్రపొడ్డండ, ఏటిగట్లంట, తోట్లండ, దొడ్లంట, ఇళ్లంట యీాడూ అదూ అనకండా అన్నిజాతులోళ్ళూ బట్టి లెట్టేసి సీసాలకి సీసాలు సారాదించేసి పబ్లీగ్గా అమ్ముకు మోతు బర్లయి పోతన్నారూ! అడాళ్ళ-అంటే ఎవురు? కూలికొచ్చి బతకలేనోళ్ళనీ, అడుక్కు బతికే వోళ్ళనీ, సెడిపోయి లేచొచ్చి నోళ్ళనీ, ఏపెరగనోళ్ళనీ—అడాళ్ళందర మందిర్నీ పోగుజేసి ముండల కంపెనీ లెట్టుకొని ఈణ్ణీ ఆణ్ణీ ఓళ్లోంచి దిగి నోణ్ణీ పిల్సుకొచ్చి, సీకలమొయ్యాల సారా పట్టించేసి, పక్కలోకి ముండల్ని తార్చిఅకర్న జోబీలడిపేసి బతికే డాఫరునాయెదవలంతా నూటిల్లాబుస్కోట్లూ యేసికొని పోకు జమాయించి గలగల్లాడతా గల్లాపెట్టెల్లా సప్పుడుజేస్తా తిరగతన్నారూ!" అని నానసేసరికి డియాస్పీ బాబేటన్నాడంటే...

చంద్ర : ఒరే రాజయ్యా! నీ వాగుడు కట్టిపెట్టు.

రాజా : సరిగ్గా మాటే అన్నడండి డియాస్పీబాబు, అంటే అప్పుడు నానేటి సెప్పేనంటే "బాబూ! తిమిరలా టోళ్లిందర మందిర్నీ ఒగ్గేసి నామీాదా సూపిస్తారు తిమిరి సెబాపుర్రు? అలాగైతే, తిమిరి కన్నేయం కాదన్తోస్తే—సిత్తం—యేడేళ్లు కాదు, పది సంవచ్చరాల్తోయించేయండి. తిమిరి పేర్ సెప్పుకొని జెయిల్లో సంతోసంతో కూకడుంటానూ" అన్నానండి.

చంద్ర : రాజయ్యా ఊరుకుంటావా ఊరుకోవా? మన పనికి వేళవుతోంది. (దూరాన్న మోటారు సైకిలు చప్పుడు) అదిగో వస్తున్నట్టున్నాడు, సోమనాథంగారూ! లెండి.

సోమ : (కుర్చీలోంచి లేచి పంచె ఎగ్గకుతూ) మేం కూడా పడవలోకి పోవాఁమరి?

చంద్ర : వేగిర వెళ్లండి, రాజయ్యా నువ్వూ వెళ్లు.

రాజా : అక్కడ కూసొని ఏటి సెయ్యాలండి.

చంద్ర : పొద్దుట చెప్పేకదూ? అక్కడ కూర్చో, పిలవగానే రా. అల్లరేకుండా చూడు.

సోమ : ఏం చెయ్యాలో చెప్తా నిలారారా
(అని నడుంకి తువ్వాలు కట్టుకొంటూ పడవలోకి వెళ్లేడు సోమనాథం. అతనివెనక రాజారావు కూడా వెళ్లేడు. ఇంతట్లో "హా...లో" అంటూ ప్రవేశించేడు మోహను. ఈవెనింగ్ డ్రెస్‌లో ఉన్నాడు. హుషార్ గానే ఉన్నాడు.)

చంద్ర : హాలో రా, అలా కూర్చో.

మోహ : (వాలు కుర్చీలో కూర్చొంటూ) వాట్ బ్రదర్! నే నొక్కణ్ణే కనిపిస్తున్నాను!

చంద్ర : (రిస్టువాచీ చూసుకొని) అవునింకా ఎవరూ రాలేదు.

మోహ : విందు వచ్చానా మేమియూ కానరాదేమి?

చంద్ర : కనిపించడం లేదా?

మోహ : ఓ సిగరెట్టిలా ఇచ్చుకో, చిరుతిండి వాసన ఇచ్చట వేయ నేలేదేమి?

చంద్ర : (సిగరెట్ ప్యాకెట్ విసిరి) ఇంకా ఏదీ.

మోహ : (సిగరెట్ తీస్తూ) ఏ గబ్బూ ఇంకా రాలేదేం?

చంద్ర : నువ్వొచ్చేవు చాల్దూ?

మోహ : విందుకి వనితారత్నంబులు వత్తురా!

చంద్ర : రారు.

మోహ : హా! రారా?

చంద్ర : సిల్లీగా మాట్లాడకోరే.

మోహ : విందు లేనూ లేక, వనిత రానూరాకపోతే మర్నెందుకురా రమ్మన్నావ్?

చంద్ర : ఒరే మోహన్! విందు ముందా, వివాహం ముందా? చెప్పు.

మోహ : (సిగరెట్ అంటించి పొగవదుల్తూ) ముందే విందు, విందేముందు.

చంద్ర : అటుంచిటు తిరగేస్తాన్నేను.

మోహ : విందుముందే అన్నా ముందే విందన్నా ఒకటే, ఎటుంచెటు తిరగేసినా అంతే.

చంద్ర : అదికాదురా బ్రదర్! ముందు వివాహము, తదుపరివిందు. అదీ నా కార్యక్రమం.

మోహ : అంటే?

చంద్ర : అంటే ఏమిటనా?

మోహ : అంటే ఏమిటనే?

చంద్ర : ఏంలేదు. "యువర్ గేమ్ ఈజ్ అప్," అంటే అర్థంతెలుసా?

మోహ : తెలుసు.

చంద్ర : ఏమిటి?

మోహ : "నీ ఆటింతటితో కట్టు," అని దానర్థం.

చంద్ర : అది చెప్పడానికే నిన్నిక్కడికి పిల్చేను.

మోహ : అంటే?

చంద్ర : అర్థంకాలేదా?

మోహ : విడమర్చి చెప్పుము, అర్థమగును.

చంద్ర : ఏంలేదు. ఇవాళ నీ వెటకారమంతా ఒదల గొట్టే దల్చుకున్నాను.

మోహ : (కొంచెం సీరియస్‌గా) ఏమిట్రా భాయ్ సంగతి?

చంద్ర : నే చెప్పిందే సంగతి, ఇంకేం లేదు.

మోహ : నీ మనసులో ఏదో ఉంది. అదేమిటో సూటిగా చెప్పెయ్.

చంద్ర : చెప్పేమంటావా?

మోహ : చెప్పి.

చంద్ర : నీకు పెళ్లి చేసి విందు చేద్దామని పిల్చేను. అదీ సంగతి.

మోహ : నీ వరసనాకేమీ బోధపడ్డం లేదురా బ్రదర్;

చంద్ర : బోధపడ్డం లేదా?

మోహ : లేదు.

చంద్ర : ఇంకా స్పష్టంగా చెప్పాలా?

మోహ : చెప్పుము.

చంద్ర : చెప్పాలా?

మోహ : చెప్పు.

చంద్ర : చెప్పమంటావా?

మోహ : గుడ్ గాడ్! ఎన్నిసార్లడుగుతావ్! వేగిరం చెప్పు.

చంద్ర : మరేంలేదు. కామేశ్వర నే అమ్మాయి నీకు తెలుసుకదూ?!

మోహ : (కుర్చీలోంచి నెమ్మదిగా లేచి సిగరెట్టు పీల్చి పొగవదిలి) క్యాభాయ్! ఇదేం సరసమా లేక విరసమా?

చంద్ర : సరసమో విరసమో నువ్వే తేల్చాలి.

మోహ : నీ వ్యవహారం నాకేం అర్థం కావటంలేదు.

చంద్ర : (తిన్నగావెళ్ళి వీధి తలుపు గడియవేసి అక్కడే నిల్చొని) ఒరే అబ్బాయ్! నే చెప్పేది సరిగ్గా విను.

మోహ : ఏమిటి? (అంటూ కొంచెం దగ్గరగా వచ్చేడు)

చంద్ర : ఇప్పుడు నువ్వింక తప్పించుకొందికి వీల్లేదు.

మోహ : అంటే ఏమిట్నీ అభిప్రాయం?

చంద్ర : అభిప్రాయం గిభిప్రాయం అలా ఒదిలెయ్. నే నొకటడుగుతాను. సమాధానం చెప్పు.

మోహ : (మాట్లాడలేదు. సిగరెట్టు తొందర తొందరగా పీలుస్తున్నాడు)

చంద్ర : చెప్తావా చెప్పవా?

మోహ : ఏఁవిఁటీ ప్రశ్న?

చంద్ర : కామేశ్వర్ని పెళ్లాడతావా? పెళ్లాడవా?

మోహ : ఏఁవిఁటీ నాటకం?

చంద్ర : నాటకం గీటకం జాన్తానై. ఆ పిల్లని పెళ్ళాడతావా? పెళ్ళాడవా?

మోహ : జవాబు చెప్పాలా?

చంద్ర : చెప్పవలసిందే.

మోహ : అయితే చెప్తా విను.

చంద్ర : చెప్పు

మోహ : దాన్నయి పెళ్ళాణ్ను. పెళ్ళాణ్ను.

చంద్ర : అభిప్రాయం మార్చుకోవా?

మోహ : మార్చుకోను.

చంద్ర : మర్యాదగా అడిగేను. మార్చుకోనన్నావు. సరే. కాని నీకిష్టం వున్నా లేకపోయినా ఆ పిల్లని పెళ్ళాడి తీరవలసిందే.

మోహ : నాతో తమాషా ఏఁవిఁట్రా?

చంద్ర : తమాషా ఏంకాదిది. తమాషా తీర్చేస్తారని చెప్తున్నాను.

మోహ : అంటే ఏంచేస్తావ్?

చంద్ర : పెళ్లాడ్డానికి బుద్ధిగా ఒప్పుకున్నావా సరే సరి...

మోహ : లేకపోతే?

చంద్ర : లేకపోతే బుర్రవాయగొట్టి మరీ ఒప్పిస్తారు.

మోహ : (నవ్వబోతూ) హాస్యానికేంగాని రారా అబ్బాయ్! ఇలారా. (అని సిగరెట్టుపీక పారేసి) ఏదీ? మరో సిగరెట్టిచ్చుకో.

చంద్ర : ఇదేం హాస్యంకాదు. నేనన్నమాట అక్షరాలా జరిపించితీరుతాను.

మోహ : ఓస్ అలా అయితే జరిపించీరా! నువ్వెవర్ని తీసుకొస్తే దాన్నే పెళ్లాడేస్తాను.అసలింతకీ పెళ్ళికూతురేదీ?

చంద్ర : సమయానికొస్తుంది.

మోహ : వెతుక్కోమంటావా? (అంటూ వెనక గది వైపు నడిచేడు. అట్నుంచి ద్వారం తెరిచుంటే వెనగ్గదిలోంచి తోట్లోకి వెళిపోవొచ్చు.)

చంద్ర : ఆగరా అబ్బాయ్! ఆగు!

(అని వాడిదగ్గరికి వెళ్ళేడు. నడవగుమ్మం దగ్గర ఉన్నవాడు శేఖరం అక్కడికి వెళ్లగానే తటాలున వెనక్కి పరిగెట్టి వీధి తలుపుకి గడియతీస్తున్నాడు. శేఖరం మళ్ళీ వెనక్కొచ్చి వాణ్ని రెక్కపట్టుకు వెనక్కిలాగేసి "రారా చిన్నా"అని కేక వేశాడు.)

మోహ : (చెయ్యి విదిలించుకోబోతూ) ఏఁవిఁట్ చేస్తావ్?

చంద్ర : చూడు చూడు అలా చూడు.

(పంచె ఎగ్గట్టి, నడుంకి తువ్వాలు చుట్టుకొని ఓకర్ర పుచ్చుకొని తిన్నగా వీధి గుమ్మం దగ్గరకి వెళ్ళి నిల్చున్నాడు. సోమనాథం. ఓ కర్రపుచ్చుకొని నడవగుమ్మం దగ్గరే నిల్చున్నాడు. చిన్నారావు. "నోరిప్పేవా జాగర్త" అంటూ ఝూమ్మనొచ్చి మోహన్ వెనక్కి వెళ్లి నిల్చొని వాడి రెండుచేతులూ వెనక్కిలాగి పట్టుకున్నాడు రాజారావు)

చంద్ర : తమాషా కాదని చెప్పలేదురా అబ్బాయ్!

మోహ : ట్రెచరస్ స్కౌండ్రల్స్ నువ్వు.

సోమ : దొంగ గాడిద కొడుకివి నువ్వు.

చంద్ర : మీరేం మాట్లాడకండి సోమనాథంగారూ! ఏంరాఅబ్బాయ్ ఇప్పుడైనా ఒప్పుకుంటావా?

మోహ : విశ్వాసఘాతకుడివి. నీతో మాట్లాణ్ను.

చంద్ర : ఒప్పుకుంటావా ఒప్పుకోవా? మాట్లాడకపోతే సంజ్ఞలుచేసి చెప్పు.

మోహ : నే చెప్పను.

చంద్ర : అయిందేదో అవుతుందయితే.

మోహ : బలవంతం పెళ్లిళ్ళు చెల్లవు.

సోమ : చెల్లవూ గిల్లవూ అంటే తంతాను. మాయముండాకొడకా?

మోహ : ఒంటిగాణ్ని చేసి ఏమైనా అంటారు.

చంద్ర : ఇప్పుడుకూడా ఒప్పుకోననే అంటావు!

మోహ : ఒప్పుకోను.

[మోహన్ చేతులు వదిలేసి వాడి పెడజివ్వలు చటాల్న పట్టుకున్నాడు రాజారావు.]

మోహ : అబ్బా! ఒదిలీ ఒదిలీ!

చంద్ర : ఒదిలేరా అబ్బీ వాణ్ణొదిలీ, వాడొప్పుకో గానే ఒదిలీ!

రాజా : ఒప్పుకుంటవా ఒప్పుకోవా?

మోహ : ఒప్పుకుంటా నొదిలీ ఒదిలీ (అని చేతుల్లో విడిపించుకోబోతున్నాడు మోహను.)

చంద్ర : ఒదిలేరా రాజయ్యా! (మోహన్ని విడిచి పెట్టేడు రాజారావు.)

[మెడ తడుముకొంటూ రాజారావువైపు తిరిగేడు.]

మోహ : రాజిగా!!

రాజా : ఎవురెవురూ!

మోహ : రాజిగా! నువ్వా?!!

రాజా : (ఓ అడుగు వెనక్కి వేసి) బాబూ తఃవఃరా?!

మోహ : నేనేరా నేనే! అప్పుడు చీకట్లో చూసేవు. నేనే నేనే! (అని జేబులోంచి పర్సు గభాల్న తీసేడు. దాన్ని అందుకున్నాడు రాజారావు. అంతా తృటికాలంలో జరిగి పోయింది.)

చంద్ర : ఏఃవిఃట్రా రాజయ్యా! ఏఃవిఃటిదంతాను?

మోహ : థాంగ్గాడ్! థాంగ్గాడ్! (అనుకొంటూ శేఖరాన్ని చూసి చటాల్న రాజారావువెనక్కి వెళ్ళి నిల్చొని) వాడేరా. రాజీ! వాడే! మా నౌఖరీ వెధవ! మా సొమ్ముతిని మామీదా తిరగ బడుతున్నాడు. వాడికీ ఆ ముండకీ ఇలా కా! వాణ్ణి రానివ్వకు.

[మోహన్ చెయ్యిజాచి శేఖరం వెనక్కి చూపిస్తున్నాడు. శేఖరం వెనక్కి చూసేడు. వసారగుమ్మంలో ఎప్పుడొచ్చి నిల్చుందో కామేశ్వరి నిల్చొంది.]

చంద్ర : } ఆ పిల్ల నేవైఃనా అంటే చంపేస్తాను.
సోమ : } దగుల్బాజీ తొత్తుకొడుకా!!

[అని శేఖరం సోమనాధమూ ఒక్కసారే కేకేసేరు. శేఖరం ముందుకి అడుగు వేసేడు. ఆ సమయంలోనే కర్రఎత్తి వస్తోన్న సోమ నాధానికి వెనగ్గా గబుక్కునవెళ్లి కర్ర లాగి పారేసి అతన్ని బలంగాతోసి కింద పడ తోసేడు మోహను.]

రాజా : అడుగేస్తే పెడకాయ తెగుద్ది (అని ఎక్కణ్ణించితీసేడో తటాల్న కైజారుతీసి శేఖరాని కడ్డుగా నిల్చున్నాడు రాజారావు. సోమ నాథం మునుక్కి దెబ్బతగిలినట్టుగా ఉంది. చిన్నారావు వడవలోకి చల్లగా జారిపోయి నట్టుగా శేఖరం గమనించలేదప్పుడు. మోహను వికవిక నవ్వేడు.)

మోహన్: చంపేస్తావేం? ఏదీ చంపమ్మా చూస్తాను. చంపు (అంటూ కొంచెం ముందరకొచ్చేడు. శేఖరం కదిలేదు.)

రాజా : మేకని బలేసినట్టుం బలేసేస్తాను. కదలకు. ఇంట్నావా? (అని శేఖరంతో అని మోహన్తో) బాబూ తఃవఃరింక జారేయండి. ఊః జారే యండి.

మోహ : ఉండ్రా రాజిగా! ఏం భామామణీ నీకు పెళ్లికావాలా? అడుగో (అని శేఖరాన్ని చూపిస్తూ) మంచిమొగుణ్ణీకు, మంచి మొగుడు. అడుగోరా శేఖర్! ముస్తా బయొచ్చింది పెళ్లికూతురు. పెళ్లిచేసుకొం టివా చక్కటి ఛాన్సు. పెట్టూ కాయా రెండూ నీవే! ఫర్నిష్డ్హవుస్! బలేబేరం! ఎక్సలెంట్ ఛాన్స్!

చంద్ర : బ్లడీస్కౌండ్రల్స్! [అంటూ శేఖరం ముందుకి నడిచేడు. రాజారావు అతన్నడ్డు కున్నాడు. వాడూ అతనూ కలబడ్డారు. అంతవరకూ బాధపడిస్తూ కూర్చున్న సోమ నాథం వాడి కాళ్లుపట్టుకొని లాగేసేడు. శేఖరం వాడూ తిరగబడ్డారు. ఆసమయంలో వీధివైపు కిటికీలోంచి ఎవరైనా ఇదంతా చూస్తున్నారేమో నన్నది ఎవరు చూడలేదు. అంతకుముందు సోమనాథం చేతిలోంచి లాగి పారేసిన కర్రని నేలమీంచి తీయబోయేడు మోహను. సోమనాథం కూర్చొనే అడ్డు కున్నాడు.]

రాజా : (శేఖరంతో పెనగులాడుతూ) తమ రెళ్లి పొండి బాబూ తఃవఃర్ దాటేయండి.

[ఆ మాటవిని వెంటనే కర్రవదిలేసి పోయి మోహను తలుపు తెరిచేడు. వీధిలోకి వెళ్లి పోను కూడాను. అంతలో అట్నుంచి

అడ్డొచ్చి వాణ్ని తోసేసి మీదపడి పట్టుకున్నాడు సోమనాథంకుమారుడు జగ్గన్న. శేఖరం సోమనాథవూ, రాజారావుని లాంగ దీసేరు. శేఖరం లేచి నిల్చున్నాడు. రాజారావు మీద కూర్చున్నాడు సోమనాథం. వాడితల నేలకేసి కొడుతున్నాడు.)

చంద్ర : (మోహాన్ని పట్టుకున్న జగ్గన్నని చూసి) శాబాష్ జగ్గన్నా! అలాగే పట్టుకో వాణ్ని! అలాగే పట్టుకో (అంటూ వెళ్లి పిధిరలుపు లేసేసేడు. కత్తెరపట్టు వేసి పట్టుకున్నాడు మోహాన్ని జగ్గన్న.)

మోహ : హెల్ప్! హెల్ప్!

చంద్ర : నోరెత్తేవా, చంపేస్తాను, చంపేసేవేఁ తెలిసిందా?

మోహ : (పెనుగులాడేడు. లాభం లేకపోయింది.)

చంద్ర : కేక లేస్తే పీకనొక్కు జగ్గన్నా.

(జగ్గన్న వాణ్ని మరీ బిగించి పట్టుకున్నాడు. మోహన్‌కి అయాసంగా ఉన్నట్టుంది. శేఖరం కామేశ్వరివైపు చూచేసరికి ఆమె మేజాని ఓచేత్తో పట్టుకుని రెండో చెయ్యి నెత్తిమీద పెట్టుకుని జోగుతోంది.)

చంద్ర : కామేశ్వరీ.

కామే : (పలకలేదు. జోగుతోంది.)

చంద్ర : (వాలుకుర్చీ వామెదగ్గర గాలాగి) కామేశ్వరీ ఇలా ఇందులో కూర్చో. ఊఁ కూర్చో.

కామే : (కుర్చీలో కూలబడి కూర్చుంది.)

[శేఖరం "చిన్నా చిన్నా" అని కేక వేసేడు. వాడు పలకలేదు. నడవలోకి వెళ్ళి చూస్తే వాడు ఓమూల నక్కి కూర్చున్నాడు. "ఇక్కడ్రా కూర్చున్నావు? రా ఇలారా" అని వాణ్ని గదిలోకి లాక్కొచ్చేడు.]

చిన్నా : ఒద్దుబాబూ! రాజిగాడు రగిడీసుమండా కొడుకుబాబు. సంపేస్తడు బాబోద్దుబాబూ. (సోమనాథం అంతసేపూ రాజిగాణ్ని ఏదో తిడుతూ మధ్యమధ్య కొడుతూ నేవున్నాడు. "ఒగ్గేయండి బాబో గ్గేయండి"ని అరుస్తానే ఉన్నాడు రాజిగాడు.)

చంద్ర : ఎందుకురా నీకంత భయం? చూడు మీరాజిగాడెక్కడున్నాడో చూడు. వాడు చస్తాంటే నిన్నిప్పుడేం చంపగల్డు?

చిన్నా : (కళ్ళు నులుముకొని చూసి) కొత్తపేట రగిడీసు రాజిగాడే?!

చంద్ర : కొత్తపేట రగిడీసు రాజిగాడే,

సోమ : ఏఁరా అడుగేస్తే మెడకాయ తెసుద్దా? తెసుద్దా? ఏం చెప్పవేం!

రాజా : తెగదు తెగదొగ్గేయణ్నన్న!

సోమ : ఒగ్గేయాల్రా బాబూ నిన్నొగ్గేయాలా?

చిన్నా : ఒగ్గీకండిబాబు అణ్నొగ్గేకండి (అని తుర్రుమని మళ్లీ జనకివరాండాలోకి పరిగెట్టేడు)

సోమ : ప్రాణంతీసి మరీ ఒగ్గేస్తాను.

చంద్ర : జగ్గన్నా!

సోమ : జగ్గన్నా?! ఏడీ (అనిచూసి) ఎప్పుడొచ్చేవురా?

చంద్ర : మీకు ఒంటిమీా తెలివుంటేనా? జగ్గన్నా! వాణ్నొదిలీ.

చిన్నా : (ప్రవేశించి) బాబూ తాడుతాడుతాడిదిగో.

సోమ : తాడక్కర్లేదురా (అంటూ చేతులు దులుపుకొంటూ లేచేడు. నేలమీదపడ్డ కత్తితీసి పట్టుకున్నాడు.)

జగ్గ : ఇతన్నొదిలీమంటారా?

చంద్ర : ఒదిలెయ్!

సోమ : ఒరేయ్! మీఇద్దర్లోనూ ఎవడైనా సరే ఊఁ అన్నారా సఫాచేసేస్తాను. వింటున్నారా గాడిదకొడకల్లారా!

రాజా : (మెల్లిగా కూర్చొంటూ) యింటున్నాం!

సోమ : పాడిచేసి, పెరట్లో కప్పెట్టేస్తాను. ఆపైన ఏకంట్రానీయండి!

చంద్ర : (ఒగర్చుకొంటూ నిల్చున్న మోహాన్ని ఉద్దేశించి) ఏమిఁరా! ఇప్పుణ్నువ్వు ఒప్పుకున్నట్టేనా?

మోహ : ఆయాసంగా ఉంది. మాట్లాళ్ళేను. (అంటూ వెళ్ళి స్టూల్ మీద కూర్చున్నాడు)

చంద్ర : కామేశ్వర్ని పెళ్ళాడతావా?

మోహ : ఆయాసంగా ఉంది! పెళ్ళాళ్ళేను.

సోమ : ఆ ఫకీరువెధవ నడిగేదేంట్రా! ఎవడికోసం పీటలమీదకూచుంటాడు! కూడోనని అనమను వాణ్ణి! ఊఁ అనమను!

చంద్ర : ఆయాసం తీర్చుకోనివ్వండి వాణ్ణి.

చిన్నా : బాబూ! ఈణ్ణి తాడేసి కట్టాలా? కట్టొద్దా?

సోమ : కట్టుకట్టేసి కాటికి మోసుకుపో వెధవని!
[చిన్నా తాడు వేసి రాజారావు రెక్కల మీంచి మూడుమట్లు తిప్పేడు. జగన్న ఏఁ వీఁ ఎరగనట్టు ఎటో చూస్తూ కిటికీ దగ్గర నిల్చున్నాడు]

రాజా : ఒగ్గేరా సినయ్యనూవాఁ నన్ను పోనీరా!

చంద్ర : సోమనాథంగారూ!

చిన్నా : నాకేటి తెల్దా బాబునకుకు.

చంద్ర : చిన్నా! నువ్వల్లరి చెయ్యకు, సోమనాథంగారూ! ఏడుగంటలకనుకున్నాం మనం ముహూర్తం. ఇంక మనకాట్టే టైమ్ లేదు. పెళ్ళి ముహూర్తం దగ్గిరవుతూంది.

సోమ : ఉండ్రా! పెళ్ళి ముహూర్తంకాదు వీళ్ళ చావుముహూర్తం చేసెయ్యాలనుంది నాకు (అని మోహన్నీ రాజారావునీ చూపిస్తూ అన్నాడు)

చంద్ర : సోమనాథంగారూ! ఇటు చూడండి.

సోమ : ఎటు చూడ్డం?

చంద్ర : ఇటు (అంటూ కామేశ్వర్ని చూపించేడు)

సోమ : ఏఁ వేఁ అమ్మదూ! ఇక్కడే వున్నావుటే చూణ్నే లేదు.

కామే : (మాట్లాడలేదు చూశ్నేదు)

చంద్ర : ఈపిల్లే ప్రహ్లాదుడనుకొని మీ నరసింహావతారం ఇంకచాలించండి. ముహూర్తం దగ్గిరవుతూంది. మరింక మీరు బ్రాహ్మణ్యం స్వీకరించాలి.

సోమ : అలాక్కానీ అలాగేకాని (అని ఓ కుర్చీ దగ్గరకి నడుస్తూ కొంచెం కుంటేడు) ముణుక్కి దెబ్బతగిలిందిరా! అమ్మా! ఈ పెళ్ళికొడుకు వెధవే తోసీసేడు. వెనకనుంచి తోసీసేడు. పులుసులో కొవ్వెక్కలుంచకూడదురా దొంగవెధవకి (అంటూ కుర్చీలో కూర్చున్నాడు. కైజారు జేబులో పెట్టుకున్నాడు)

చంద్ర : మీ ఆశీర్వచనాలు చాలించండి! కాని ఒకే చిన్నా!

చిన్నా : ఏం బాబూ?

చంద్ర : ఆశీర్వదనమంటే జ్ఞాపకమొచ్చింది. అర్జంటుగా సైకిలేసుకొ వెళ్ళి రమణయ్యగార్నిక్కడికి రమ్మను.

సోమ : ఇక్కడకా తండ్రి వెధవకూడా ఎందుకూ?

చంద్ర : మీరూరుకోండి. చిన్నా నువ్వెళ్ళు. వేగిరం రమ్మన్చెప్పు.

చిన్నా : ఎందుకంటే ఏటన్చెప్పాల?

సోమ : అడుగో వాడికి శ్రాద్ధం పెట్టాలి. వేగిరరమ్మను.

చంద్ర : మీరుండండి సోమనాథంగారూ! (అని అతన్నని. చిన్నాతో) వెర్రా చిన్నా! వెళ్ళి చంద్రమ్మంటున్నానన్చెప్పు. ఎందుకంటే ఆశీర్వదించాల్ట, రమ్మంటున్నాడు శేఖరమన్చెప్పు.

చిన్నా : అచ్చింత లెయ్యాలంట. వేగి రమ్మన్నా రన్చెప్తనండి.

చంద్ర : అలాగే చెప్పు! వేగిరం వెళ్ళు.

చిన్నా : సిటికెలో రానా?! (అంటూ వీధి తలుపు తెరుచుకొని వెళ్ళేడు. జగన్న మళ్ళీ తలుపు వేసీసేడు)

చంద్ర : సోమనాథంగారూ.

సోమ : అక్షింతలూహూ వీడికి? కత్తిమీద రాళ్ళెయ్యాలి ఫకీరు వెధవకి!

చంద్ర : మీతో గట్టి చిక్కొచ్చిందండీ.

సోమ : చిక్కేంట్రా నీ కత్తి!

చంద్ర : మీ మాటింక చాలించండి. టైమవుతూంది, మీరింక తయారుకావాలని చెప్తే వినిపించుకోరు. అమ్మాయిక్కడే వుందన్చెప్పినా ఆ పంచాంగం చదవడం మాన్రు, మిమ్మల్నేవండం?

సోమ : నోరు మూసుక్కూచుంటూలేరా బాబూ! నీ అజమాయిషీ లావయిపోయింది!

చంద్ర : మరింక తయారీకండి.

సోమ : తయారీదేనికి?

చంద్ర : దేనికా? ఈమె సిద్ధంగా ఉంది. వాడు సిద్ధంగా ఉన్నాడు. మీరే సిద్ధంగాలేరు.

సోమ : నీ అమ్మకడుపు బంగారంకానూ! దేనికో చెప్పరా?

చంద్ర : మనం ఇక్కడ ఇప్పుడేవింటి చెయ్యాలో చెప్పండి?

సోమ : ఏవింటి చెయ్యాలి? పెళ్లి.

చంద్ర : "పురోహితుడూ అక్కర్లేదు. గిరోహితుడూ అక్కర్లేదు. అంతా నేనే చేసేస్తా" నన్నారు. ఇప్పుడేవింట్చెయ్యాలో చెప్పండి

సోమ : అవున్రోవ్! మర్చిపోయేను.

చంద్ర : ఇప్పుడు జ్ఞాపకవొచ్చిందికదా! మర్లండి.

సోమ : వాడెవడో రాజమండ్రీవాడు "పెళ్ళిపుస్తకం" వొకటి అచ్చేయించేడ్రా. అద్యాపసి చదివేద్దా మనుకున్నానూ.

చంద్ర : అలాగే చెయ్యండి. వేగిరం ఏదో కానీయండి.

సోమ : ఆ పుస్తకం తెచ్చినట్టు లేదే. ఏవేఁఅమ్మడూ నేనేవైనా పుస్తకం తెచ్చేనా...

కామే : (ఏదో ఆలోచిస్తున్నట్టుగా కూర్చుంది)

సోమ : అర్రె! తేలేదురా.

చంద్ర : బలేవారే మీరు! మరైతే ఇప్పుడెలాగ?

సోమ : మరింతసేపూ జ్ఞాపకం చెయ్యవేవేఁ నువ్వు? ఒరే జగ్గన్నా! చప్పునింటికెళ్ళి—గూట్లో ఉంటుంది పచ్చట్ట పుస్తకం—ఇక్కడున్నట్టు పట్రా!

జగ్గ : (కదిలేదు)

సోమ : ఆగాగు! గూట్లో పెట్టేనా? డస్కులో పెట్టేనా?

[అని ఒక్కక్షణం ఆలోచిస్తూ నిల్చున్నాడు. అంతలో కామేశ్వరి లేచి నిల్చొంది.]

కామే : చంద్రశేఖరంగారూ!

[ఆ స్వరంలో వున్న సీరియస్‌నెస్‌కి అంతా ఆమె వైపు తిరిగిచూసేరు]

చంద్ర : ఏం? ఏవింటి?

కామే : నాకీ పెళ్ళక్కర్లేదు.

చంద్ర : ఏవింటక్కర్లేదూ?

కామే : నాకీ పెళ్ళక్కర్లేదు.

సోమ : ఏవింటే అమ్మడూ! ఏవింటక్కర్లేదూ?

కామే : నాకీ పెళ్ళక్కర్లేదు.

సోమ : ఎంచేత? ఏవింటొచ్చింది?

చంద్ర : ఏం కామేశ్వరీ? ఏవిటయింది?

సోమ : ఇప్పుడీ తిక్కమాటలేవింటి?

కామే : నాకక్కర్లేదు.

చంద్ర : అంతా సిద్ధంచేసేసేం.

సోమ : నీకోసం కుస్తీపట్లు పట్టేం!

చంద్ర : వాణ్ని ఒప్పించేం.

సోమ : బుర్ర వాయగొట్టి మరీ ఒప్పించేం.

కామే : చంద్రశేఖరంగారూ! నే చెప్తున్నా కదూ! మీరంతా నాకోసం శ్రమ పడ్డారు నిజవేఁ. నేనిప్పుడిలా చెప్తున్నందుకు నన్ను క్షమించండి.

సోమ : పీకలమీదికి తెచ్చుకున్నాక ఇప్పుడీ మాట్లేవింటే అమ్మడూ! మరి వాణ్ని పెళ్ళాడకేం చేస్తానంటావ్?

కామే : (నెమ్మదిగా, నిదానంగా) ఈ పెళ్ళి కాపోతే నాకు బతుకు లేకపోలేదు.

సోమ : ఆ వెధవని చేసుకోపోతే బతక లేవా ఏవింటి? అదికాదు నేననేది. గ్రంథం ఇంతదాకా వొచ్చేక ఇప్పుడీ తిక్కపట్టిందుకొచ్చిందీ అని?

చంద్ర : సోమనాథంగారూ! నే ననుకొంటూనే ఉన్నాను.

సోమ : ఏవింటనుకొంటున్నావు? ఏవనుకొంటున్నావో నాతో చెప్పవేఁవేఁ?

చంద్ర : ఇలా అవుతుందనుకొంటూనే ఉన్నాను.

సోమ : ఎలా అనుకున్నావు?

చంద్ర : మనవాడి ఈ రోజువ్యవహారం కళ్లారా చూసిం తరవాత వాణ్ణి పెళ్లాడ్డానికి ఏ ఆడ పిల్లయినా ఎలా ఒప్పుకొంటుంది?

మోహ : (లేచి నిల్చొని) ఆమెకీ ఇష్టంలేదు నాకూ ఇష్టంలేదు. ఇద్దరికీ లేని ఇబ్బంది ఇంతదాకా నీకే ఒచ్చింది కాని.

చంద్ర : షటప్ షటప్.

సోమ : ఒరే నువ్వు నోరెత్తేవంటే ఒళ్లు హూనంచేసేస్తాను. మాటాడక మూల్నలా కూర్చో!

మోహ : ఒంటిగాణ్ణి. ఏఁవంటాను?

సోమ : ఏఁవీఁ అనొద్దనే చెప్తున్నది. నోరుమూసు కలా పడుండు. (జగ్గన్న ముందుకొచ్చి మోహాన్ని భుజంమీద తట్టేడు. మోహాను వెనక్కి చూసేడు. స్టూల్ మీద కూర్చో అన్నట్టుగా సంజ్ఞ చేసేడు జగ్గన్న. వెళ్ళి కూర్చున్నాడు మోహాను).

కామే : నే నింటికి వెళ్తానండీ!

సోమ : ఇంటి కెళిపోడవేఁ? బాగా ఆలోచించుకొనే మాట్లాడుతున్నావా?

కామే : బాగా ఆలోచించే మాట్లాడు తున్నాను. ఈ విషయంలో నాది తప్పంటే దానికి శిక్షను భరిస్తాను. కళంకఁవేఁదైనా ఉంటే దాని బాధ నేనే భరిస్తాను. నే నింటికి పోతాను (అని రెండడుగులు వేసి) నే నింటికి వెళ్తాను, శేఖరంగారూ! మా అమ్మా నాన్నా నన్నా పాటి దాచుకోగలర నే అనుకుంటున్నాను.

సోమ : దానికేఁవుందే! ఇందులో నీదేం తప్పుందని? దసుల్నాజీ వెధవ దగాచేస్తే నీదా తప్పు?

కామే : నా తప్పయితే ఉన్న బాధల్లో ఇదోహటి. ఇందాకా బతుకుతూన్నటుగానే మా బాధలు మేవేఁ భరించి బతుకుతాం.

సోమ . బాగా చెప్పేవు. ఉన్నమా టొప్పుకోవాలి ఈరాత్రసి వెధవని కట్టుకొని నువ్వేం సుఖ పడాలని?

కామే : మ ళ్ళే వెళ్లొస్తానండీ.

సోమ : వెళ్ళిరామ్మా వెళ్ళిరా.

[కామేశ్వరి వీధి గుమ్మందాకా వెళ్ళి తలుపు తీసింది].

సోమ : ఆగాగు!

[కామేశ్వరి ఆగింది. తలుపుతీసి వెనక్కి తిరిగి చూసింది].

కామే : ఏం?

సోమ : ఈ వేళప్పుడు ఒక్కర్తెవీ వెళ్తావా?

సోమ : ఫరవాలేదు.

చంద్ర : ఫరవాలేదంటే నే నూరుకోను. ఒరే జగ్గన్నా! వెళ్లు అమ్మడికి సాయంవెళ్లు!

[జగన్నాధం ఉలిక్కిపడ్డాడు].

సోమ : వెర్రోళ్లా అలా చూస్తావేం?

చంద్ర : వెళ్లు జగ్గన్నా నువ్వూ వెళ్ళు.

[జగ్గన్న మాట్లాడలేదు. నెమ్మదిగా కదిలేడు కామేశ్వరీ జగ్గన్నా ఇంటికి వెళ్ళేరు]

సోమ : ఇంకీ పీనుగు లెందుకూ ఇక్కడా?

[అంతసేపూ గింజుకుంటూనే ఉన్నాడు రాజారావు. కట్టివతాడుని కేసిఎవరు చూడ నప్పుడు కొంతసడలించుకున్నాడుకూడాను]

రాజా : ఒగ్గిరా బాబూ?

సోమ : రోగం ఒదిలిందా?

రాజా : ఒదిలిపోనాది బాబు.

సోమ : ఇంకా ఏవైఁనా శేషఁవుందా?

రాజా : ఇంకేట్లేదు బాబు. ఒగ్గేయండి బాబూ. పోతాను.

సోమ : వెధవ కట్లిప్పేసి పొమ్మన్రా.

చంద్ర : పొమ్మందాం.

[అని వాడికట్లు విప్పడానికి వెళ్లేడు]

సోమ : నువ్వుండు. వాడే విప్పుతాడు. (అని మోహాన్నిచూసి) ఒరే ఇలా ఒచ్చి వాడి కట్లిప్పు.

[మోహాను కురకుర చూసి, వచ్చి రాజా రావుకట్లు విప్పేడు. శేఖరం సిగరెట్టు వెలిగించేడు. సోమనాధం చుట్ట ముట్టించేడు.

కట్లు విడీ విడ్డంతో వీలైనంత తొందరగా వెళ్లిపోయేడు రాజారావు].

సోమ : ఎలా వెళిపోయేడో చూడు దొంగవెధవ! (అని మోహాన్ని చూసి) మరింక నువ్వెందుకూ నువ్వూఫో. సిగ్గున్న వెధవైవతే పోయిచావు.

చంద్ర : గుడ్ బైరా అబ్బాయ్.

[రెండు చేతుల్తోనూ నలిగిన కోటుని సరి చేసుకున్నాడు.]

మోహ : అరె! నా పర్సేదీ!

చంద్ర : పర్సా?

సోమ : ఎవడిపర్సు

మోహ : నా పర్సే! నూటాయాభయ్యం దండులో.

చంద్ర . నీ పర్సు...ఇందాట్లో రాజిగాడి కిచ్చు కున్నావుకదూ!!

సోమ : అది పట్టుకు వాడుడాయించేడు. మంచి పనయింది. ఫో యఘోరించు.

మోహ : నా పర్సు నాపర్సు! (అంటూ గబగబా వెళ్లిపోయేడు)

సోమ : తన్నుకు చావండి వెధవల్లారా! కట్టకట్టు కట్లో ఉరకండి.

[అని చుట్ట కాలుస్తూ కూర్చున్నాడు. బైట మోటారుసైకిలు స్టార్టయిన చప్పుడు]

చంద్ర : సోమనాథంగారూ!

సోమ : ఏమిరా బాబూ!

చంద్ర : వ్యవహారమంతా తారుమారయింది.

సోమ : తారూ లేదు మారూ లేదు. తిన్నగానే అయింది.

చంద్ర : అవుస్లెండి మరి. దగాకోరు, దగుల్బాజీ, స్కౌండ్రలూ అని వాణ్ణి ఆ పిల్ల యెదుట మనమే తిట్టేం. నిజంగా అలాంటి వాడేనని ప్రత్యక్షంగా చూపించేం. మరింకెలా పెళ్ళాడుతుందీ వాణ్ణి!

సోమ : ఛస్తే పెళ్ళాడదు. పెళ్ళాడమన్చెప్పడం మన్ది బుద్ధిపొరపాటు.

[ఇంతలో బైట కారాగినచప్పుడయింది. కొంచెంసేపట్లో రమణయ్య వచ్చేడు. అతని వెనక చిన్నారావొచ్చేడు]

సోమ : రారా రమణయ్ బాబూ రా.

చంద్ర : అలా కూర్చోండి.

రమ : ఏమిటి విశేషం? మావాడొప్పుకున్నట్టేనా ఏమిటి?

సోమ : ముందలా కూర్చోరా!

చంద్ర : మీ వాడొప్పుకున్నాడు.

రమ : ఎలా ఒప్పుకున్నాడు?

సోమ : చెవుల్నులిపి ఒప్పిస్తే ఒప్పుకున్నాడు.

రమ : అయితే ముహూర్తం వగైరా విషయాల గురించి మాట్లాడ్డానికా నన్ను రమ్మన్నట్టు? కుటుంబయ్యకాని ఇక్కడ కొస్తున్నాడా?

చంద్ర : సంగతంతా చెప్తాలెండి.

సోమ : చెప్పడానికేముంది? ఇప్పుడే ఇక్కడే మూడు ముళ్ళూ వేయించేసి ఏడో బసెబల్లాడించి పారేద్దామనుకున్నాం.

చంద్ర : కాని కామేశ్వరొప్పుకుందికాదు.

రమ : కామేశ్వరా? ఒప్పుకుంది కాదూ? దేని కొప్పుకుందికాదు?

సోమ : మీ వాణ్ణి పెళ్ళాడ్డాని కొప్పుకుందికాదు.

రమ : పిల్లే ఒప్పుకోలేదా?

సోమ : ఊహూఁ ఒప్పుకోలేదు. "బతుకుతే బతుకుతాను. లేపోతే ఛస్తానుగాని ఆ ఫకీరు వెధవనయి పెళ్ళాణ్ణ" నేసి వెళిపోయింది.

రమ : అలా అనేసిందా!

సోమ : అంతకంటె కొంచెం మర్యాదాగానే అందనుకో. కాని అలా అన్నట్టే లెక్క. మరి మేంమాత్రం ఏం చెయ్యం? అలాంటి సున్నప్పిడతసరుకుని దాన్నెత్తిమీద బలవంతాన్న రుద్దుదామనుకున్నాం. పిల్ల మాత్రం ముందే మేలుకొని ఇంటికెళ్ళి పోయింది.

చంద్ర : అదీ జరిగిన సంగతి.

రమ : (కొంతసేపు అలా ఊరుకొని) అంతేనండీ అంతే. మరింక మాపనింతే. ఎందుకూ పనికి రాకుండా అయిపోయేం. అక్కర్లేదని కొట్టి

పారేస్తే మరందులో తప్పేంవుంది? మంచి లేదు. మర్యాదలేదు. పస్లేదు. పాటులేదు. పెళ్ళిళ్ళక్కర్లేదు. పెడాకు లక్కర్లేదు. పిల్లలసలే అక్కర్లేదు. ఎత్తిల్లీ! ఏర్పాట్లు లేవు. బాగుపడే లక్షణాల్లేనే లేవు. మరింక మాప నింతే. మా కింక పోయేకాలమేగాని ఒచ్చే కాలం లేదు.

[తెర దిగిపోతూండగా శేఖరం తెర ముందుకు వస్తాడు. తెరపూర్తిగా దిగిపోతుంది]

శేఖరం : స్నేహితులారా, బాగుపడే లక్షణాల్లేని వాళ్ళకి బాగుపడేరోజులు రావనేది రమణయ్య గ్రహించుకొని చెప్పిన విషయం. కాని ఈ జరిగిన విషయాలగురించి కొంత ఆలోచించగా నాకు మరోవిషయంకూడా తోచింది. ఏమిటంటే: ఏ సమాజంలోనైనా పండితులూ, ప్రభువులూ, భాగ్యతా యంతులూ, అయినవారు, ఎప్పుడైతే పిల్లల పంటని తగ్గించి పారేమంటారో, ఎప్పుడైతే పిల్లల్ని తిరస్కరిస్తారో, అప్పుడు వారు నడిపించే ఆ సాంఘిక వ్యవస్థకి భవిష్యత్తులేదని మనం గ్రహించవలసి ఉంటుంది. ఆసమాజానికి పోయేకాలమేగాని ఒచ్చేకాలం లేదన్నమాట. ఇది నాకు తోచిన విషయం. తప్పో రైటో మీరాలోచించండి. మరింక నాకు సెలవిప్పించండి.

(నిష్క్రమణ)

# ఊర్వశీ ప్రణయ భంగము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుని హరవిలాసము భక్తి శృంగార వీర రస భావముల కొక సంగమక్షేత్రము. ప్రథమ ద్వితీయాశ్వాసములలో చిఱుతొండని భక్తి భావము నందలి వీరత్వము, తృతీయ చతుర్థ పంచమాశ్వాసములలో పార్వతీ పరమేశ్వరాలంబనమయిన శృంగార రసము సర్వాంగపరిపుష్టమై పరాకాష్ఠనందినది. షష్ఠాశ్వాసమున హాలాహల భక్షణ నిరూపణమునను, సప్తమాశ్వాసమున కిరాతార్జునీయ కథాసంయోజనమునను వీరరసము చరమసీమ దాఁకినది. ఇట్టి రసబంధుర కావ్యసామగ్రికి సూత్రధార భాషణముగా శ్రీనాథుఁడు కృత్యాదిలో పార్వతీపరమేశ్వరుల వసంత విహార విలాసములను మనసార స్మరించియున్నాఁడు.

వేదండ వదనకుండా దండ గండూష
    కాండ నిక్తాప్సరో మండపములు
గంధర్వ కన్యకా కనక సౌగంధిక
    మాలికా లగ్న పాషాణ్ముకురములు
నందీశ్వరక్షిప్త నారంగ ఫలపాక
    తరళ విద్యాధరీ స్తనభరములు
గరుడ లీలావతీ కస్తూరి కాపంక
    పిహిత విశ్వేశాంగ భృంగిరిటులు
వీరభద్ర వితీర్ణ కర్పూరమార్ద
ధవళితాకాశచర వనితాముఖములు
శాంభవీ శంభు మధుకేళి సంభ్రమములు
పొదల వాసించుఁగాతి నాహృదయవీథి.

—హరవి. ౧. ౬.

గజాననాది ప్రియ నందనములు, నందీశ్వరాది పరివార ముఖ్యులు, పాల్గొని వినోదించు పార్వతీ పరమేశ్వర వసంత కేళీ విలాసములు తన హృదయవీథిని వాసించుఁగాతమని యాశాసించుచు, కవి కావ్యారంభము కావించుటలో, నీ కావ్యమున భక్తిశృంగార వీరరసభావములో తప్రోతములను విషయమాసూచితమైనది. కృతిపతియైన అవచితిప్పయసెట్టి కొమరగిరి నృపాలుని వసంతోత్సవములకు ద్వీపాంతరములనుండి రావించిన సుగంధద్రవ్యసమృద్ధియు, ఆదిశాంభవీశంభు మధుకేళి సంభ్రమముల కుపయుక్తమగు ననుటయు వ్యక్తమగుచున్నది. ఇంతియగాక యీ కావ్యమున శృంగార రసము ప్రాధాన్యము వహించియుండు ననుటయు సూచితమైనది.

పరమేశ్వర భక్తి పరాకాష్ఠ నా సూత్రించుటకు చిఱుతొండనంబి చరిత్రము, శృంగారరస చరమసీమ నభివ్యక్తము చేయుటకు దారుకావన విహారము నిందు సంకలితములైనవి. హరుని విలాసము శైవభక్తులలో వీరుఁడయిన చిఱుతొండని భక్తి పరీక్షతో నారంభమై వీరాగ్రేసరుఁడైన విజయుని సత్త్వపరీక్షతో ముగిసినది. కావ్యారంభమున గిరిరాజనందన పరమేశ్వరు నీర్ష్యోద్ధతిచే లీలారవిందముతో మొత్తినది. ఆప్రేటు చిఱుతొండని భక్తశిఖామణినిగా నిరూపించుటకు బీజమైనది. కుదిని ఏపాకమునకు రాని పాకశాసన నందను నూర్వశీలీలారవిందముతో ప్రేయుట యాతని ధీరోదాత్తత నభివ్యక్తము చేయుటకు నిదానమైనది. ఈవిధముగఁ గార్యకారణభావము నాసూత్రించి యీ ప్రబంధమును రసబంధురముగ నొనర్చినాఁడు శ్రీనాథుఁడు.

రసనిబంధనమునందును ఔచిత్యనిర్వహణము నందును శ్రీనాథుని ప్రతిభ యద్వితీయమై కానవచ్చును. అందును ఊర్వశీ ప్రణయ భంగము నిర్వహించుచోట రచనాసంవిధానమున వ్యాదృశమై రూపలారినది. దేవదారు వన విహారసమయమునందు పరమేశ్వరుఁడు భిక్షాటనమునకై వేశవాటమునఁ జరించునపుడును, తత్పూర్వమునందును, రంభాద్యప్సరోవనితల రూపరేఖలఁ జిత్రించిన క్రమమునఁ జిత్రింపక, నారాయణోరుకాండజనితయైన యూవనితకొక ప్రత్యేకత కల్పించి పెట్టినాఁడు. దేవదారు వనమున ఋషుల వ్రతభంగములు సేయబూనిన యచ్చరలేమల విలాసములు వర్ణించు ప్రకరణమున రంభను 'నలకూబర నఖరేఖాంకిత కుచకుంభ'ముగాఁ జిత్రించి యూర్వశిని 'శృంగారరస వారాశియగు నూర్వశి' యని నిర్దేశమునుచేసి వదలినాఁడు.

ఇటులనే పరమేశ్వరున కాయూ యచ్చరలేమలచే భిక్షపెట్టించు ప్రకరణమున, వారి వారి విలాసములు కానిపింపఁజేయునపుడు గూడ నూర్వశి కొక విశిష్టతను గానిపింపఁజేసినాఁడే కాని, వికారమేమియు, జూపింపలేదు.

అల్లనఁ జేరవచ్చి ధవళాన్నముఁ
గమ్మనియాల నేతితో
బెల్లముతోడ నాల్కడపఁ
జేరముతోఁ దరి పండ్లతోడ శ్రీ
వల్లభు కూర్మి చెన్నెలికి
వారణవైరికి మంచుఁ గొండరా
జల్లునికిం బినాకికిఁ బ్రియంబున
నూర్వశి పెట్టె భిక్షమున్.

హరవి. 5.46.

భిక్షాటనమునకై వచ్చినవాఁడు మంచుఁగొండరాజల్లుఁడు. మంచుఁగొండ ఊర్వశికి జన్మభూమియు విహారస్థానమును. ఇంతియగాక పరమేశ్వరుఁడు తన జనకుఁడైన శ్రీవల్లభునకుఁ గూర్మి చెన్నెలికాఁడు. మఱియు నాతఁడు గజాసుర సంహారి. కావున నూర్వశి విలాసము లేవియుఁ గాన్పింపనీక ప్రీతితో నాతనికిఁ బ్రియమైన భిక్ష పెట్టినది.

అంతకు వెనుకముందులలో నే యచ్చరలేమచే భిక్ష పెట్టించినను, నామెయం దేదియో యొక శృంగార చేష్టితమును గాన్పింపఁజేయుచునే వచ్చినాఁడు. తిలోత్తమ భిక్షయిడిన తీరు పరికింతము.

పెట్టెఁ దిలోత్తమాప్సరస భిక్ష
ప్రియంబున భూతభర్తకున్
గట్టుఁబసిండిపాత్రఁ బులకండముతోడ
ఘృతంబుతోడఁ గ్రొం
బట్టుఁబసిండి నిబ్బెముల పయ్యెదకొం
గొక కొంతజాఱి చ
న్కట్టులలాటలోచనుని కన్నులు
మూఁటికి విందు సేయఁగన్.

—హరవి. 5.48.

ఇట్లా దేవదారు వనవాసినులైన యప్సరస లందఱకు నేదియో యొక విలాసమును వికారమును గాన్పింపఁ జేసిన శ్రీనాథుఁడు, తరువాతి ప్రకరణమున నర్జునునిచే నూర్వశికి మ్రొక్కంపఁజేయనైయుండుటచేఁ గాఁబోలు నామెయం దే విలాసమును వ్యక్తము చేయలేదు.

అర్జునుఁ డూర్వశి ప్రణయమును ద్రోసిపుచ్చిన దాతనిలో రసికత లేక కాదు. అంతకు మున్నొకప్పుడు, పాండవసోదరులు తమలోఁ దాము చేసికొనిన నియమమునకు ప్రమాదవశమున భంగము వాటిల్లినప్పుడు, తీర్థయాత్రలకై పయనించిన యేఁడాది సమయములో నులూపిని, చిత్రాంగదను, సుభద్రను జేపట్టిన రసికావతంసుఁడు కిరీటి. కాని యీ యదను వేఱు. ఇప్పటి చిత్తపరిపాకమును వేఱు. ఈ సమయమున నూర్వశియే గాదు; మఱి యేసుందరివచ్చి మీఁదఁబడినను విజయుఁడు కాదనువాఁడే. అట్టి వాతావరణమును శ్రీనాథుఁ డెట్లు సృష్టించి యున్నాఁడో కొంచెము పరికింతము.

ఊర్వశికిఁ బ్రణయ విఘాతము జరిగినది పార్థునకుఁ బాశుపతాస్త్రప్రాప్త్యనంతర సంఘటనము. అర్జునుఁడు పాశుపతవ్రత నిష్ఠాగరిష్ఠతతో బాహుపరాక్రమ ప్రదర్శన పూర్వకముగ మాయాకిరాతరూపుఁడైన పరమేశ్వరుని మెప్పించి, యాతనివలనఁ బాశుపతాస్త్రము వడసినప్పుడు, ఆ తపోవనమునందుపస్థితుఁడైన యాఖండలుఁడు విజయుఁడైన పుత్త్రునిఁ గౌఁగిలించుకొని అహోవని తనివిలో నేత్రసహస్రమున నానందాశ్రువుల పొదల, నాతనితో "నీవు నివాతకవచ కాలకేయాది రాక్షసులఁ బరిమార్చి, పిమ్మట నమరావతిలోఁ గొన్ని దివసములుండి ప్రవాసప్రయాసం బపనయించుకొని, మరల మర్త్యలోకమునకు వచ్చునది. మాతలి సారథికమ్మగు రథమ్ము ప్రత్తెంచెద"నని, రోమహర్షుడను వానిని పాండవుల కర్జుని కుశలవార్త యెఱింగింపఁబంపి, తా నమరావతికి వెడలిపోయెను. అర్జునుఁడంత మధ్యాహ్నకాలంబున నిర్వర్తింపవలసిన శంభుపూజ ముగించి, కందమూలాదు లాహరించి, యొక చెట్టునీడను విశ్రమించి యుండఁగ, మాతలి దివ్యస్యందనంబు గొనివచ్చి, యాతని నమరావతికి దోడ్కొని పోయెను.

మాతలియుఁ దాము పయనించు మార్గములోఁ గానవచ్చెడి గ్రహ నక్షత్రాది మండల విశేషముల నొక్కటొక్కటిగ నెఱింగించుచు, నమరావతికిఁ గొనిపోవుచుండఁగ నందనోద్యాన వీథిమీఁదుగ నొక మందమారుతము వీచినది. అది కడుసున్నితమై విజయుని విజయాభినందకమైనది. ఆ యనిలప్రసార మీరీతిగ సాగినది—

అర్జునుని మీఁదఁ బొలసెఁ బశ్యంతరమున
స్వర్గ గంగాతరంగా గతానిలంబు
నందనోద్యాన వీథి కానవలతాంత
సౌరభాసార లహరీ విహారమగుచు.

హరవి. 7-115.

ఈ మారుత మాకాశగంగాతరంగ సంపర్కముచే శీతలము పవిత్రమునై, నందనోద్యాన వీథిలో నవకుసుమ సౌరభిలహరిలో విహరించి పరిమళభరితమై, తపోవ్రతాయాస భరితుఁడైన విజయునకు హాయిని గొల్పునదైనది. ఈ మారుతాప్యాయనానంతర మాతనికి జరిగిన దింద్రు నభినందనము. ఆ రథముమీఁదఁ బయనించుచు నమరావతిఁ బ్రవేశించు నరికి నర్జునుఁడు దివ్యాంగనాపాంగ భంగిసమాలింగిత సౌభాగ్యుఁడై మహేంద్రు నర్ధాసనంబున నధ్యాసీనుఁడైనాఁడు. మను చరిత్రమునందువలె నీమారుతము 'మగువ పొలుపు దెలుపు

నది' కాలేదు కాని, దివ్యాంగ నాపాంగభంగీసమాలింగన సూచకమైన దనవచ్చును. మఱియు నూర్వశి వలెనే భగ్నప్రణయయైన వరూధిని ప్రవరుని కంటఁ బడినదై యున్నపుడు, తత్సూచకమైన మారుతె ముల యుటకిది దారిచూపిన దనవచ్చును.

పిమ్మట దేవేంద్రుఁ డావిజయునకు మందారవిపిన వీథిలో దివ్యసౌధము నొకటి విడిదిపట్టుగానిచ్చి, యందాతనిఁ బ్రతిష్ఠించి, జయంత కుమారునికంటె చెక్కుడుగ గారవించెను. ఆ భవనమునందు వాసవ నందనుఁడు విమలసుధాంశు కాంతమణి వేదికపై హంస తూలతల్పమున నేత్రపద్మములు మొగిడ్చి, సుఖసుప్తి నొందియుండ నాతని నభిసరింపవచ్చిన యూర్వశి, కాతనిలో శేషతల్పమునఁ బవళించిన యంబుజాక్షుని భావము గోచరించినదఁట. అనిశాసమయమున విశ్రమించి యున్న విజయు నభిసరింపవచ్చిన దప్సరః కాంత. ఆమె పదునాల్గుజాతుల త్రిదశాంగనలలోఁ జేరు పెంపు వహించిన నీరజాక్షి. నీరజనాభుని యూరు కాండమున జనించిన అయోనిజ. జలనిధి నాపోశన ముగాఁగొన్న యగస్త్యునకుఁ గన్నతల్లి. స్వర్గమునందే గాక భూమియందును పురూరవశ్చక్రవర్తికిఁ బ్రాణ వల్లభయైన పద్మనయన. ఇట్టివిశిష్టతగల యూర్వశి—

కటితోడిప్రాసి కై సేసి కౌతుకమునఁ
గోసలిగా నీలి ఫుట్టంబు ముసుఁగు వెట్టి
గాజులెగఁద్రోసి చప్పుడు గాకయుండ
వచ్చెనూర్వశి యర్జునావాసమునకు.

—హరవి. 7_119

ఈ నీలాభిసారికా వేషము శ్రీనాథుని వాఁటి దియే. గాజులెగఁద్రోసి చప్పుడు గాక యుండ వచ్చెనని చెప్పుటలో నభిసారికాభావాభివ్యక్తి సరసమైనది. ఇప్పుడూర్వశి సుఖసుప్తి పరిపాకము నందియున్న యర్జునుని మేలుకొలుపవలయును. ఆమెకాతని సౌభాగ్యము శేషతల్పమున శయనించి యున్న యంబుజాక్షుని దలపింప జేసినది. అప్సరోజాతి వనితయగుటచే నూర్వశియు క్షీరసాగర సముద్భూతయే. కావున నామెచే, శేషశాయికి క్షీరసాగర కన్యక చేసిన యుపచారము నే చేయించినాఁడు. శ్రీ మహావిష్ణువు శేషతల్పమునుండి మేల్కనునపుడు లక్ష్మి పద్మనాభుని శ్రీపాదపల్లవము లొత్తినది. ఇచట నూర్వశియునటులే కావించినది.

మేల్కొలిపె నిందుబింబాస్య మెల్ల మెల్లఁ
బ్రమదనిద్రాపరాధీను పాండుతనయుఁ
బగడములఁబోలు తనపాణి పల్లవముల
నతని మృదుపాదపంకేరుహంబులొత్తి.

—హరవి. 7-121

అర్జునున కానాటి సంఘటనములన్నియుఁ బ్రమోదావహములు. పార్వతీ పరమేశ్వర సాక్షాత్కారము, పాశుపతాస్త్రప్రాప్తి, స్వర్లోకదర్శనము, దేవేంద్రుని యాలింగనాదరము, తదర్ధాసనోపవేశము, నందనారామ మందారతరు మధ్య సౌధనివాసము, ననునివన్నియు జతఁగూడి సుఖపారవశ్యయుతముగ నిద్రాపరాధీనుని గావించినవాపీతుని. అట్టి వానిని మేల్కొలుపుట కూర్వశియొక్క సుకుమార ప్రయోగము గావించినది. అతని పాదపద్మములను పవడములవలె నెఱ్ఱనై పల్లవములవలె సుకుమారములైన తన పాణితలములతో మెల్ల మెల్ల నొత్తినది. అట్టి సుకుమార పాద సంవాహన మాతని సుఖ నిద్రనుండి మేల్కొలిపినది.

మేల్కాంచిన యర్జునుఁ డేపాటియుఁ దత్తర పాటు నందలేదు. నిద్రాపారవశ్యము గలుగుటకుఁ బూర్వ మాతఁడు ఘోరతప మాచరించి యుండుటచే నాతని మనోలక్ష్యము పాశుపతాస్త్ర ప్రదాతయైన పార్వతీపతిపై నిబిడీకృతమై యున్నది. స్వర్లోక ప్రయాణమున నైంద్ర రథమధిష్ఠింపనున్నపుడు కూడ నాతఁ డుమాపతి పూజ గావించియున్నవాఁడు. ఘోర సంగ్రామమునఁ బార్వతీపతి మెప్పించి పాశుపతాస్త్రమును బడసియున్నవాఁడు. అట్టి విజయున కచ్చర లేమ లేపినంత నే తత్తరపాటు గల్గునా? లేక మనమున బిగువు సడలునా? అర్జునుఁడు లేచి కనుఁగొనఁగా నెదుట నిలిచియున్నది నిర్జరలోక లలామమైన భామిని. సుధర్మాస్థానిలోఁ దాపీవరకే చూచియుండుటచే వెంటనే యామె యూర్వశియని గుర్తించి, పాన్పుడిగ్గి, యామె కభివాదనంబు చేసినాఁ డర్జునుఁడు. ఇది ఊర్వశి ప్రణయమునకు ప్రథమాఘాతము.

అర్జునుఁ డెప్పటివ నూర్వశి నెట్టయిన దూరము సేయక తప్పదు. అంతకు మున్నె సంక్రందనుఁడు విజయుఁడైన తన కుమారుని విజయమును నభినందించుచు "నీవు నారాయణ సఖుండవైన యనాదిమునీశ్వరుండవు. నరనారాయణులవలనఁ ద్రివిష్టపంబునకుఁ జెక్కుతో యంబులు రాక్షస బాధలు శాంతింబొందె; నిప్పుడు హిరణ్యపుర నివాసులైన నివాత కవచ కాలకేయాదులగు దైత్యులఁ బరిమార్పవలయు" నని తనపై మఱియొక విజయభారము మోపియున్నాఁడు. కావున నిది ప్రణయ నిర్వహణమునకు సమయము గాదు. వానినిబట్టి చూచిన నామెతోడి ప్రణయ మాసమయమునందె కాదు గదా! యెన్నఁడుగూడ నంగీకరింపరానిది. కావున విజయుఁ డూర్వశి ప్రణయమున కెడమీయకుండుటకై పాన్పుడిగ్గి భక్తితో నామె కభివాదనంబు గావించినాఁడు. అంతటితో నూరుకొనక, వినయ వినమితోత్తమాంగుఁడై—

"ఈవనితకిఁ రేయి నొంటిమై నింతదూర
మేమి కార్యంబు మదిఁగోరి యేఁగుదెంచి?
లేమ రమ్మన్న రానె? పూర్ణేందువదన!
చెప్పు; మీ పాన్పుమీఁద విచ్చేసియుండు."

అనినాఁడు. ఈ పలుకులలోఁ శాంతనుతనయుఁడా మెపైఁ దనకుఁగల భక్తిభావము తెల్లము చేసినాఁడు. ముందు చేయఁబోవు ప్రసంగమున కీ పలుకు లాముఖమైనవి. ఆమె తన్ను వలచి వలపింపవచ్చినదను భావము ముందుగనే పొడకట్టుటచే నామెను వదలించుకొనుటకుఁ దిగిన ప్రసంగము నుపక్రమించినాఁ డర్జునుఁడు.

"ఓ చేడియ! శ్రీపతియుదయమునఁ జంద్రశేఖరు నుపాస్తి యొనర్చి, యుపాయనములతో నిన్నుఁ జూడఁగ వచ్చువాఁడ ననుకొనుచుండ, 'అడఁబోయిన తీఁగె మెదురైన' ట్లు నీవే వచ్చితివి. ప్రాగ్భవమున నెట్టి పుణ్యములు చేసినాఁడనో గదా! శీతాంశువంశోత్తంసంబు పురూరవుండు మా ముత్తాతగారు. ఆ భూతలపతికి నీ విల్లాలవగుట నాకు నీవు ముత్తవతల్లివి. అందుచేఁ గూర్మి మనుమనిపైఁ బ్రేమ వాటించుట లెస్సయే. ఓ యంబుజాక్షీ! భువన ప్రసిద్ధంబైన ఆదినారాయణుని యూరువు నీ పుట్టినిల్లు, అట్టి పరమ పవిత్రులవయిన నీ పాదపద్మముల కుత్తమ భక్తి వైభవముతో వందనము చేయుటచే నేను పరమ పావనుండ నైతి" ననెను. ఈ ప్రసంగ మామె ప్రణయములిప్సకు ద్వితీయాఘాతము. ఈ తీరుగ 'నూర్వశి తనకు వందనీయ' యను భావమును పెక్కు భంగుల వ్యక్తముచేసి నిర్వికారుఁడై నిలచియున్న పాండుకుమారుఁ డామెకు హితము నే బోధించెను; కాని యూర్వశి కాపలుకు లప్రియములే యైనవి.

ఊర్వశి కర్జున ప్రసంగమువలనఁ దనకోరిక యీడేరదను నిశ్చయము గలిగినది. అయినను మన్మథవికారము మానుకొనలేక, ధనంజయుని యుక్తికిఁ బ్రతియుక్తిగ మాటాడఁ దొడఁగినది. "అర్జునా! ఎన్నియో తరములు గడచిపోయిన పెద్దవావులు శోధించి బయటఁ బెట్టెదవు." వారకాంతలకు వావి వరుసలుండునా? దుగవోటలేని యీ మాటలింకమానుము. "కరుణాకర! పాండునందనా!" యని జాలిగొలుపునటు లాతని సంబోధించి, "నీవు దేవేంద్రుని నిండుకొలువులో నాతని యర్ధాసన మెక్కియున్నపుడు నా కంగజ సన్నిభుడవై గాన వచ్చితివి. అట్టి నిన్ను గాంచి, మన్మథుని పుష్పబాణములకు గుఱియైతిని. ఇట్టి నన్ను నిరాకరించుట నీకుఁ దగునా?" యని ప్రార్థించినది. నీవు వచ్చునపుడు ద్రౌపది కన్యకాంతల దెసకుఁబోవనని సత్యవాక్ప్రతిజ్ఞ చేసితివా? భామలకుఁ జేసిన ప్రతిజ్ఞా సత్యము సత్యము కాదు లే. నా మోహము నా తగులము నా ప్రేమము నా ప్రీతి నా వేడుక నా మానము నా సాహసము వమ్ముచేసిన నేనూరకపోవుదునా? యని గద్దించి మాటాడినది. రణభూమినిఁ బడిన ధైర్యశౌర్య సంపన్నులైన వీరు లెవ్వరైన నైదుపదినేయక నాకై వత్తురు. నీ పితరులవలెఁ గైకొనక యేఁ చెదవు, ఏమి నీవైరస్యము! కావున నిత్తి చేసాలకుఁబోక పూసెజ్జకు రమ్ము, ప్రొద్దుపోయినది. ఈ పులియుట చాలును. అని తన ప్రార్థన వైభవములు బయటఁబడునట్లు మాటాడినది.

అంతటితోఁబోక 'నీవంతటి బ్రహ్మచర్యవ్రతపరాయణుఁడవే!' యని లే మొలక నవ్వులపొంగంబునఁ దొంగలింప, కంకణ ఝుణఝుణత్కారంబు తోరంబుగా, కెంగేలి కేళీకమలంబునఁ బురందర నందనుని వ్రేసినది. ఆ వ్రేటులో నామెకుఁగల తత్తరపాటు ఆత్మాభిమానమును దెల్లమయినవి. ఇది యామె చేయఁగలిగిన ప్రణయప్రయోగములలోఁ జరమమైనది. ఇట్టి లీలారవింద ప్రహారపాతము జరిగినపుడే కైలాసవాసి ఫాలలోచనుఁడు పార్వతిని చక్కదిద్దవలసి వచ్చినది. ఈ ప్రయోగమంతటిది గావుననే శ్రీనాథుఁడు దీనిని 'చిత్తభవ సమ్మోహనాస్త్ర విదారణం' బని చిత్రించియున్నాఁడు.

అత్యంత ధీరోదాత్తుఁడు గావునఁ గిరీటి యా వ్రేటున కంతరంగంబున మిసిమింతుఁడును గాక, యే పాకంబునకు రాక నిర్వికారుఁడై నిలిచియుండెను. ఆ నిర్వికారతయే యాతని ధీరోదాత్తతకు నిదానమైనది. ఇది మూఁడవ ప్రణయాఘాతము. ఉర్వశికిట్టి పరాభవ మీవఱకెన్నఁడును జరిగియుండలేదు. ఎన్ని విధములఁ బెనఁగులాడినను గిరీటి చిక్కనిచునమునఁ బక్కగాన రాలేదు. తన కన్నులవలపు కానఁగాచిన వెన్నెలవోలె బోలివోయినది. ప్రణయవిఘాతము వాటిల్లెనను కోపము సైరింపలేక, నిట్టూర్పులు నిగుడించుచు, నర్జునినుద్దేశించి 'నపుంసకునివలె నాననొవ్వాఁడ; వేకు కాలంబు నపుంసకుఁడవు కమ్ము'. అని శపించి, దిగ్గన లేచి, వెంగంబు గంటువెట్టుకొని, యూర్వశి యింటికిఁ బోయినది.

కాని కిరీటి యాయరిష్టమునకు సంతాపమునంద లేదు. అతఁడు యుధిష్ఠిరానుఁజుఁడు. కావున నాతని మాపు యుద్ధములందు విజయము సంపాదించుటయందే స్థిరపడియుండును. అట్టి విజయమునకుఁ బ్రతిబంధకముగు ప్రణయమున కతఁ డెల వశంవదుఁడగును? ఈ యరిష్టముగూడ వసిష్ఠజననివలని వచ్చినది; గావున శుభావహమే గావచ్చునని యర్జునుఁడు భావించినాఁడు. దానిని శ్రీనాథుఁడు హరవిలాసములో విధివిలాసమని తెలుపింపఁజేయుచుండ, విబుధలోకమునందలి వేఁగుఁబోకలో శక్రుగడియారమున రింఖారావము విన వచ్చినది.

# అతీతుడు

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

ఎప్పటిలాగా ఎర్రవిసంధ్య పడమటిదిక్కున కొలుతూ వుండే సమయానికి, యథావిధిగా అచ్యుతరావు ముస్తాబు చేసుకుని వాహ్యాళికి బయలుదేరాడు.

గేటువరకూ వచ్చాక వెనకనుంచి పిలుపు వినబడి తలత్రిప్పి చూశాడు. వంటవాడు పరమేశం చేయెత్తి పిలుస్తూన్న వాడల్లా వినయవిధేయతలతో "ఈ పూటకు ఏం చేయమంటారు బాబూ?" అని ప్రశ్నించాడు.

తను గేటు దాటబోయే సమయం వరకూ యీ సంగతి వంటవాడికి ఎందుచేత గుర్తుకురాదో అర్థంకాదు అచ్యుతరావుకు. విసుక్కుంటూ బదులు చెప్పి బయటకు వచ్చేశాడు.

ఎదురుగా రోజూ జరిగే నిత్యకృత్యం మరొకటి జరుగుతోంది కొంచెం ఎత్తులో.

ఆ ఎదుటింటి మేడమీద ఎడంవైపు గది కిటికీ తలుపులు తెరుచుకున్నాయి. రిటైరయిన గజెటెడ్ ఆఫీసరు పర్వతాలరాయుడు ఆ కిటికీ చువ్వల సందుల లోంచి ఒకమూలగా పశ్చిమాద్రికేసి చూస్తూ, చుట్ట పొగ వదులుతూ తనలో తాను ఆనందం అనుభవిస్తున్నాడు.

ఒకవేళ అచ్యుతరావు ఆగమనాన్ని అతను పసిగట్టినట్లయితే "చూశారా యీ ప్రకృతిసౌందర్యం. ఈ నోరిలవంటి మేడలమీద నుంచి, పిటేలోని యీకుటిల వాతావరణాన్ని అమాయికంగా మభ్యపరుస్తూన్న మృదువయిన అందం, అహా" అంటాడు.

తనకు చిరాకు కలుగుతుంది.

కాని యిది అప్పుడప్పుడు మాత్రమే జరిగే సంగతే కాబట్టి, యివాళ జరగటం సంభవించక పోగా అచ్యుతరావు సంతోషిస్తూ ఆ వీధిదాటి బజారులోకి వచ్చాడు.

రోడ్డునున్న బురదకు అలడి పంచె అంచు కొంచెం తడిసింది. వానవస్తే ఎంత మంచిబట్టలు వేసుకున్నా ఏం లాభం? అయినా యీవూరి రోడ్లు మంచివి కాబట్టి కొంతవరకూ ఫరవాలేదు. అచ్యుతరావుకు రెయిన్‌కోటు వేసుకోవటమంటే అసహ్యం. అది వేసుకున్న వాడు మిలిటరీ వాడిలాగా వుంటాడని అతని అభిప్రాయం.

ఈలోగా సైకిలుమీద ఒక యువకుడు తన శక్తి సామర్థ్యాల నుపయోగిస్తూ, వాయువేగంతో వచ్చి, మరీ ఫుట్‌పాత్ మీద నడిస్తే బురద అంటుకుందన్న భయంతో కొంచం యివతలగా నడుస్తూన్న అచ్యుతరావును యించుమించు గుద్దినంత పనిచేసి, ఒక్క భుజం రాపుడుతో మట్టుకు పోనిచ్చి, ఏమీ జరగనట్లు దూసుకు పోయాడు.

అచ్యుతరావుకు కోపం వచ్చి "పిళ్ళని అర్జంటు గాళ్ళని పిలవొచ్చు" ననుకున్నాడు. ఈ మాదిరి యువకులున్న లోకంమీద తాను చీదరించుకోకుండా ఎలా వూరుకోగలడు? అసలు యిటువంటి అబ్బాయిల్ని చూసుకుని "మా అల్లుడు" అని ఎట్లా గర్వపడుతూ చెప్పుకుంటారో పిల్లల నిచ్చిన మామలు?

క్రమక్రమంగా అతను నడుస్తూన్న కొద్దీ అనుదినం చూడటానికి అలవాటుపడిన కొన్ని క్రియలు జరిగి పోయినాయి. జింకపిల్ల కొరున్న యింటిముందు పడుకుని ఆలోచిస్తోంది. తనని యిలా నిర్దయగా కట్టి పడవేసిన మనుష్యుల్ని గురించి గావును. తన యింట్లో పనిచేసే యాదమ్మ కొడుకువెంకటి తోటి పిల్లలతో చేరి ఒక సందులో గోలీకాయలు ఆడుతూ తనని చూసి భయంతో మూలకు నక్కాడు. పార్వతి అనే పన్నెండేళ్ళ పిల్ల అతన్ని చూసి నవ్వుతూ సిగ్గుతో లోపలకు పోయింది.

కొన్ని రోజుల క్రితం ఒక ఆదివారంనాడు గావును ఆ పిల్లను చూశాక 'యింకో కొన్ని సంవత్సరాలు పోతే యీ పిల్ల అందానికి పట్టపగ్గాలు వుండవు" అనిపించింది. సరదాగా మాట్లాడాలనిపిం

చింది. ప్రక్కింటివాళ్ళు నడిగి గులాబీ పూలు తెచ్చు కుంటూవున్నట్లుంది. గులాబీపూలంటే తనకు ఇష్టమే.

"అమ్మాయ్! నాకో గులాబీపూ యిస్తావూ?" అని అడిగాడు.

ఆ అమ్మాయి మాట్లాడకుండా ఓ పువ్వు అందిచ్చి తన విశాల నేత్రాలను విప్పి ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డది.

"నీ పేరు?"

"పార్వతి"

అచ్యుతరావు "నన్ను పెళ్లి చేసుకుంటావా?" అని అడిగాడు సరదాగా, భుజా లెగుర వేసి.

ఒక క్షణం అతని ముఖంకేసి తేరిపార చూసి "మా అమ్మతో చెబుతానుండు" అని ఆ అమ్మాయి తుర్రున లోపలకు పరిగెత్తింది.

అచ్యుతరావు సిగ్గుపడి గబగబ ముందుకు సాగి, ఒక నిమిషం గడిచాక వెనుదిరిగి చూశాడు. ఆ పిల్ల ఆశ్చర్యంగా ఓ నడివయసు స్త్రీతో ఏమిటో చేతులు త్రిప్పుతూ చెబుతోంది. ఆమె చిన్నగా నవ్వుతోంది. తలత్రిప్పేసుకున్నాడు.

తను సాధారణంగా యిలా మాట్లాడడే. ఈ మధురమైన అనుభవంతో అతని శరీరం పులకరించింది. తన వయస్సు ముప్ఫయికూడా దాటుతోంది. కాని...

అప్పటి నుంచీ తాను ఎప్పుడు కనుపించినా ఆ పిల్ల తుర్రున లోపలకు పారిపోతుంది. ఇది పరిపాటి అయింది; తను సిగ్గుతో నవ్వుకోవటం కూడా.

అందంగా, ఒకే క్రమంలో కట్టబడిన క్వార్టర్సు దాటుతున్నాడు. అవి కట్టబడింది శాసనసభా సభ్యుల కోసం. కాని అవి వాళ్ళ బంధువులకూ, స్నేహితులకూ ఆలవాలమైపోయాయి. ఒకచోట సినిమా కంపెనీ కూడా వుంది. అతనికి చప్పున ఒక సత్యం స్ఫురించింది. ఒకడి కోసం ఒకడు తంటాలు పడటం యీ జగన్నాటక మాయాలీలలో ఒకటి.

"కహాఁజానే ?" అన్నాడు రిక్షావాడు ప్రక్కకు వచ్చి రథాన్ని ఆపుతూ.

అచ్యుతరావుకు యిక్కడ చాలా రోజుల నుంచీ వుంటున్నా ఉర్దూ సరిగ్గా రాదు. కాని అవసరంవస్తే 'నై' అనీ, 'జావ్' అనీ అనగలడు.

ఇప్పుడు ఆగ్రహంతో "నై. జావ్" అన్నాడు.

"బస్ కిరాయివ్వండి సాబ్. దించేస్తా"

ఆ దారిన బస్సు ఏమీ లేకపోయినా వాడలానే అంటాడు. అచ్యుతరావు వినిపించుకోకుండా వెళ్ళిపోసాగాడు.

రిక్షాలలో తిరిగే మనుష్యుల్ని చూస్తే అతనికి తెగనిమంట. ఈ భారతీయులు యితర దేశస్థుల కత్తులతో, ఫోర్కులతో తిండి తింటే దేముడిచ్చిన చేతులుండగా అవన్నీ ఎందుకని ఎగతాళి చేస్తారు గాని దేముడిచ్చిన కాళ్లు వుండగా ఒక మనిషి తొక్కే బండిలో సిగ్గూ, లజ్జా విడచి ఎలా కూర్చోగలుగుతారో అనూహ్యం. అబ్బ! ఈ ఊళ్లో మరీను. అయిదారుగురు గుమికూడి ఒక రిక్షాలో యిరుక్కుంటారు. ఒకళ్ల మీద ఒకళ్ళు. ఒకళ్ళ క్రింద ఒకళ్లు. మొన్న యిద్దరాడవాళ్ళ మధ్య ఒక మొగవాడు జాగా లేకుండానే కూర్చోవటం చూసి "ఛీ" అని ఏవగించుకున్నాడు. యువతులు కూర్చునే విధానం చూసి తీరాలి. ఈమధ్య ఓ క్రొత్త భంగిమ నేర్చుకున్నారు; ఓ వైపు కటిప్రదేశమూ, రెండోవైపు విమూలగా కాళ్ళు వుంచి వయ్యారమనుకుంటూ రిక్షా అంతా ఆక్రమించుకుంటారు.

ఇలా ఆలోచించుకుంటూ సందడిగా, రకరకాల మనుషులతో కూడివున్న ఓ బజారులోకి వచ్చిపడ్డాడు. ఏక్ సవారీ, దో సవారీ, దువన్నా, తీన్ అణాలతో మ్రోగిపోతుంది ఆ ప్రదేశం గజిబిజిగా. చచ్చే యిరుకు.

"సుల్తాన్‌బజారు ఎందులకు ప్రసిద్ధిం?" అని ఓ గురువుగారు శిష్యుల్ని ప్రశ్న వేస్తే

"సీతాకోక చిలుకలకు" అని జవాబు.

"మరియు?"

"గండుతుమ్మెదలకు".

ఈలోకంలో కొంతమంది రాజకీయవేత్తలుగా, కొంతమంది సినిమాతారలుగా, కవులుగా, కథకులుగా, చిత్రకారులుగా, మేధాసంపన్నులుగా పైకివస్తారు. కొంతమంది రౌడీలుగా పేరు తెచ్చుకున్న వాళ్ళూ వున్నారు. అలానే "సుల్తాన్‌బజారు ఫేమస్" అని పేరుతెచ్చుకున్నవాళ్ళూ అనేకులు. ఓహో! ఈ సృష్టిలో పేరుగలవాళ్లు ఎంతమంది వున్నారు!

అసలు యిది కలగాపులగంగావున్న ప్రదేశం. చార్మినార్ దాటి వెడితే అరేబియాఅన్న భ్రమ కలుగుతుంది. లేక మొగలాయీలనాటి వాతావరణమూ సంప్రదాయమూ కళ్లకుగట్టినట్లు కనిపిస్తుంది. మధ్యతరగతి కుటుంబీకులూ, బీద వారూ ఆనందించేందుకు యిక్కడ ఏమీ సాధనం లేదు. మరీసరదాలుంటే యిక్కడ అమెరికా చూస్తారుట. హుస్సేన్ సాగర్ దాటి జంటనగరంలోకి అడుగుపెడితే మనుషులు లేని పాశ్చాత్యదేశాల రోడ్లవంటిరోడ్లు. ఇంకా అందం తరచబోదామని లోపలకుపోతే అసలు నరసంచారమే లేదు. ఇన్ని విభిన్నమనస్తత్వాలతో, రకరకాలకులాల స్వంతపద్ధతులలో, బురఖాలు వేసుకుని యింకా తిరుగుతూన్న రస్తాలలో ప్రతిచోటా యీ వాడు ఎక్కడకు పోయినా తాండవించే నాగరికత కొంతభాగం పంచుకుంది. నాగరికత! అసభ్యకరమైన ఒక అంశాన్ని ధైర్యంతో బాహాటంగా ప్రదర్శించటమేతప్ప నాగరికత మరొకటికాదని అచ్యుతరావు అర్థం చెప్పుకున్నాడు.

నాలుగురోడ్లమధ్య నిలబడివున్న బీట్ కానిస్టేబిల్ అతనికి తెలిసినవాడు అవటంచేత శాల్యూట్ చేశాడు. ఎవరికో 'పాన్' అందిస్తూన్న కిళ్లీకొట్టు దమ్మిడీలు గౌరవపురస్సరంగా నవ్వాడు. మరుక్షణంలో వీళ్ళిద్దరినీ చూసి జాలిచెందటం ప్రారంభించాడు అచ్యుతరావు. పాపం ఏంజీవితాలు వాళ్లవి? ఆకానిస్టేబుల్ అకేజాగాలో ఎప్పుడూ నిలబడి వికృతంగా చేతులు అటూయిటూ ఆడిస్తూ ఎవరిదారిన వాళ్ళను సాగనంపాలి? చలివేస్తే ఓవర్కోటు వేసుకునీ, వానవస్తే గొడుగువేసుకుని ఆ అల్పత్వానికి గురిఅవుతూ ఆ నరకబాధ అనుభవిస్తూ వుండాలి. కిళ్లీకొట్టుదమ్మిడీలుకూడా అంతే. పొద్దుట ఎనిమిదింటికి తెరిచినషాపు, రాత్రి పన్నెండింటివరకూ మూయ్యక అలా ఎందరికో ఆకులు చుట్టియిస్తూ, సిగిరెట్లు అందిస్తూ, బూతుమాటలుమాట్లాడుతూ దుర్భరజీవితం గడుపుతూంటాడు. పాపం! ఆశ్చర్యం! వాళ్ళజీవితాలు హేయమైనవని వాళ్ళకు తెలియదు. వాళ్లు ఇతరుల సానుభూతి వక్రమార్గంలో పొందుతున్నామని వాళ్లకు తెలియదు. వాళ్ళకు ఆత్మవిమర్శనా జ్ఞానం లేదు. వాళ్ళమీద వాళ్లు జాలిపడరు.

తను! మరితను! తనగురించితనకు తెలిసినంతబాగా ఎవరిని గురించీ ఎవరికీ తెలియదు. అంతేగాక తనకు యితరులగురించి కూడా క్షుణ్ణంగా తెలుసు. ఆ మాదిరి మనుషులు తనని చూసినప్పుడు ఏమనుకుంటారు. ఆయనకు ఒక బాధ్యత లేదు. ఆహా, జీవితమంటే ఆయనదే అనుకొంటారు. ఆ అప్పుడు మాత్రం తామూ అసూయతో, బాధతో కుళ్లిపోతారు. అసలు వాళ్లెవరూ వాళ్లని గురించి తెలుసుకునేందుకు ప్రయత్నించరేం? అతను గర్వపడ్డాడు. తనలాగా ఆలోచించడం ఎవరికీ చేతకాదు.

తన జీవిత విధానం పట్ల అచ్యుతరావుకు చాలా విశ్వాసమూ, తృప్తీ వున్నాయి.

తాను రిక్షా ఎక్కడు అందరిలాగా.

ఉద్యోగం చేయడు.

హోటళ్ళలోంచి కడుపునిండా మేసి, త్రాగి బయటకు వస్తూన్న అనేకమంది విచిత్ర జీవుల్నీ, మేయటానికి, త్రాగటానికి, లోపలకు పోతూన్న వందలకు వందలు పౌరుల్నీ అచ్యుతరావు చూశాడు.

అబ్బ! రోత.

హోటళ్ళలో తినేవాళ్లని బయటనుంచి చూస్తే వాళ్లంతా ఎవరి దారిన వారు ఎగబడి తింటూన్నట్లు కనిపిస్తుంది. ఎంతమంది తింటారో అంతమంది జనాభాలో కూర్చుని. ఒకరు తిన్న పళ్లాలలో ఒకరు తింటారు. కొన్ని వేలమంది తృప్తిగా చప్పరించి వేసిన చెంచాలను పెదవుల మధ్యగా నోటిలోకి పోనిచ్చి, నాలికతో పట్టు చిక్కించుకుని చప్పరిస్తారు. పాకంలో చేసిన తీపిపదార్థాలూ, సాంబారంటారే అదీ తింటున్నప్పుడు త్రాగుతున్నప్పుడు చూడాలి. పోనీ ఎవరిదారిన వాళ్లు తిని ఊరుకోక ఒకరి ముఖంవంక ఒకరు తేరిపార చూసుకోవటమూ, వాడింకా చూస్తున్నాడా అని వీడూ వీడింకా చూస్తున్నాడా అని వాడూ...

ఇలా చీదరించుకోవటంతో తన కసివంతా తీర్చుకుని అక్కడినుంచి దాటాడు.

తన ప్రవర్తనకు వన్నె తెచ్చే మరో విషయం. తాను హోటళ్లచుట్టూ తిరగడు.

అదే తలుచుకుంటూ, గర్వ పరవశుడౌతూ బస్ స్టాండ్ దాటికొంతదూరం పోయే సరికి ఒక సినిమా హాలులో విపరీతంగా జనం త్రొక్కిస లాడుకుంటూ వుండటం, కుమ్ముకోవటం దృగ్గోచరమైంది. ఈ రోజే మొదలైనహిందీ సినిమా చూడటం కోసం జనం తండోపతండాలుగా వచ్చారు. ఒకడు అక్కడున్న బొమ్మలని

చూస్తూ, యిదివరకు పత్రికలో చదివిన కథను గుర్తు తెచ్చుకుంటూ 'అప్పుడు వాళ్ళిద్దరూ' లవ్ లో పడ్డారు. అని ప్రక్కవాడికి వివరిస్తున్నాడు. భార్యాభర్తల మోస్తరు వున్న యిద్దరు రిక్షాలోంచి దిగగా, మొగ వాడు కిల్లీ నములుతున్న ఆడదాన్ని 'నువ్విక్కడే నిల్చో'మని చెప్పి తాను లోపలకు పోయి మందలో కలిశాడు. ప్రతి కొత్తసినిమాకీ మొదటి రోజునే హాజరయ్యే ఒక కాలేజి అమ్మాయినిగురించి యిద్దరు అబ్బాయిలు వ్యాఖ్యానించుకుంటున్నారు. పిల్లల తల్లులు ఎందుకొచ్చామా అని విసుగుకుంటున్నారే కాని కదలనన్నా కదలరు. ఈ దృశ్యాలన్నీ అచ్యుతరావు చూశాడు. భరించలేక పోయాడు. కదిలి ఆ వాతావరణం దాటిబయటపడ్డాక "అమ్మయ్య" అని హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు.

తనకు ఘనత సాపాదించే మరో విషయం. సినిమాలు ఎప్పుడోగాని చూడడు.

హఠాత్తుగా తన ముందు లోకం ఎంత అనిపించింది. ఇంకా ఏమో అనిపించబోతుండగా ప్రక్కనించి వేగంగా దాటిపోతూన్న రిక్షాలోని ఓ వ్యక్తి "ఏమండోయి అచ్యుతరావు గారూ" అని పేరు పెట్టి పిలవటం వినిపించింది. అయినా అతను ఆగలేదు. తలత్రిప్పి వెనక్కి చూడకుండా, మామూలుగా నడవ సాగాడు. ఆ పిలిచింది ఎవరో తనకు తెలుసు. అతనలా వాహనం మీద, అదో దర్జా అనుకుని కూర్చుని కుశల ప్రశ్నలు వేస్తూండటమూ తను నిలబడి సమాధానాలు చెబుతూండటమూనా? అచ్యుతరావు బ్రతికివుండగా అటువంటి పొరపాటు పని ఎప్పుడూ చేయడు.

అతనికి ఆనందం కలిగింది. తనలో ఏదో ప్రత్యేకత వుంది. అది ఎవరూ అందుకోలేనిది. తాను దేనినో సాధించాడు.

ముందుకు సాగాడు. ప్రజలంతా ఎక్కడికో పని వున్నట్లుగా గుంపులు గుంపులుగా పోతున్నారు. ఈ ఊర్లో వున్న బ్రహ్మాండమైన విచిత్రం యిది ఒకటి. సాధారణంగా పండగ వస్తే కొత్త బట్టలు కట్టుకుంటారు. శుభ్రంగా ఫలహారాలు చేసుకు తింటారు. సరదాగా వుంటారు. ఇక్కడ అదేమీ కనపడదు. మనుషులంతా రోడ్లమీదకు వచ్చేసి క్యూ సిస్టమ్‌లో నడిచినట్లు వరుసగా నడిచిపోతూ వుంటారు మాట్లాడనైనా మాట్లాడుకోకుండా.

"...ఆంధ్ర జీవితములో ముఖ్యపాత్ర వహిస్తున్నది."

పెద్దరంగుల గుడ్డ మీద సుంద్రదని అక్షరాలతో లిఖించబడి వేళ్ళాడగట్టబడి వుంది ఒకచోట... ముసి ముసిగా నవ్వుకున్నాడు. తర్వాత జాలిపడ్డాడు. ఇదంతా ప్రకటన చాతుర్యం. చాపల్యం. ఆమాటకు వస్తే ఏది ఆంధ్ర జీవితములో ముఖ్యపాత్ర వహించటలేదు గనుక? "ఆవకాయ"...అతిడి పెదవుల మీద కొంటె తనంతో కూడిన చిరునవ్వు చిందులాడింది. కొంటెగా ఆలోచించటంలో కూడా తాను మొనగాడు. ఈమధ్య తనకు తెలిసిన ఓ యువకుడు వున్నట్లుండి కాళిదాస్ చిరునవ్వులు విరజల్లటం ప్రారంభించాడు. ఒక మిత్రుడిలాంటి వాడు యిల్లు కట్టడం ప్రారంభించి పూర్తికి నే జాప్యం చేస్తూంటే "హార్లిక్స్ తాగవయ్యా" అని సలహా యిచ్చాడు తను. ప్రతి పత్రికా తప్పని సరిగా చదివే తన ప్రక్కయింటి వాళ్ళ కుర్రాడిని అడిగితే ఏసినిమా తారకు ఏ సబ్బు చర్మ సౌందర్యాన్నిస్తుందో, ఏతలనూనె తెల్లజుత్తుని నల్ల జుత్తుగా మారుస్తుందో, మరి ఏతలనూనెజుత్తునిపొత్తుగా పెంచుతుందో గడగడ వల్లించగలడు.

తన తెలివి తేటలకు మరో నిదర్శనం. ప్రకటనలు చూసి ఎప్పుడూ మోసపోడు.

ఇంతలో "అచ్యుతరావుగారూ" అని ఎవరో పిలిచారు.

అతను ఆగాడు. ఆగినందుకు చిరాకు పడుతున్నట్లుగానే ముఖ భంగిమ ప్రదర్శిస్తూ నిలబడ్డాడు.

రామనాథం అనే నలభయి ఏళ్ళ ఆయన ప్రక్క నుంచుని ఎవరితోనో మాట్లాడుతున్న వాడల్లా దగ్గరకు వచ్చి "నమస్కారమండీ" అన్నాడు. అచ్యుతరావు తప్పని సరిగా ప్రతి నమస్కారం చేసి ప్రశ్నార్థంగా చూశాడు.

ఆయన నవ్వటానికి ప్రయత్నిస్తూ "ఎక్కడిదాకా బయల్దేరారు"? అన్నాడు. అచ్యుతరావు ముభావంగా సమాధానం చెప్పాడు. ఆయన అష్టకష్టాలుపడుతూ ఏదో అడగటానికి శాయశక్తులా తంటాలు పడుతున్నాడు. చిరుగు చొక్కాతోనూ, మోకాళ్ళపైకి ఎగసిన పంచెతోనూ, చెప్పులులేని కాళ్ళతోనూ, మాసినగడ్డంతోనూ, తైలసంస్కారం

లేని జుట్టుతోనూ వున్న ఆయన అచ్యుతరావు యింటికి కొద్దిదూరంలోవున్న చిన్న పెంకుటింటిలో నివసిస్తున్న వ్యక్తి. తడబడుతున్న కంఠంతో నే ప్రస్తావనగా కొన్ని ప్రశ్నలు అడగసాగాడు లాంఛన ప్రాయంగా. అచ్యుతరావు ముఖంలో నిర్లక్ష్యాన్ని వ్యక్తంచేశాడు. చివరకు ఆయన రెండు చావునవ్వులు నవ్వి వాలిపోతూన్న ముఖాన్ని వాలిపోకుండా వుంచేందుకు ప్రయత్నిస్తూ 'ఒకపాతికరూపాయలుంటే సర్దుబాటుచేస్తారా. మా అయిదోదానికి చాలాజబ్బుగా వుంది' అంటూ నసిగాడు.

అతనుముఖం చిట్లించి "క్షమించండి. నాదగ్గర లేవు" అని మొహమాటం లేకుండా చెప్పేసి వస్తాను. అని అక్కడినుంచి వచ్చేశాడు.

ముఖపరిచయం వున్నంతమాత్రాన డబ్బు అప్పు అడుగుతాడా యీ పెద్దమనిషి? తనమాట సత్తా ఎంతో తెలుసుకోవాలి నోరు జారేముందు. అసలు డబ్బు అప్పుయిచ్చే వాళ్లన్నా పుచ్చుకునేవాళ్ళన్నా తనకు పరమ అసహ్యం. మానవత్వం చంపుకోవటానికి మరోపేరు యీ రెండిట్లో ఏదైనా ఒకదానికి.

ఆయనగారికి తొంభయి రూపాయల జీతం. మొదటిభార్య చనిపోయేటప్పటికే నలుగురు సంతానం. నోటిలోకి నాలుగువేళ్ళూపోవు. మరో పెళ్ళి వెలగబెట్టి అయిదోపిల్లను కన్నాడు. ఆభార్యకు టి. బి. మరి డబ్బు చాలమంటే ఏంచాలుతుంది? ఈ మనుషులు పెళ్ళి విషయంలోయెందుకు యింతబుద్ధిహీనంగా ప్రవర్తిస్తారో అర్థంకాదు. తనకు కాలుమీద కాలువేసుకుని తిన గలిగినంత ఆస్తివుంది. ముప్పయిఏళ్ళు. అయినా యింత వరకూ పెళ్ళిమాట తలపెట్టలేదు. నిర్విచారంగా రోజులు గడుపుతున్నాడు.

అద్భుతమైన మరోసుగుణం. అందరిలా తను పెళ్ళి చేసుకుని ఆ రొంపిలో, బాదరబందీలో పడలేదు.

ఓహో! తనలో ఎన్ని సుగుణాలు! ఎంతగొప్ప లక్షణాలు!

ఒకదానిని మించింది మరొకటి. ఒకదానికన్న ఉన్నతమైనది మరొకటి. తను యీ ప్రపంచానికి ఒక ఆదర్శప్రాయుడు. తననిచూసి ప్రతివాడు అలా నేర్చు కోవాలి.

దేవుడు ఒక అపూర్వవ్యక్తిని సృష్టించి "యితరులు వేలెత్తి చూపటానికి యితనిలో దోషాలేవీ లేకుండా వుండు గాక" అన్నాడు.

అంతే అతనే అచ్యుతరావై పోయాడు.

సహాయం. మానవులు ఒకరినొకరు సహాయం కోరుతారు. పరిధులు దాటతారు. ఆశలనుపెంచు కుంటారు. ఆశలను త్రెంచుకుంటారు.

మొన్న తనకు వేలువిడిచిన మేనమామ కొడుకు నాతానని చెప్పుకుంటూ ఒకయిరవై ఏళ్ల కుర్రవాడు యింటికి వచ్చాడు.

అతను ఎవరు? ఈ మధ్య దేశంలో ఎక్కడా చెల్లుబడికానివాళ్లూ, అణాకానికి పనికిరానివాళ్ళూ యీ హైదరాబాద్ నగరంలో ఓ ఉద్యోగాలు దొరకబడతాయని తంబలు తంబలు తరలి వచ్చారు. ఎవరో ఒక పరపతిగలవాడివి ఆశ్రయించారు. ఇహ అన్వేషణ సాగించారు.

"బావా! ఇక్కడ ఉద్యోగాలు బాగాదొరుకు తాయటగా. అన్నాడతను ఉషారుగా.

"ఆఁ దొరికేవాళ్లకు దొరుకుతూనే వుంటాయి"

"నువ్వేమి ప్యాసయినావు?"

"ఇంటర్మీడియట్ పార్ట్ వన్‌పోయింది. నేనిహ దాన్ని కంప్లీట్ చేయదలచలేదు. నువ్వున్నావు గదా అనియిలా బయల్దేరి వచ్చాను. నెలకు ఓ నూటయాభై చాలు బావా. ప్రైవేటు కంపెనీ అయినా పరవాలేదు. ఏమంటావ్?"

తను మొహమాటపడటం చేతకాని వాడు గనుక యిలా నిష్కర్షగా చెప్పేశాడు. "అబ్బాయ్! నూటయాభై చాలా? బలేవాడివే. ఈ దేశంలో అన్ని వూళ్లలోకంటే యీ వూళ్లో ఎక్కువగా ఉద్యోగాలు దొరకటల్లేదు, దొరికేవాడికి ఎక్కడైనా దొరుకుతుంది. పైగా యిక్కడ క్రొత్త ప్రభుత్వం వచ్చాక యిది వరకు అర్హతలు చాలకపోయినా ఉద్యోగాల్లోకి తీసుకున్న వాళ్లని వూడపెరికేస్తున్నారు కూడా. నాకు పరపతి వుంది నిజమే. కాని యిలా ఉపయోగించలేను. కావాలంటే నువ్వు రెండు నెలలపాటు యీ యింట్లో వుండు. తను "నీకు చాతనైతే వెదుక్కో. నేను మాత్రం సాహాయ్యం చేయలేను."

అతని మొహం కందగడ్డలా అయింది. అర్రాత్రే చెప్పాపెట్టకుండా వెళ్ళిపోయాడు.

"సహాయం. వీళ్ళకు ఎందుకు బుద్ధిలేదో, తమ పరిమితి తెలుసుకోకుండా ఒకరిపై ఆధారపడకూడదని. అయినా ఏంజీవులు వీళ్ళు? మామూలుమనిషికి కావలసిన లక్షణాలు వీళ్ళకు లేవు. చూడగా తనకు తప్ప మరెవరికీ లేనట్లున్నాయి.

ఈవిశాల ప్రపంచంలో తలకోక రీతిగా శాసనకుతూ యింతలోపఘూయిష్ఠంగా అనవరతమూ మనుషులు మగ్గిపోతూ ఎలా జీవిస్తారో విచిత్రం. ప్రకృతిఅనే త్రాసులో తనను ఒకవైపు నిలబెట్టి, రెండవవైపు మానవ లక్షణాలను మానవునికి పనికివచ్చే అంశాలను పడవేస్తే బరువు ఎటూ మొగ్గకుండా సరిగ్గా సరిపోతుంది. అస్థానే తనుగాక మరెవరినైనా నిలబెడితే ఎటువైపో ఒకవైపు వాలిపోతుంది.

ఇది హేయ ప్రపంచం. కుళ్ళు ప్రపంచం, బాధల ప్రపంచం, తప్పుల ప్రపంచం, దోషయుత ప్రపంచం.

తాను ప్రేక్షకుడు!

ప్రొద్దున్నే లేస్తారు. గడబిడగా కాలకృత్యాలు ముగించుకుంటారు. నోట్లో యింత అన్నం కుక్కుకుంటారు. సైకిళ్ళమీద, సైకిలు రిక్షాలమీద, కుద్దుకుని కుమ్ముకుని సిటీబస్సులమీద ఆఫీసులకు పరిగెడుతారు. చివాట్లు తింటారు అధికారులచేత. తప్పుపనులు చేస్తారు. దొంగలెక్కలు వ్రాస్తారు. 'డిప్టిల్ వాటర్' యిచ్చి అయిదు రూపాయలు జేబులో వేసుకుంటారు. కేసు గెలిచినా ఓడినా డబ్బు వసులుచేస్తారు. అప్పుల కోసం ఎగబడతారు. ఒకరినొకరు పొడుచు కుంటారు. తెగడు కుంటారు. మంచినీళ్ళ పంపుల దగ్గర యుద్ధాలు చేసుకుంటారు. నీతితప్పి చరిస్తారు. ఇళ్ళల్లోంచి బయటకు వెళ్ళ గొట్టించుకుంటారు. పనికిరాని పిల్లకాయలకు పిల్లలనుయిచ్చి మురిసి పోతారు. ఈగలతో, దుర్వాసనతో నిండివున్న కొంపల్లో జీవుతారు. అతి మధుర సన్నివేశంలో కూడా తమ ఉద్యోగాన్నీ, బాధ్యతనూ తలపుకు తెచ్చుకుని 'అమ్మో' అని కుమిలిపోతారు. రోగాలతో, వేదనలతో అఘోరిస్తారు. చీట్లపేకలు ఆడతారు. ద్యూటిపేరిట నడిరోడ్డుమీద నగుబాటు ఆరోపణలు చేస్తూంటారు. పరస్త్రీలకోసం వ్యామోహ పడతారు. తాగుతారు తందనాలు ఆడుతారు...అబ్బ! దుర్భరం!

బాగా చీకటిపడి పోయింది. క్రమంగా పెద్దపెద్ద వీధుల్లోని దీపాలు తీర్చిదిద్దిన వరసలుగా దూరాన సందుల్లోకి దృగ్గోచర మాతున్నాయి. అచ్యుతరావు ఒక సందులోంచి నడుస్తున్నాడు. మనుషుల సందడి అంతగాలేని అమాసకచీకటి. సందులో మెల్లగా అడుగులు వేస్తూ నడుస్తూ ఒక పెంకుటింటికిటికీ ముందు నడక వేగం మరీ మందంచేసి అటూ ఓరగా చూశాడు.

కిటికీవున్న గదిలో ఓదీపం వెలుగుతోంది. ఇతరులకు స్పష్టంగా కనిపించేటట్లుగా ఓ స్త్రీ కూర్చుని వుంది అటుకేసి. అచ్యుతరావును చూసి చిన్నగానవ్వి అవ్యక్త ధ్వనితో ఏదో పలికింది. అతను వినిపించుకోకుండా తలప్రక్కకు త్రిప్పుకుని నడిచాడు ఠీవిగా. అతని పెదవులు చిన్నగా హసించాయి.

తాను...తాను అతి నిగ్రహశాలి. స్త్రీజాతి మీద లాలసలేదు. తాను ఎవరికీ దాసోహం అనడు.

తన జన్మ ధన్యమైంది.

ఒక ఫర్లాంగు నడిచాక అచ్యుతరావు ఆగి చుట్టూరా చూశాడు. అంతా చీకటిమయం. ఆ పెద్ద వీధుల్లోని దీపాలుకూడా యిక్కడకు కనబడటంలేదు. ఈ ఏకాంతంలోని ప్రశాంతంవల్ల తన నిర్మలత్వానికి బంగారానికి తావి అబ్బినట్లుగావుంది. అసలు సృష్టిలోని రహస్యం యిదే. బాధాపూరిత మనుషులమధ్య, పెనుచీకటి పేలికలమధ్య ఎవరూకాననిచోట హాతాత్తుగా శాంతీ, వెలుగూ వుంటాయి. అది అరాతీసి సమీపించగలిగినవాడు అదృష్టవంతుడు. తానే మేధావి.

అతను నిశ్చింతగా నిట్టూర్చి చుట్టూ మళ్ళా కలయచూశాడు.

ఇవి అసహ్యమూ, దరిద్రమూ తాండవించని ధనవంతుల మేడలనీడలు. ఇది సుఖభోగలాలసులైన వ్యక్తుల మలినచరణాలచే తొక్కబడని ఒక మారుమూల ప్రదేశంలోని నిర్జనభూమి. వివిధభోగపరాయణులు నిర్లక్ష్యంగా స్పృశించని అడివిలాంటి పట్టణ భాగం.

తనకెందుకో యీ జాగా చూస్తేనే ఒక అపూర్వ నేస్తాన్ని చూసినంత ఆప్యాయతగావుంటుంది.

ఇక్కడ పచ్చిక లేదుగాని వుంటే విశ్రమించాలని వుంటుంది.

దీనికి కారణం ఎప్పుడో తెలిసింది. కల్మష యుత, దుఃఖసమ్మిశ్రిత, అసహ్యభరితమైన అన్ని వీథులు, బజార్లు దాటాక యిహ దీనిపైన నరసంచారానికి తావులేదు. అడ్డుగా పెద్దగోడవుంది.

ఆ గోడనానుకుని అచ్యుతరావు క్షణంపాటు కనులుమూసుకున్నాడు. ఇది అన్నిటికీ అతీతమైనది. ఎవ్వరూ తన అంతస్థు స్పృశించలేనిది.

ఇహచాలు. ఇదే అతని 'టెర్మినస్' అతను వెనక్కి తిరిగాడు. ఒక అవ్యక్త ప్రబోధనతో మన సంతా మగతనిండి, నేత్రాలు ఉజ్వలంగా ప్రకాశిస్తున్నాయి.

తాను అతీతుడు. కోర్కెలను, మానవ బలహీనతలను అవలీలగా అతిక్రమించినవాడు.

వందగజాలు గడిచాయి. అక్కడ ఒక స్ట్రీట్ లైటు వుంది. ఎడమవైపు సందు మలుపుతిరిగి ఓ వ్యక్తి నడిచి వస్తూ అచ్యుతరావుకు అక్కడ కనిపించాడు, సరిగ్గా దానివెల్తురులోకి వచ్చేసరికి ఆ వ్యక్తి తనలోతను ఏదో మాట్లాడుకుంటున్నాడు. గాలిలో చేతులు తిప్పుతున్నాడు. తీవ్రంగా గొణుక్కుంటున్నాడు. పైగా ఆపనివల్ల ఏదో ఆనందం అనుభవిస్తున్నట్లుగా గోచరిస్తున్నాడు.

"ఆత్మారావు! ఏ లోకంలో విహరిస్తున్నావ్!" అంటూ అచ్యుతరావు అతన్ని ఎగతాళిచేస్తూ ఆపాడు.

అతను ఉలిక్కిపడి, యితనివంక తేరిపార చూసి "నువ్వా?" అన్నాడు.

"నేనే యిలా ఎక్కడికి?"

అతను ఆశ్చర్యపడి "అవును నేను యిలా ఎందుకు వచ్చాను? వుత్తిర్ ఘట్టీకి బయల్దేరాను" అన్నాడు.

అచ్యుతరావు అతన్ని చూసి జాలిచెందాడు. "నువ్వీ అలవాటు మానుకోవాలోయ్"

"ఏ అలవాటు?"

"నీకు ఏవో బాధలు, ఆవేదనలు వున్నాయని నాకు తెలుసు. కాని వాటినుంచి విముక్తుడివి కావటానికి ప్రయత్నించాలి. అనుక్షణం ఆలోచిస్తూ, తన లోతను మాట్లాడుకుంటూ, చేతుల్ని గాలిలో త్రిప్పుతూ కలతమతియయ్యే ఒక మనిషివున్నాడంటే నాకు నవ్వొస్తోంది. నీ జీవితం, ప్రవర్తన యితరులకు ఎంత హాస్యాస్పదం! నీలాంటి వాళ్ళు ఎలా బ్రతుకుతారో నా కర్థం కాదు. ఆశ్చర్యంగా వుంటుంది"

"నాలాంటివాళ్ళు ఎలా బ్రతుకుతారో నీకు ఆశ్చర్యంగా వుంటుందా?" "అవును మీరు నార్మల్ మనుషులు కానందుకు. అవివేకాలకు లోనవుతున్నందుకు"

ఆత్మారావు కళ్ళు ఒక్కసారిగా ఎర్రబడ్డాయి. "అచ్యుతరావ్!" అన్నాడు. "ఇతరుల కెవరికీ లేని ప్రత్యేకత నీలో ఏదో వుందని నీవు చాలా కాలంగా అనుకుంటున్నట్లు నాకు తెలుసు. నాలాంటివాళ్ళంటే ఏదో చులకన భావంతో మిడిసి పడుతున్నావని నీ మాటలవల్ల నేనకసార్లు గ్రహించాను. జీవితంతో పోరాటంచేసేవాడిని చూస్తే బాధ్యత, బరువు తెలియని నీలాంటి వాడికి యీ కబురు చాలాకాలంగా చెబుదామనుకుని కూడా మామూలు మనిషిని కాబట్టి "ఎందుకులే"అని వుపేక్షిస్తూవూరుకున్నాను. నన్ను చూస్తుంటే నీ కాశ్చర్యంగా వుందా? పాపం: నిన్ను చూస్తుంటే మా అందరికీ ఎంత ఆశ్చర్యంగా వుంటుందో, మేమంతా ఎంత వెక్కిరించుకుంటామో నీకు తెలియదు. ఎలా తెలుస్తుంది? నువ్వెప్పుడూ లోకులనిగురించి ఆలోచించటమే గాని, నీగురించి లోకులు ఏమనుకుంటున్నారో ఎప్పుడైనా వింటేవా? ఇహమీదట ఆ సావకాశం కలిగించుకో. కాస్త నీ గురించి ప్రజలేమనుకుంటున్నారో కూడా విను. నీకేమైనా బోధపడుతుంది" అని యిహ అక్కడ ఆగకుండా వెనక్కి తిరిగి గబగబ వెళ్ళిపోయాడు.

అచ్యుతరావు నివ్వెరపోయాడు? ఇదేమిటిది? ఈ ఆత్మారావువచ్చి విచిత్ర విషయాలు చెప్పిపోయాడు. తన తీర్మానం, దృఢ విశ్వాసం అవన్నీ పటాపంచలు చేశాడేం? అబ్బే! యివి నమ్మతక్యంగాలేవు. కాని యీ మూర్ఖుడు చాలా ఆవేశంలో పలికిపోయాడు, మూడాలి.

అసలు అతనికి తనమాటలకు ఎదురుజవాబు చెప్పగలిగే సామర్థ్యం వుంటుందని అనుకోలేదు. అలా చేయుటమేగాక దబాయించాడు.

అతను మెల్లిగా ఆ కిటికీని సమీపించాడు. ఓరగా చూశాడు. ఆ స్త్రీ యింకా అలానే కూర్చుని బయటకు చూస్తోంది. మళ్ళా అవ్యక్త ధ్వనితో ఏదో అంది.

అచ్యుతరావు మందంగా సాగాడు. సంతృప్తి పడబోయాడు. తను, తన నిగ్రహం...ఓహో! కాని ఆత్మారావు అన్న మాటలు గుర్తుకు వచ్చాయి...ఆమె ఏమిటో అంటున్నట్లుగావుంది. ఆలకించాలి. అతను ఊపిరి బిగించాడు. ఆమె చాలానిరసనగా, హేయమైన భావంలో...చాలు...అతను విన్నాడు.

అచ్యుతరావుకు తల తిరిగింది. తనేనా భూమ్మీద యింతమాట పడింది. ఆమెకేమైనా మతిపోయిందా? తన నిర్లక్ష్యానికి, నిగ్రహానికి ఎటువంటి అర్థం తీసి పరిహసించింది? పైగా పెద్ద శబ్దంతో కిటికీ తలుపులు మూసుకుంది.

ఛీ! ఎంతమాట అన్నాడు! ఈ స్త్రీకి కొంచమైనా బుద్ధిలేదు.

కాని...!

ఆత్మారావు చెప్పిన మాటలు? తన గురించి లోకంలో కొందరు యిట్లాకూడా అనుకుంటున్నారా?

తడబడటం కొత్తగా అలవర్చుకున్న అడుగులతో ముందుకు సాగాడు.

చీకట్లో యిద్దరు మనుష్యులు ఎదురుగా వచ్చారు. ఇతన్ని ఎగాదిగా చూసి ప్రక్కకు తప్పుకుని గుసగుసలు చెప్పుకున్నారు.

అచ్యుతరావు వీనులకు ఆగుసగుసలు యీవిధంగా సోకాయి, ఎన్నడూ విననంత శ్రద్ధగా వినటంచేత.

"వీడిపేరే అచ్యుతరావంటే, పిల్లికి బిచ్చం కూడా వేయడు...చస్తే ఒకడికి సహాయం చెయ్యడు."

ఈ యిద్దరికి కూడా మతులు పోయినట్లున్నాయి. లేకపోతే అట్లా ఎందుకు చెప్పుకుంటారు?

అతని మనసు సందిగ్ధమైంది. ఉద్విగ్నమైంది, "పాపం వీళ్ళు అమాయకులు" అనుకున్నాడు. ఆత్మారావు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. దుర్మార్గుడు నిజం చెప్పాడేమిటి కొంపతీసి...!

అచ్యుతరావుకు కొద్దిగా శరీరం చమర్చింది. బాధపడ్డాడు.

కాని ఈ విధంగా బాధపడటమారంభించటానికిది ప్రథమం. బయటి ప్రపంచంనుంచి చీకటి ఆ విషయాన్ని దాచింది.

మెల్లగా విశాలమైన వీధులోంచి నడవసాగాడు. నడకలో కొద్దిగా ఠీవి తప్పింది. తనని రాసుకుపోతూన్న ప్రతివాడూ తన గురించి ఏమయినా చెప్పుకుంటున్నాడేమోనని చెవులు రిక్కించి వినసాగాడు. తాపత్రయపడుతున్నాడు. ఆశాభంగం చెందుతున్నాడు. మళ్ళా ఏదో గండం తప్పిందికదా అన్న అవ్యక్తపు సంతోషం.

పాడు పాడు కార్లతో, పిచ్చి పిచ్చి సైకిళ్లతో, చెత్త చెత్త రిక్షాలతో, వెర్రిమొర్రి మనుషులతో నిండి వున్న బజార్లలో పడి వెనక్కి నడిచి వస్తున్నాడు అతీతుడు అచ్యుతరావు.

సినిమాహాలు సమీపించాడు. ఇందాకటి సందడి తగ్గినా సెకండుషోకోసం అప్పుడే కొంతమంది జనం పడిగాపులు కాచుకు కూర్చున్నారు.

అచ్యుతరావుకు కాళ్లు వణికాయి.

వాళ్లంతా తనని చూసి నవ్వుకున్నట్లు అనిపించింది. వెక్కిరిస్తున్నారేమో. ఆత్మారావు మాటలు గుర్తుకువచ్చాయి. చెవులు రిక్కించి వినాలి. క్షణంలో మారిన తన మనసుతో సాధన చేయాలి.

"వాడు వున్నాడే వాడు. అచ్యుతరావు. చస్తే సినిమాలు చూడడు. ఒక్క సినిమా పాటరాదు. ఒక్క సినిమాస్టార్ పేరు తెలియదు. చవట."

అబ్బే! ఇది కేవలం తన భ్రమ. ఎవరూ యీ మాటలు అనటంలేదు. తను అపోహ పడుతున్నాడు. అక్కడున్న వాళ్ళలో ఒక్కడికి తను తెలియదు.

కాఫీ హోటళ్ళలో జనం యింకా ఎగబడి ఉంటున్నారు. అస్తవ్యస్తంగా వున్నారు. తల త్రిప్పి హోటల్ ప్రొప్రయిటర్ ముఖంవంక చూశాడు. అదే సమయానికి అతనూ యితనివంక చూశాడు.

అచ్యుతరావు ఆ చూపు భరించలేకపోయాడు. తల ప్రక్కకి త్రిప్పేసుకున్నాడు. ఆ చూపు ఎంత ఎకసెక్కంగా వుంది; వాళ్లంతా చూడు ఎలా తింటున్నారో; ఎంత సరదాగా వున్నారో! నువ్వో? వొట్టి దేబావివి. అన్నట్టుగా వుంది.

"అబ్బే లేదు. లేదు. అతని చూపులో అట్లాంటి భావంలేదు. కేవలం భ్రమ. భ్రమ" అనుకున్నాడు.

"అబ్బే కాదు. నిజమే" అనుకున్నాడు.

"అబ్బే అసలువాడికీనాకూ ఏం సంబంధం. నేనెవరో వాడికి తెలియ నే తెలియందే" అనుకున్నాడు.

అచ్యుతరావుకు హఠాత్తుగా మనస్సు ఎదురు తిరిగింది.

"ఛీ నేనెందు కింత హీనంగా ఆలోచిస్తున్నాను? నేనెక్కడ? వాళ్లెక్కడ? నాస్వభావం ఎక్కడ? వాళ్ల స్వభావం ఎక్కడ?" అని సమర్థించుకో ప్రయత్నించాడు.

సమర్థన సమర్థనలాగే వుంది. మాట నుంచి మాటలు ప్రతిధ్వనించినట్లు "నాస్వభావం ఎక్కడ? వాళ్లస్వభావం ఎక్కడ?" అని మళ్ళీ వికృతంగా ఆలోచన స్పందించింది.

ఆ తాకిడికి అతను పూర్తిగా అప్రతిభుడయి పోయాడు. "నన్ను నేను ఎంత చులకన చేసుకుంటు న్నాను! ఆ మూర్ఖుడి మాటలు సాంకేతికంగా పని చేస్తు న్నాయంటే. ఇదంతా కేవలం భ్రాంతి. నేను ఆదర్శ ప్రాయుణ్ణి" అని తనకితాను విన్నవించుకున్నాడు.

పోలీసువాడు పని రద్దీ తగ్గటంతో దమ్మిడీలు దుకాణందగ్గరకు పోయి నిల్చుని ఆకులునములుస్తూ కబుర్లు చెబుతున్నాడు. సమీపంగా వస్తున్న అచ్యుతరావుని యిద్దరూ చూశారు. గౌరవంగా చేతులుదించారు.

అచ్యుతరావుకు భయంవేసింది. కనీసం వీళ్ళకు అయినా మంచి అభిప్రాయం వుందా?

ఆత్మారావుమాటలు గుర్తుకు వచ్చాయి. శరీర మంతా నీరసం క్రమ్మింది. ఇందాకటిదంతా భ్రాంతి అన్న సందేహం సడలిపోసాగింది. అసలు తనగురించి వీళ్లేదో చెప్పుకుంటారని ఎందు కనుమానించాలి?... ఎందుకనుమానించకూడదు? వీళ్ళు తననిగురించి ఎందుకు చెప్పుకుంటారు? ఎందుకు చెప్పుకోకూడదు? తాను విన కూడదు, వినాలి.

కాని పాముచెవులు పెట్టుకుని వినక తప్పలేదు.

"అదికాదు దమ్మిడీలూ! ఈయన జీవితం ఏమి టంట? సాయంత్రం అలా వస్తాడు. రాత్రికి యింటికి వెడతాడు? ఒక స్నేహం, జల్సా, కుషీ ఏమీలేదు. డబ్బుండి చేసేదేమి టంట? విడ్డూరం మనిషిలా వున్నాడు."

"ఎవరిపిచ్చి వారి కానందం?

ఈవాడు తన శ్రవణకుహరం ఏం పాపం చేసు కుంది. అతివికి ముచ్చెమటలు పోశాయి. తాను ఎవరిని గురించి నిరంతరం జాలి చెందుతున్నాడో వారిదృష్టిలో తాను హాస్యాస్పదమైన పాత్ర అయ్యాడు. ఈ లోకం అంతా తనను యింత కించపరుస్తూ ఆలోచిస్తూందా?

ఏతలనూనె ఏపని చేస్తుందో గడగడ చెప్పే ప్రక్క యింటి వాళ్ళ అబ్బాయీ, పని మనిషి యాదమ్మ కొడుకు వెంకటే, జింకపిల్లా, వంటవాడు పరమేశం వీళ్ళంతా ఆకస్మికంగా ఒక ఉన్నత స్థానం ఆక్రమిం చుకుని, అతని హృదయంలో చోటుచేసుకుని బిగ్గ రగా నవ్వుతున్నారు. తన కీవి, దర్జా, అంతస్థు, ఊహాలు...

విరిగిపోయినాయి, బూడిదలో కలిసిపోయి నాయి. అతనికి పార్వతి గుర్తువచ్చింది.

ఆపిల్ల తననుచూసి నవ్వుతుంది. కాని వెక్కి రిస్తూ నవ్వదు. అది కొంటెతనం గలనవ్వే. ఆ కొంటె తనంలో ఎంతో హాయివుంది. అది అనుభవించినవాడు ధన్యతముడు. ఆమె ఇంటికేసి ఆశగా చూశాడు. నిట్టూర్పువిడిచాడు. ఇంటి తలుపులు వేసివున్నాయి. ముందువిచారం ఆవరించబోయింది. కాని వెను వెంటనే "హమ్మయ్య" బ్రతికాను అనుకున్నాడు.

తన పరిస్థితి యిప్పుడు ఎంత హృదయ విదార కంగా వుంది. వచ్చేదారికీ, వెళ్ళేదారికీ యీ రోజు ఎంత వార కనుక్కోగలిగాడు.

"కహాఁజా తేసాబ్" అన్నాడు రిక్షావాడు ప్రక్కగా వచ్చి రథాన్ని ఆపుతూ. వీడు సాధారణంగా ఎప్పుడూ అడుగుతూంటేవాడే. వీడి యిల్లు యీదరి దాపుల్లో నే ఎక్కడో వుండి వుండాలి.

"అక్కర్లేదు" అన్నాడు కోపంగా తెలుగులో.

"ఏమయ్యవయ్య అయ్యవు! ఒక్కనాడైనా రిక్షా ఎక్కిన పాపాన పోతివి గాదు. డబ్బంతా మూట గడుతువుగాని లే" అని రిక్షావాడు గబగబ త్రొక్కు కుంటూ వెళ్ళిపోయాడు.

అచ్యుతరావు నిర్విణ్ణుడై పోయాడు. ఈసారి వినాలని అనుకోకుండా యీమాటలు విన్నాడు. దుర్మార్గను దాటిపోయాడు. ఒక మనిషిని ఒక మనిషి గొడ్డులా లాగడం, రిక్షా ఎక్కకుండా వుండటం లోతన ఆశయం!

ఒక యింటి ముందుకువచ్చాడు. ఆయింటి అరుగుమీద అయిదారుగురు మనుషులు కబుర్లు చెప్పుకుంటున్నారు. యితను రావటం కనిపెట్టి వాళ్ళంతా మాటలు కట్టిపెట్టారు. అచ్యుతరావుకు యీ యిల్లు ఎవరిదో తెలుసు. వాళ్ళంతా తనని చూసి మాటలు ఆపేశారు. అతని గుండె గబగబ కొట్టుకుంది. వీళ్ళు తననుగురించి యేమనుకుంటారో వినాలి. కాళ్ళు నేలమీద నెమ్మదిగా వొణుకుతున్నాయి. అరుగు దాటుతూ సర్వధ్యానమూ అటే కేంద్రీకరించాడు.

"పోతున్నాడే మనవాడు."

"పోనిద్దూ వాడూ ఒక మనిషేనా!"

"అవునుగాని ఏమిటే వాడి ఉద్దేశం. ఇలా మిగలబెట్టుకొని జీవితంలో ఏం సాధిద్దామని!"

"ముప్ఫయి ఏళ్ళు దాటాయి. యింకా పెళ్ళి పెడాకులూ లేకుండా..."

"పెళ్ళెందుకు? ఊరుందిగా. రోజూ చార్మినార్ వైపు పోయొస్తుంటాడు లే."

"అయినా కొంతంత ఆస్తి వున్నప్పుడు పెళ్ళి చేసుకుని కులాసాగా వుండాలి కానీ యిదేం బుద్ధులయ్యా. పెళ్ళయితే యీపాటికి నలుగురు బిడ్డల తండ్రి అయివుండేవాడు."

"ఇప్పుడు ఎంతమంది బిడ్డల తండ్రయ్యాడో!"

అంతా నవ్వారు బిగ్గరగా. దూరంనుంచి ఇంకా ఏవో మాటలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి. అచ్యుతరావు శరీరం తూలింది. కష్టమ్మీద కాళ్ళు స్వాధీనంలోకి తెచ్చుకుని నడవసాగాడు.

అయిదు బిడ్డలని కని పోషించలేక సతమతమవుతూన్న రామనాథం, పెళ్ళాం జబ్బు నయం చేయలేక రోగం ముదిరిపోతూన్న అర్భకుడు రామనాథం, ఈ రాత్రి తను పెళ్ళి చేసుకోలేదని పరిహసించాడు. ఎన్ని రాత్రులనుంచీ పరిహసిస్తున్నాడో. ఇవాళ తను విన్నాడు.

ఒక స్ట్రీట్ లైటు వెలుతురులోకి వచ్చాక తనవేపు సాధ్యమయినంతవరకూ చూసుకున్నాడు. తానీ వయస్సులో పెళ్ళి చేసుకోలేదని వాళ్ళకు ఆశ్చర్యమైంది.

హఠాత్తుగా హృదయక్షేత్రంలో సంకులసమరం చెలరేగింది. కాదు. అది సంకులసమరం కాదు. ఒక భయంకర విషాద సన్నివేశం. తనకెవరో వీడ్కోలు యిస్తున్నారు.

వేలమంది యువకులున్న ఒక సభలో అధ్యక్షుడయిన యువకుడు లేచి "ఇవాళ ఎంత విచారకరమైన రోజు! ఇన్నాళ్ళబట్టి అచ్యుతరావుగారు కూడా మనలాంటి యువకాగ్రేసరులు. నేటినుంచీ వారు మననుంచి దూరమై పోతున్నారు. యువక ప్రపంచంనుండి వృద్ధ ప్రపంచంలోకి అడుగు పెడుతున్నారు. వీరు యువకులుగా వుండి మన అందరిలాగే విచ్చలవిడిగా ప్రవర్తించకుండా, బ్యాలెన్సు తప్పి సంచరించకుండా జరలోకి ఒక్కసారిగా వెళ్ళిపోతున్నారు. వారి వీడ్కోలు నిమిత్తం ఏర్పాటు చేయబడిన యీ సభకు అధ్యక్షుడుగా..."

అచ్యుతరావుకు భయం వేసింది. తాను పెద్దవాడై పోతున్నాడు ముసలివాడై పోతాడు. సాధించింది ఏమీ లేదు. పెడదారిన పడ్డాడు. ఘనుడినని తలపోశాడు. అసమర్థుడననీ అవ్యక్తుడిననీ నిరూపించుకున్నాడు. తాను ఎందుకూ పనికిరాడు. ఇంతవరకూ జీవితకాలమంతా వృథా చేశాడు. చివరకూ అందరకూ హాస్యాస్పదమయిన పాత్ర అయాడు. ఆత్మారావు తనకు కనువిప్పు కలిగించాడు. ఇంతవరకూ అందరినిగురించీ ఆలోచిస్తూ, "వీళ్ళంతా ఎట్లా బ్రతుకుతున్నారా!" అని ఆశ్చర్యం చెందాడు. తననిగురించి వాళ్ళంతా వేలెత్తి చూపిస్తున్నారనీ, పదిమందీ కలుసుకుని కూడా చెప్పుకునేందుకు తనలో చెప్పలేనన్ని లోపాలున్నాయనీ గుర్తించాడు ఇప్పుడు. ఇంతమంది నోటిలో పడిన ఈ జీవిత భారం ఎలా మోయటం ?

తాను అతీతుడననుకున్నాడు. అందరికన్నా మిన్న అనుకున్నాడు. కాని కాదు. తనకెవరూ చిల్లిగవ్వకూడా ఇవ్వటంలేదు.

మూసివున్న గేటుతలుపులు తెరుస్తూంటే చేతులు వణుకుతున్నాయి. తాను అతీతుడు కాదు. కానే కాదు.

ఇంతలో మెరుపులా ఓ ఆలోచన తాకింది. ఒక్కసారిగా ఒళ్ళంతా ఝల్లుమంది. గేటు కిర్రుమంది. తాను అతీతుడే. ముమ్మాటికీ అతీతుడే!

# కాళిదాసకవిత

### ఆంగ్ల మూలం : శ్రీ అరవిందులు

ప్రాచీన భారతీయ సంస్కృతి చరిత్ర, ముప్వురు పుణ్యమూర్తులుగా మూర్తీభవించినది. వారే వాల్మీకి, వ్యాస, కాళిదాసులు. ఇతర చారిత్రికాధారములేవి నశించినను, ఈ త్రిమూర్తుల కావ్యములు భారతీయ సాంస్కృతిక సమగ్ర చరిత్ర మనకు బ్రసాదింపగలఁగలవు. వీరి కావ్యములు మూఁడు మహాయుగములకుఁ బ్రాతినిధ్యము వహించును. మూఁడు సోపానములుగా నభివృద్ధిగాంచిన ఆర్య మానవ నాగరక చరిత్ర నివి ప్రతిబింబించును. అందు ప్రథమ సోపానము ప్రధానముగా ధార్మికమైనది. ద్వితీయ సోపానము మేధోద్దీపితమైనది. తృతీయ సోపానము రస సంపద్విలసితమైనది. ఇఁక నాల్గవ సోపానము నొకటి గలదు. అది ఆధ్యాత్మికమైనది. మానవాంతరంగములను వికసింపఁజేసి వ్యవస్థీకరించునది. అట్టి యీ దశ పై మూఁడు దశలకు నాంతరంగిక శక్తి సామర్థ్యములను బ్రసాదించి పుష్టివంతము గావించునది. అందుచే నిదియొక ప్రత్యేకస్థాయిలో నిలిచి వర్ధిల్లక, మానవుని కన్ని దశలయందును చుక్కాని పట్టుచు నాగరికునిగాఁ దీర్చిదిద్దెను.

పై మూఁడు దశలును విశిష్ట కవితాశక్తి సముత్ఫుల్లములు. ఈ దశలలోని వాఙ్మయము తమ తమ యుగ ధర్మములను ప్రతిబింబించును. అందుచే నీ కవిత్రయము మానవ సాంస్కృతిక చరిత్రయం దఖండస్థానము నాక్రమించెను. అందుచే వీరు 'హోమరు' 'షేక్స్పియరు' 'డాంటె' మున్నగు పాశ్చాత్య కవి పుంగవుల కగ్రతస్సరులుగా గౌరవింపబడుచున్నారు.

## వ్యాసవాల్మీకులు

రామాయణమహాకావ్యమొక అదర్శ సంఘమును ప్రతిబింబించును. అట్లని అదియొక కాల్పనిక గాథయని భావింపరాదు. ఆదర్శోపేతమగు సంఘమే వాల్మీకిచే రామాయణ కావ్యమున మఱింత అదర్శముగాఁ దీర్చిదిద్దఁబడినది. ఏ కవీశ్వరుఁడు కావి హఠాత్తుగా నట్టి యుత్తమ సంఘము నెట్టి యాధారమును లేక తన కావ్యమున నిరూపింపఁజాలఁడు. ఒకవేళ యట్టి కల్పనకే కవీశ్వరుఁడు గడంగినను, ఏదో యొక ఘట్టమున అనౌచిత్యము పాలుగాకతప్పదు. ఈ సందర్భమున వాల్మీకి కాలమును గూర్చియు, రామాయణ కర్తృత్వమును గూర్చియు చర్చింప పనిలేదు. ఏదెట్లున్నను, ఒక్క ఉత్తరకాండను పరిహరించిన, మిగిలిన రామాయణ మహాకావ్యమంతయు నొక్క వ్యక్తిచే శక్తివంతముగా రచింపఁబడెనని కనులు మూసికొని తీర్మానింపవచ్చును. రామాయణము భారతేతిహాస రచనకు పూర్వమందు రచింపఁబడినదా? పరమందునా? అని సంకోచించువారును గలరు. భారతము కన్న రామాయణము నందలి కవిత్వము పచేలిమమైనది. అందువలననే ఈ సందేహ ముద్భూతమైనది. ఒక్క కవిత్వమే కాదు; సంస్కృతియు భారతము నందు కన్న రామాయణమునందు చక్కని పరిపాకమున నున్నట్లు గోచరించును. అంగమాత్రమున పూర్వాపరములను నిర్ణయింపరాదు. భారతమునందువలె రామాయణమున మానవత్వ మభివృద్ధిఁ గాంచలేదు. భారతము నందువలె, రామాయణమున మానవమేధ సంక్లిష్టమై విశిష్ట గమనము నందలేదు. రామాయణ భారతేతిహాసములను తులనాత్మకముగ పరీక్షించిన, వాల్మీకి మహర్షి నాఁటి సాంఘిక రాజకీయ వాతావరణము, వ్యాస మహర్షి నాఁటి సాంఘిక రాజకీయ వాతావరణము కన్న భిన్నమనుట స్పష్టము. వ్యాసుని కాలము విప్లవోజ్జ్వలమైనది. రాజకీయ నిరంకుశ దౌర్జన్యము, క్షత్రియ భుజబల దర్పముచే నేర్పరుపఁ బడిన నీతి

అనువాదం : శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము

క్షాత్రము, ఆకాలమున ప్రాబల్యము వహించెను. భారతములోని శిశుపాలపాత్ర, ఆనాటి విప్లవోన్ముఖమానవ స్వభావమునకు ప్రతినిధియనవచ్చును. భారతేతిహాస కాలమునాటి నీతి, యొకరీతిని ఏర్పడినది కాదు. అది నిరంకుశముగ స్వైరవిహారమొనర్చినది. స్త్రీపట్ల ఆనాటి పురుషస్వభావమెంతో పరుషముగను, హింసాయుతముగను నుండెడిది. వాల్మీకి కాలము నందలి పరిస్థితులిట్టివి కావు. అవి యింతకన్న మృదులములు: భావాత్మకములు; సున్నితములు; నిర్మలములు ననవచ్చును. క్రూరమును, దుష్టమును, అరాజకమును నగు కొన్ని విపరీత పరిస్థితులను వాల్మీకి సానుభూతితో తిలకించి సమన్వయించెను. వాల్మీకి కవితాత్మ విశ్వజనీనమైనది. స్వచ్ఛందమగు భావోద్వేగముతో కూడినది. అందుచే నాతఁడు తనకాల పరిస్థితులను ఉన్నదున్నట్లు చిత్రించుట కిష్టపడలేదు. దానిని తన మధుర హస్తముతో నాదర్శ రామణీయకముగ తీర్చి దిద్ది జాతీయ ప్రతిష్ఠా సంరక్షకుడుగను, ఆదర్శకవి పుంగవుఁడుగను మన మన్ననలనందుకొన్నాడు వాల్మీకి. ద్వివిధములగు దృక్పథముల నాతఁడు తన కావ్యములఁ బ్రదర్శించెను. ఒకటి ధార్మిక దృక్పథము. ఇది ఆధ్యాత్మిక సంస్కృతి విలసితము. సత్త్వ సంపుల్లమగు మానవ స్వభావోల్లసితము. రెండవది అసురోద్దీపితమైనది. నిరంకుశ భోగపరాయణత్వము, దీనిముఖ్య లక్షణము. రాజసిక దౌష్ట్యముతోఁ గూడిన మానవ స్వభావమిది. ఇట్టి భావ వైరుధ్యమును వాల్మీకి తన రామాయణ కావ్యమున బహురమణీయముగఁ బ్రదర్శించెను. అందుచే నీమహోత్కృష్ట కావ్య ప్రభావమునకు లోనైన ఏవ్యక్తిగాని, ప్రపంచ వాఙ్మయములలోనే యితర కావ్యమును చేబట్టియు, తత్తుల్యమగు రసచర్వణము చేయజాలఁడని నిస్సంకోచముగ చెప్పవచ్చును.

వాల్మీకి సృజించిన పాత్రలు భావోద్రేకపూరితములైనవి. భారత పాత్రలు మానసిక విశ్వాస సంజనితములు. రామునిలో నైతికోత్సాహ మధికము. రావణునిలో అవినీత్యుత్సాహ మధికము. భౌతిక సుఖసంపదల కాశింపక, ఎట్టి తీవ్ర పరిణామములకును నవకాశమీయక, విశ్వజనీనములగు నైతిక సిద్ధాంతములకు శ్రీరాముఁడాచరణమునందు ప్రాణము పోసెను. ఇట్టి నాన్యతో దర్శనీయమగు పాత్ర సృష్టిచే వాల్మీకి విశ్వజనీన కవితాజనకుఁడుగా గౌరవభాజనుఁడగుచున్నాఁడు. అట్టి యీ కవీశ్వరుడు, హిందూతత్త్వమునకు ప్రాతిపదికరై, నైతిక నాగరకతోల్లసితమగు యుగమునకు యుగకర్తగా పరిగణింపఁబడును.

ఇఁక భారతేతిహాసకర్త, నిరంకుశోన్మాదమగు యుగమునకుఁ జెందినవాడు. భారతేతిహాస మనేక చారిత్రకాధారములకు స్థానము. వివిధ నిరంకుశ ప్రభుత్వ విధానములకు, సాంఘిక వ్యవస్థలకు నాకాలము ఆలవాలము. వివిధ ప్రభుత్వముల నొకే యొక కేంద్రపరిపాలనమునకుఁ దీసికొనిరావలయునను క్షత్రియ వీరుని ప్రయత్నము లిందు ప్రబలముగా ప్రత్యక్షమౌను. తన భారతేతిహాసమున వ్యాసుఁడు తత్కాల పరిస్థితులను స్పష్టముగఁ జిత్రించెను. వాల్మీకి యట్లు గావింపలేదు. తన కాలపరిస్థితులను సమీక్షించుచునే వాని నాదర్శోపేతముగ సవదరించినాఁడు. వాల్మీకి స్వేచ్ఛాపూరితుడగు ఆదర్శవాదియగునేని, వ్యాసుఁడభ్యుదయోపేతమగు వాస్తవికవాది. స్వైరవిహారము గావించుచున్న సాంఘిక నీతినియమములను తిరస్కరింపక వ్యాసుఁడు వానికొక సామరస్యమును గూర్చుటకై ప్రయత్నించెను. అట్టి సాంఘిక ప్రవర్తనము నాతఁడు 'నిష్కామకర్మ' మార్గమున పునీతమొనర్చి, ఆదరణ యోగ్యము గావించెను.

ఈ అన్నింటికన్న మిన్నదగిన దాతని యసాధారణ మేధాసామర్థ్యము. అది భావ ప్రఫుల్లమైనది. అనేక నైతిక క్లిష్టగ్రంథుల నవలీలగా విడదీయగలది. వాల్మీకి స్వభావము వలె వ్యాసుని స్వభావము కుసుమ కోమల సదృశమైనది కాదు. వ్యాసుఁడనేక క్లిష్ట పరిస్థితులయందు నీతికి ఒరపిడి గల్గించును. తన ప్రజ్ఞాప్రాభవముచే సాధారణ నైతిక స్థాయినతిక్రమించి అసాధారణ నైతిక స్థితి నేర్పరుపగలడు. ప్రభుత్వమును, ప్రజను, ఒక రాజనీతి ధురంధరుఁడుగా సమీక్షింపగలడు. అతఁడు స్పృశింపని విషయముండదు. ఏ విషయమును అతడు చర్చించినను, అతని స్వోపజ్ఞచేతను, తపశ్చరణచేతను, పవిత్ర దర్శయిత్రి ప్రభావముచేతను దానికొక సమగ్రతను, చారితార్థ్యమును ప్రసాదించును. ఈ అన్ని విషయములందును వ్యాసుఁడు తత్కాల నాగరకోపేత జీవితమును ప్రతిబింబించుచునే యుండెను.

మహాభారతములోని పాత్రలన్నింటిలోను విస్పష్టముగా గోచరించునది వ్యాసుని మేధాసంపదయే.

పాత్రల ప్రతి చర్యయు మానసిక భావనా ప్రేరణముచే యేర్పడినది. ఇట్టి భావప్రేరణము రామాయణము నందును గొంత కానవచ్చును. కాని రామాయణ కాల మొక ఆదర్శయుగము. శాంతి సంస్థాపనా లక్ష్య మా కాలమందధికము.

## కాళిదాస మహాకవి

వాల్మీకి వ్యాసుల యనంతరము, వేయి సంవత్సరములు పైబడిన పిమ్మట, జాతీయభావ వికసితమగు కాళిదాసు మహోదయము జరిగెను. వాల్మీకి వ్యాసులు ప్రతిబింబించిన నాగరకతలకును, ఈ కవీశ్వరుడు ప్రతిబింబించిన నాగరకతకును అజగజ భేదముగలదు. నీరసమగు బౌద్ధమత విధానమును ప్రతిఘటించి, ప్రజలు రసిక జీవిత విధానమును గాఢముగ వలచిన కాలమది. ప్రజా హృదయములలో జాతీయాభిమానము పిల్లవిరిసిన సమయ మది. సమస్తశాస్త్ర క్రోడీకరణమును ఆ కాలమందే జరిగెను. కవులు, మహాకవులు, పండితులు, భాషా వేత్తలు, నైఘంటికులు, వేదాంతులు, తార్కికులు నిత్యోత్సాహ వికసితులై, యానంద జీవితయాత్ర సాగించినారా కాలమున. సమస్త ప్రజానీకమునందును రసోద్రేకము వెల్లువలై పారినది. వాస్తవిక జీవిత భోగానుభవాసక్తి, నిరంతర సౌందర్యదిదృక్షు, ఆబాలగోపాల మునందావేశించెను. చిత్రలేఖనము, శిల్పము, సంగీతము, నృత్యము, నాట్యము, ఆరామనిర్మాణము, మున్నగు ననేక కళలు, శాస్త్రసమ్మతముగ సంపూర్ణత్వమును బడసినవి. మహానగరములు నిర్మింపబడినవి. గ్రీకు సంప్రదాయ లక్షణములు పొడగట్టినవి. ఇట్టి యుగలక్షణములు కొన్ని విలక్షణగుణములతో గూడినవి. ఇవి హఠాత్సంభవములు కావు. కాలపరిణామమున పరిఢవిల్లినవి. ఇంతకుపూర్వమునను శాస్త్రక్రోడీకరణము జరుగకపోలేదు. కళలు వికసిల్లకపోలేదు. భౌతిక సంపదభివృద్ధి జరుగకపోలేదు. రామాయణ మహాభారతముల యందు ప్రతిబింబించు భౌతిక సంపదకన్న, రఘువంశ మహాకావ్యమున ప్రతిబింబించు భౌతిక విభూతి బృహత్తరమైనది. ఇతిహాసములందలి భౌతికైశ్వర్యము, ఉన్నతి లక్ష్యముల కణగిమణగి యుండెను. ఈ కాలమున భౌతికైశ్వర్యమే అత్యున్నత స్థానమలంకరించి, ప్రభుత్వము నెఱపుచుండెను. జాతీయజీవశక్తులన్నియు దత్పరిపోషణమునకే వినియుక్తములు. జాతీయ జీవనముపై తన్నాగరకతా ముద్ర అచ్చుపడినది. ఒక ప్రక్క తత్వశాస్త్రము, కళలు, విజ్ఞానశాస్త్రములు వృద్ధి నందుచుండెను. మఱియొక వైపున సూక్ష్మమేధా సంజనితమగు తర్కశాస్త్రము పెంపు వహించుచుండెను. మానవుడు ఇంద్రియములకు బానిసయై సంచరించుచుండెను. మతోద్రేకములు విచ్చలవిడిగా విహరించుచుండెను. ఇట్టి క్లిష్టపరిస్థితులు తలయెత్తుచున్న కాలముననే, కాళిదాస మహాకవి, సకలశక్తి సమన్వితుండై ఉజ్జయినీ నగరమునఁ బొడగాంచెను. ఆ యుగమునందలి సమగ్ర విద్యాసమృద్ధినంతయు నీ కవీశ్వరుడు పుణికి పుచ్చుకొనియెను. ధనిక నిరంకుశోన్నత సంఘమున స్వేచ్ఛగా సంచరించినాడు. భౌతిక భోగలాలసమగు జీవితమును గడిపినాఁడు.

కాళిదాసునకు షేక్స్పియరు మహాకవికిని గుర్తింపఁదగిన కొన్ని పోలికలుగలవు. అట్టివానిలో నెన్నఁదగినది తనకు సన్నిహితమగు భూతకాల చరిత్రను కావ్యవస్తువులుగా స్వీకరించుట. అప్పుడప్పుడు వర్తమాన విషయములు భవిష్యత్సూచనములుగా గావించుట మున్నగునవి. షేక్స్పియర్ వలెనే కాళిదాసు కూడ మత విషయముల నంతగా పాటింపలేదు. వేదాంతమే అతని మతము. శివార్చనమే యాతని మతనియమము. తన కాలమునందుగల ఈ సనాతన సంప్రదాయ పూజా విధానములో కాళిదాసున కొక విధమగు రస మాధుర్యము లభించినది. అందువలననే యాతడా పూజా విధానమును ఆమోదించెను. నైతిక విషయములందును, కాళిదాసు సమకాలీన నీతిశాస్త్రములను ప్రమాణములుగా స్వీకరించెను. కాని వ్యక్తిగతముగ నాతనికట్టి నియమ పాలనమున్నట్లు కనబడదు. అట్లని కాళిదాసు పేరట చేయువాడుకలో గల జనశ్రుతుల నన్నింటిని మనము విశ్వసించుట అవివేకమగును. కాళిదాసు కవిత్వము దురభిమానరహితముగ నుపాసించి ఏ సారస్వత విద్యార్థియు లేనట్టి నైతిక నిష్ఠను సంపాదించినట్లు భావింపడు. కాళిదాసు కవిత్వము ఉత్తమలక్ష్యములయందును, ఉన్నతభావములయందును గాఢానురక్తిగలది. కాని యాయనరక్తి రసోల్లసితమైనది. అతఁడే విషయమును ప్రస్తావించినను, ప్రపంచించినను, దానిని తన మధుర హస్తముతో రసప్లావితమొనర్చును. సౌందర్యశోభలతోఁ దీర్చి దిద్దును. అందుచే కాళిదాసు కవిత్వము వాల్మీకి వ్యాసుల కవిత్వము కన్న భిన్నముగా గోచరించును. వీరోచితమగు పాత్రల గభీర స్వభావములను రసోచిత

ముగ సమదరించుటే కాళిదాసు కవిత్వమున గల విశిష్టత. ఇందాతఁడు సమకాలీన భౌతిక నాగరకతా సంపదవంతయుఁ బ్రతిబింబించును.

కవియనువానికి చైతన్య శక్తి కావలయును. సాధారణ మానవచైతన్యము నాతఁడు చక్కఁగా వ్యక్తీకరింపవలయును. అట్లు వ్యక్తీకరింపఁ జాలని వాఁడు ఉత్తమ కవిశ్రేణికిఁ జెందఁడు. కాళిదాసు మహాకవి, ప్రజాచైతన్యమును రసభరితముగ వ్యక్తీకరింపగలఁడు. అందాతఁడు సర్వేంద్రియ సంతృప్తి నొనర్పఁగలఁడు. ఆతనికవిత్వము రసానంద సౌందర్యసముద్దీపితము. ప్రతి కవితాంశమును కళాత్మకముగ చెక్కుటలో నీతని కీతఁడేసాటి. ఎట్టి ఛందస్సుగాని ఆతనికి వశముగాకుండ నుండదు. ఛందస్సును వశము గావించుకొనుటయే గాక, దానిని పరాకాష్ఠ సౌందర్యస్థాయికి తీసికొని పోవుట లోను నాతఁడద్వితీయుఁడు. వస్తుస్వరూప స్వభావములను కనులకు గట్టినట్లు చిత్రించు శిల్పమున సిద్ధహస్తుఁడాతఁడు. ప్రబలదార్శనిక శక్తితో వర్ణనలను రసాత్మకముగ నిర్వహించు నైపుణ్యమాతనికి వెన్నతో నలవడినది. వర్ణరంజితము, రూపరంజితము, భావరంజితమునగు కవిత్వమే కాళిదాసు కవిత్వము. ఇందాతఁడు పరిణితప్రజ్ఞ వెలసిన కళాతపస్వి. పచేళిమమగు భావములను, రమ్యాతిరమ్యముగ రచింపగల దక్షుఁడు. భాషార్ణవమును మథించి, ఛందోమృతభాండమును వెలార్చిన సారస్వత యోద్ధ. సంస్కృత శబ్దకోశమును తన యత్యద్భుత శిల్పకళాకౌశల్యమునకో నిర్మాణ మొనర్చిన ప్రప్రథమ మహాశిల్పి యాతఁడు. పుంఖానుపుంఖములుగా సాగిన సంస్కృత కావ్య నిర్మాణమంతయు నీతని నాధారముగాఁ జేసికొని జరిగినదియే. చక్కని పదింపు కల్గి, రాజఠీవితో, శ్రుతిహితమై, భావానుకూలమగు ఛందస్సులో, పటుత్వ పదయోజనతో, ఇతిహాసశైలిని బోలి, యధికపద రహితమై మధురమంజులమైన కాళిదాసు కవితాశైలి నాన్యతోదర్శనీయమైనది. ఇందలి గణనీయమైన ముఖ్య లక్షణము మార్దవము. ఈ కవితాశైలిని సులభముగా ఇతిహాసశైలిగను, భావకవితాశైలిగను, నాటకశైలిగను పరివర్తింపవచ్చును. అట్టి శక్తి మార్దవత్వముచే సంప్రాప్తమైనది. ఈ కవీశ్వరుడు ఇతిహాసశైలికి, ప్రబంధోచితమగు శబ్దాతిశాయి సౌందర్యగాంభీర్యములను సంతరించెను. ఈతని నాటకీయశైలి, సంభాషణోచితమై, నిశితమై, యుద్వేగ పూరితమైనది.

ఇట్టి వరప్రసాద లబ్ధుఁడగు కాళిదాసునకు ఆతని కాలము, నాగరకత, మతింత ప్రాభవమును సమకూర్చినవి. ఆతని వర్ణనాత్మకమగు ప్రతిభకు మతింత వన్నెఁ దెచ్చినవి. ఈ నాగరకత నిరంకుశమైనది. భౌతిక సుఖభోగానురక్తిని, రసికతాభిరుచులను, ప్రాపంచిక విజ్ఞతను, విజ్ఞానమును, మేధను, బురస్కరించుకొని యీ నాగరకత యొక విధముగ యూరోపియను నాగరకతను దలపించును. 'పదునాలుగవ లూయీ' కాలమందలి ఫ్రాంసుదేశ పరిస్థితుల వంటి పరిస్థితులీ కాలమున గలవు. ఇవి మేధనో భావమునో సంతృప్తిపరచునవియే కాని ఆత్మసంతృప్తిని కలిగించునవి కావు. అయినను గతమును నిరసించుట, ఆనాఁటి ప్రజలయభిరుచికి భిన్నమైనది. మతాభిమాన మున్నను, ఇంద్రియభోగానుభవలాలసత్వము, అవినీతి ప్రవర్తనము, ప్రజాజీవితమున ప్రాబల్యము వహించినవి. ఆనాటి యాడంబరమైన న్యాయస్థానములు, సనాతన నైతిక మత సంప్రదాయములను బలపరచుచుండెను. అది కేవలము సనాతన సంప్రదాయాభిమానమే. ఆయభిమానము నొక విధముగా మూఢమైనదే యనవలయును. ఏలయన, ప్రజాజీవితమున వానికంత ప్రాబల్యము లేదు. కాని రసాత్మకమగు కవితాది కళలయందు గల ఉత్తమాదర్శములు సంప్రదాయసమ్మతములైనవే. వానిని రసజ్ఞతతో కాంతాసమ్మితముగఁ జెప్పిన ప్రజలుల్లాసముగా స్వీకరించెడివారు. వారి సహృదయత యట్టిది. కాని నైతికాదర్శములు పూర్వమున్న పటువు తప్పెను. స్త్రీ, పురుష, విచక్షణ లేకయే స్వేచ్ఛగా మద్యమును సేవించుట నాగరక లక్షణమాయెను. పునీతమగు జీవిత నిర్వహణమునందు గౌరవ మెవ్వరికినీ లేదు. అయినను ఉత్తమ శ్రేణికిఁ జెందిన హైందవ మహిళ తన ఏకపత్నీనియమ పాలనమును విడనాడు కొనలేదు. తనగృహ రాజ్యమును విచ్ఛిన్న మొనర్పు కొనకుండ కాపాడుకొనుచునే వచ్చినదామె. రోము, ఇటలీ దేశములందు వలె, భారతదేశమున పరిస్థితులంతగా విషమింప కుండుట మహాసుకృత మేయని తలంపక తప్పదు. సనాతనాధ్యాత్మిక భావములీకాలమున కేవలము మూలమట్టముగ నశించిన వనుకొనరాదు. అవి నివురుగప్పిన నిప్పువలె జాతియంతరంగముల యందణగియున్నవి. ప్రబల సనాతన సదాచారములు సిద్ధాంతములుగా అట్లే నిలిచియున్నవి. కాళిదాసు వానిని తన కావ్యములలో కాంతా సమ్మి

తమును పండించినాడు. విపరీతమగు ప్రవృత్తి భోగానురక్తి, విపరీతమగు నివృత్తి భోగానురక్తి, ఏక కాలమున వర్ధిల్లిన కాలమది. భారతీయులు ఇంద్రియ సుఖములనుభవించుచున్నను, వానికి దాసోహమను ప్రవృత్తి కలవారు కారు. అందువలననే నివృత్తి మార్గము కడకు వారికి శరణ్యమైనది. భర్తృహరి కాలమున కీమార్పు రానే వచ్చినది. అదియట్లుండెను.

కాళిదాసు కవితా కళోత్కర్ష తదనుకూలమగు వాతావరణమున వెల్లివిరిసినది. శిల్ప, చిత్రలేఖనాది కళలు బాహ్య సౌందర్యమును బరిపోషించుచుండెను. ప్రకృతి సౌందర్యాభినందన, పర్వతారణ్యముల ప్రభావము, నదీనద కాసార ప్రశాంత వాతావరణ రామణీయకము, పశుపక్ష్యాదుల యందచందములు, సమకాలీన జీవితమునందు భాగస్వామ్యములైనవి. తత్కారణముచే, కాళిదాసు కవిత్వమునందును నివి యావహించి ద్విగుణీకృత సౌందర్య శోభనాపాదించినవి. కాళిదాసు కవిత్వము సర్వేంద్రియ సంతర్పణము గావించుచు, ఉన్నత భావశిఖరముల నధిష్ఠింపజేయుట కిది యొక ముఖ్యకారణము. భావోద్రిక్త మేధాసంజనితమైన కాళిదాసుని యేవంవిధ కవితా ప్రసూన మధువృష్టి, సహృదయ మధువ్రతములకు అమని విందాయెను. అతని కావ్యలోకము, సకల సౌందర్య వస్తు సమృద్ధమగు భూతలస్వర్గధామము. రమణీయమగు ధ్వని మార్గమున నిందు నీతిబోధ జరిగినది. మేధాశక్తి సౌందర్యావరణము నతిక్రమింపలేదు. నీరసత్వమనునది యెందును చేయి కాగడాలు వేసి వెతికినను కానరాదు. ఇంద్రియ లోలుపత్వము గాని, నైతికపతనము గాని యీ కవీశ్వరుని కావ్యములలో గోచరింపదు. ఈతని కవిత్వము కేవల ప్రబంధ కవితామార్గమున నడచి అవయవ వర్ణనమునందే సంతృప్తి జెందలేదు. తన నిర్నిద్ర కళాచణత్వముచేతను, అల్పాక్షర అనల్పార్థరచనా నైపుణ్యముచేతను, నిశిత శబ్దశక్తి నైపుణ్యముచేతను, అనుపమ కవితాశైలీమాధుర్యముచేతను, కాళిదాసు, కవితా విహాయసవీధిని ధ్రువతారయై వెలుగొందెను. ఇట్టి మహత్తర గుణోపేతుడగుటచేతనే ప్రబంధోచితమగు అవలక్షణము లాతని నాక్రమింపలేదు.

రామాయణ మహాభారతము లందలి పాత్రలవలె, కాళిదాస విరచిత కావ్యములయందలి పాత్రములు సజీవములైనవి. వాని సంభాషణములు పఠితల హృదయములను కదలింపగలవి. భారతీయులు తమ ఆధ్యాత్మిక సంపదలను గోలుపోయి, నీరసస్థితిలో పడియున్న సమయమున, కాళిదాస కవీంద్రుడు, వారి హృదయ కేదారములయందు రసధునులను బ్రవహింపజేసి దివ్యభావ సస్యములను బండించినాడు. ఆత్మకు, పరమాత్మకు, ప్రేయసీ ప్రియుల సంబంధమును వైష్ణవ పురాణములానాడు ప్రచార మొనర్చినవి. ఇట్లే శైవమతమునందు తాంత్రికవిధానము విశేషవ్యాప్తి యందుండెను. పురుష, ప్రకృతిభావము-(ఈశ్వరుడు పురుషుడనియు, శక్తి ప్రకృతియనియు) వివిధ పురాణగాథలు వ్యాప్తిలోనికి వచ్చెను. కాళిదాసు వానిని కావ్యవస్తువులు గావించుకొనెను. ఆంగ్ల వాఙ్మయమునందలి మిల్టను కవీశ్వరుని Paradise Lost, సంస్కృత వాఙ్మయమున కుమారసంభవమును బోలినది. కుమార సంభవము తత్కాలమున వెలసినట్టి యుత్కృష్ట మహాకావ్యము. ఇందలి కేంద్రభావము శివపార్వతుల వివాహము. అనగా సృష్టికి కారణభూతమగు ప్రకృతి పురుషుల కలయిక. పార్వతి శివునారాధించు వర్ణనలో ప్రకృతి, పురుషు నన్వేషించు పరమార్థము గోచరించును. కాళిదాస యుగము నందలి నాగరకతా స్వభావ ప్రభావమే యా కవీశ్వరుని ఏతన్మహాకావ్య సృష్టికి కారణభూతమైనది. ఆ యుగమునందలి కాళిదాసీయ సమకాలీన కవులకు, ఆయుగ లక్షణము లన్నియు ప్రతిబింబింపజేయు కావ్యనిర్మాణదక్షత లేదు. అట్టి దక్షతగల మహాకవి కాళిదాసుడొక్కడే. అందుచే అతడొక్కడే ఆ యుగమునకు సంపూర్ణ ప్రతినిధి. అందలి కీలకము లన్నియు గ్రహించిన వాడీతడొక్కడే! ఆ నాగరకతా స్వభావము ననుసరించి 'ఋతుసంహారము' తొలి కావ్యగానము. ఇందు ప్రౌఢమగు కవితా శిల్పమంతగా కానరాదు. 'మేఘసందేశ' మొక వర్ణనాత్మక స్మృతి కావ్యము. 'కుమార సంభవము' మతాదర్శములను వెలార్చు అలౌకిక కథా కథనము. 'రఘువంశము' ఒక ఇతిహాసము. 'శాకుంతలా' ది రూపకములు తత్కాల నాటకీయ స్వరూపములు. వాల్మీకి నైతిక యుగ నాగరకతా ప్రతినిధియైనట్లు, వ్యాసుడు మేధోజ్జ్వల నాగరక యుగ ప్రతినిధియైనట్లు, కాళిదాసు ఈ రీతిగా, బహుముఖ కావ్యరచనా కలాపముచే రసమయ నాగరకతా యుగమునకు ప్రతినిధి యనక తప్పదు.

నైతికము, బౌద్ధము (బుద్ధి సంబంధము) రసమయము నను త్రివిధ నాగరకతల సమ్యక్సమ్మేళనముగా నొక

నాల్గవ యుగము క్రమపరిణామానుసారముగ నేర్పడ వలసియుండెను. కాని యట్లు జరగలేదు. అది మనదేశ దౌర్భాగ్యము. ఈ మూడును సజీవ సమ్మేళనము నంది ఆధ్యాత్మిక స్థాయినందు కొనుటయే భారత జాతీయ స్వరూపము. తత్సంబంధమగు యుగలక్షణములను కొన్నింటిని శంకరాచార్యుని యందు గాంచవచ్చును. కాని యాతడు భారత జాతీయ జీవిత లక్షణముల నన్నింటిని పుణికిపుచ్చుకొనలేదు. అందుచే అది వేరొక రీతిని పరిణమించినది. నాల్గవ యుగ పరిణామ లక్షణముల కంతరాయ మాదియందే జరిగెను. అందుచే మూడవయుగ మనంతరము కూడ తత్సంబంధ మగు ఛాయలే మిగిలిపోయెను. శంకరుని కాలమున బోధనూపిన కతిపయ శుద్ధ చిహ్నములు భారతీయుల ఆంతరంగిక జీవనమునకుఁ గొంత ప్రాణము పోసినవి. లేనిచో పాశ్చాత్య నాగరకతల వలెనే భారతీయ నాగరకతయు కాలగర్భమున నిద్రించెడిది. నేటికిని భారతమాతలో జీవశక్తి యేమాత్రమైన నిల్చియున్నచో, ఇప్పటికిని ఆధ్యాత్మిక భావబీజము ఈ పవిత్ర భూమిని మొలకలెత్తి వృద్ధిగాంచుచున్నదన్న దానికి కారణ భూతుఁడు 'కారణ జన్ముఁడగు' శంకర భగవత్పాదుఁడే! ఇప్పటికైనను పాశ్చాత్య నాగరకతా వ్యామోహ పాశములనుండి విముక్తి జెంది భారతదేశము, విచ్ఛిన్నమైన తన సాంస్కృతిక మహాప్రస్థానమును పునః ప్రారంభించి, యుగయుగములుగా తనకు సంప్రాప్తించిన జాతీయ గురుత్వమును కాపాడుకొనుగాక!

# ఋతుసంహారము

## కావ్యసారము

ప్రపంచ వాఙ్మయము లన్నింటిలో కేవలప్రకృతి వర్ణన కావ్యములందు ఋతుసంహారము మొట్టమొదటిది. ఆంగ్లవాఙ్మయమున 18 వ శతాబ్దమందు 'థామస్' కవి యిట్టి కావ్య మొకదానిని 'ఋతువుల'ను పేర రచించెను. ఈ రెండు కావ్యముల రచనాప్రణాళికలు సమానములు. ఋతువున కొక అధ్యాయము. అందు ఒక్కొక్క ఋతువు యొక్క విశేష లక్షణములు, దృశ్యములు వర్ణింపఁబడినవి. ఇవి యన్నియు కాళిదాసు-థామస్ కవులలో గల సమానాంశములే.

కాని కవుల ప్రతిభలో హస్తిమశకాంతరము గలదు. కాళిదాసు విశ్వకవీశ్వరులలో నగ్రగణ్యుఁడు. థామస్ 18 వ శతకపు టాంగ్ల పద్య నిర్మాతలలో నొకఁడు. ఈ తారతమ్య మాయిరువురు కవుల భావనలో కానిపించును. కవిత్వ తత్త్వమున నిరువురి కేమాత్రము పోలికలే లేవు. నీరసము, కృత్రిమమగు కవితాయుగమునకు జెందినవాఁడు 'థామస్'. వర్ణనాత్మక కవిత్వతత్త్వమే యాతనికి బోధపడలేదు. వస్తువుపై నాతని దృష్టి నిలుపునగాని యాతనికి గోచరించునది దాని బాహ్య స్వరూపమే. అతఁడు కళాసృష్టి గావింపబోయి ఛాయాచిత్రమును దీసి సిద్ధపరచెను. ప్రకృతి, కవిత్వమున కొక యావరణమో, జీవితమునకొక యలంకారమో, తత్త్వమునకు ప్రాణప్రదాయినియో, యగును కాని అన్యము కాదు. 'వర్డ్స్ వర్తు' కవీశ్వరుఁడు ప్రకృతిని తన జీవిత భాగస్వామిని గావించుకొని, కవిత్వమల్లి విశ్వ చైతన్యమును గలిగించెను. 'షేక్స్పియరు' కవి, ప్రకృతిని జీవిత వివిధ వాద్య సమ్మేళనములలో నొక వాద్యము గావించుకొనియెను. ఆధునిక కవులు ప్రకృతిని విశ్వ చిత్రమునకొక భూషణముగా వర్ణించిరి. అంతేగాని ప్రకృతి కొక స్వతంత్రస్థానము ప్రపంచమునందుగాని, కవి సృష్టియందు గాని లేదు. మానవుని జీవము, మనస్సు మాత్రమే. ఇంద్రియములు కేవలము పకరణములు మాత్రమే. బాహ్యేతర జీవితమంతయు అతని యాంతరంగిక సత్త్వమునను సరించి యుండవలయును. ఆంతరంగిక జీవితానుభవ పుష్టికొరకు ఇంద్రియజ్ఞానము తోడ్పడవలయును. కాళిదాసు తన దివ్యకళానుభూతితోడను, అర్ద్రహృదయ సంపదతోడను, వినిర్మల సత్యకవితాదృక్పథము తోడను, ప్రకృతికి దివ్యత్వమాపాదించెను. 'షేక్స్పియరు' వలె నీతఁడు ప్రకృతికొక ఆధ్యాత్మిక భావమును గల్గింపక, భావావేశపూరితుడై తన నిశిత మేధాశక్తితో ప్రకృతిని పరీక్షించెను. 'వాల్మీకి' మహర్షి కున్నంత అద్భుతావహమగు నాంతర దృష్టి కాళిదాసునకు లేదు. 'వర్డ్స్ వర్త్' వలె ప్రకృతి నీతఁడు కేవల మాతృభావములో నారాధింపలేదు. కాళిదాసు దృష్టి ప్రకృతి లోనికి జొరఁబడును. అంతేకాని దానిని చుట్టి ముట్టి చూపదు. అతఁడు ప్రకృతి కంటె కూడ జీవితమునకే యధిక ప్రాముఖ్య మొసగును. ప్రతివస్తువు నాతఁడు జీవితముతో సమన్వయించుకొనును.

ఋతుసంహారమున మొదటి సర్గము గ్రీష్మ ఋతువు వర్ణనము. ఈ ఋతువునందలి జంతువులు, మానవులు, వృక్షములు, మొలకలు మున్నగువాని సూక్ష్మ జీవిత విధానముల నీకవీశ్వరుడు వర్ణించును. ఇందలి ప్రతి శ్లోకము కాళిదాసు వక్ష్యమాణ కవికులగురుత్వను వంశమును నిరూపించుచున్నది. ఇందలి అరుసర్గము లందును వైవిధ్యమును ప్రకటింపగల నేర్పరితనము, కవితానుభవము, భావనాశక్తి, మున్నగు సద్గుణములు యువకాళిదాసునకు సమకూడలేదు. పొంగి పొరలు నిండుజవ్వనమాటచే నింద్రియోద్రేకముల నతిక్రమించు శక్తి యాతని కప్పటి కలవడలేదు. అందుచే అతడు కొన్ని ప్రధాన భావములను ఆమూలమాడముగానిందు పొందు పరుపలేక, ఒకే యొక భావనా రీతిని ప్రపంచించి కావ్యీకరించెను. కాని తద్విధానమున నొక్క దోషమేనియు వెతికి పట్టజాలము. "కీట్సు" తన తొలికావ్యములలో చూపిన ఇంద్రియ దౌర్బల్య స్ఫోరకములు వర్ణనలవంటి వర్ణనలు, కాళిదాసు కావ్యమున మృగ్యములు. ఎంతటి భోగానుభవాసక్తి యున్నను కాళిదాసు కాలమందలి ప్రజానీకము పౌరు షోపేతమైనది, చేవ గోల్పోనిది. తత్కారణమున కాళిదాసు కవనమునందును ఆ పురుషలక్షణములు సర్వదా సుస్పష్టముగ వీక్షింపనగును. అతడు ప్రకృతికి దాసుడై వర్ణనలు చేయడు. ప్రకృతినే తనకు లొంగ తీసికొని యథేచ్ఛగా రసావేశముతో వర్ణించెను. ఇట్టి శక్తి సంస్కృత కవిత్వము నందంతట గోచరింపక పోదు. కాని కాళిదాసునందాశక్తి ఆద్యంతములందును తిరుగకుండ ననుభవింప నగును. ఆంగ్ల కవులకీ పౌరుష శక్తిలేదు.

అటు సర్గములందును క్రమముగా గ్రీష్మ, వర్షా, శరత్, శిశిర, హేమంత, వసంత ఋతువులు వర్ణింప బడినవి. కృత్యారంభము నద్భుతముగా నిర్వహించు టలో కాళిదాసు నెఱజాణ. ఈతడు కవితాసమ్రాట్టు కాగల చిహ్నము లీలఘుకావ్యముననే రూపొందినవి. కవితోత్సాహ మెక్కడపరి పెల్లుబికినది. గ్రీష్మర్తు వర్ణనలో నాతని యత్యద్భుత భావనాపటిమ, నిశిత వస్తుపరిశీలనము, సుస్పష్ట భావప్రకటన, అల్పాక్షరముల ననల్పార్థరచన, కాళిదాసు కవితా వైఖరిదైనవి. అందుచేత ఇతర సర్గలకంటె నీ ప్రథమసర్గము ప్రాముఖ్యము వహించును. కవి తన కవితాశక్తి నంతయు నీ సర్గసృష్టికే ధారవోసెనా! యనిపించును. తరువాతి సర్గలలో కవితాపటుత్వము క్రమ క్రమముగా సన్నగిల్లినది. వర్షర్తు వర్ణనములలోని కొన్ని భావచిత్రము లత్యద్భుత ములు. అయినను కవితాశక్తి సడలుచున్నట్లు పరిశీలన ముపై కనిపెట్టవచ్చును. కాని పదమైత్రి శ్రుతిహితమై గంభీరముగనుండును. శరదృతువర్ణనము బాగుగా బిగువు తప్పినది. కాని యిందలి శైలీమాధుర్యము, భావ నిర్వహణ కొంత తృప్తికల్గించును. తరువాతి రెండు సర్గలు నిరాశాజనకములు. వర్ణనలు—ఎక్కడో కొన్నిపట్ల తప్ప—పూర్తిగా పటువు తప్పినవి-వర్ణనలు కేవలము సాంప్రదాయికముగా మారినవి. కాళిదాసు కవితా ప్రతిభగా చెప్పుకోతగిన దిందేమాత్రము లేదు. వీని నిక్కడ వదలి, వసంత ఋతువునకు వత్తము. ఇందును సహృదయ పాఠకునకు తగినంత రసలబ్ధిలేదు. న్యాయముగా జూచిన ఈ వసంతఋతువర్ణన మీ కావ్యమునకు తలమానికము కావలసినది. శాపపతితుడు శాపానుభవానంతరము, తన పూర్వశక్తి నార్జించు కొనుటకుఁ జేయు ప్రయత్నము వంటి ప్రయత్నమిందు గోచరించును. శైలి కొంతవఱకు పొంకముగానున్నను, ఆవేశపూరితముగ కవితాత్మ స్ఫురింపదు. మొత్తముపై భారతీయుల ఋతువుల రాణియగు వసంతఋతువర్ణన శోభ, కవిత్వములో నాశింప తగినంతగా నావహింపక పోవుట దురదృష్టమనుకొనక తప్పదు. ఈ కొఱతను కాళిదాసు కూడ గమనించియేయుండును. అందు చేతనే కుమారసంభవ మహాకావ్యమున, కథాకథన వైభవముతో ప్రకృతి గల్పికొన్న యీ ఋతువులరాణి రామణీయకముచే రసికలోకము ద్విగుణీకృతముగ రంజిల్లునట్లు గావించి నాడీ కవి చక్రవర్తి.

## కవితావైశిష్ట్యము

ఎట్లైనను 'ఋతుసంహార' మొక ఆహ్లాదకరమైన కావ్యము. కాళిదాసు, తన కవితాప్రతిభ నీదివ్యకావ్య కేదారమున బీజావాపము గావించెను. కాళిదాసీయ కవితాశిల్ప కళాచ్ఛాయలు ఈ లఘుకావ్యమున సుస్పష్ట ముగ స్ఫురించును. చక్కని యుపమాలంకారము లిందును నిక్షిప్తములు. నిశితవర్ణనాచణత్వము, సమయోచితసాభి ప్రాయవిశేషణప్రయోగవైచిత్రి యిందనేకరీతుల గానవగును. ఇట్టి యీ ప్రథమ ప్రయత్నముగూడ

'ఉపమా కాళిదాసస్య' అనునూక్తిని సార్థకము చేయుచున్నది. ఈ ప్రారంభ కావ్యమునందును కాళిదాసీయ కవితాముద్ర సుస్పష్టముగనున్నది. గ్రీష్మకాల వినీల విహాయసము, సువిశాలభూభాగమును బోలినది. కలకలలాడు మందహాసవదనలగు కన్నెపడుచులు, చంద్రహారాలంకృతలగు సంధ్యాకాంతలను దలపించుచుండిరి. దూరారణ్యములయందలి యగ్నికాంతులు, ధాతుద్రవబిందువులా! యనిపించుచుండెను. అప్పుడే మొలిచిన పసనైన పచ్చికబీడులు, పచ్చలుబొదిగిన కంబళులవలెనుండెను. దరీవృక్షములను గూలద్రోయు నదీసుందరులు, తమ్మాశ్రయించిన విటులను సర్వనాశ మొనర్చెడి దుష్టవారకాంతలట్లుండెను. ఈ మున్నగు వర్ణనలన్నింటిలోను, కాళిదాసు ఉపమాశక్తి సుస్పష్టము. ఇంకను నిట్టి వనేకములు ఉదాహరింపనగును. సంధ్యాకాలమందలి చంద్రబింబము, సిగ్గుచే తెల్లబాఱిన వనితాముఖమండలమట్లుండెను. దివిటీలు వెలుగొందుచుండగా వేంచేయు ప్రభువురీతిగా వర్షమేతెంచెను. ప్రావృట్పయోదానీకము మదోత్కట ద్విరదసంఘమువలెనుండెను. మెఱపులు వాహినీ సదృశముగను, ఉఱుములు జయభేరీనినాదముగను నుండెను. మెఱపునారిగాగల యింద్రధనస్సును బూని మేఘుఁడు, వర్షమును వేటాడుచుండెను. ఈరీతిని వర్ణింపగల సామర్థ్యమెక్కడ కాళిదాసునందే చలామణి యగును. ఇందక్కడక్కడ అధికపదప్రయోగము పొడగట్టును. అక్కడక్కడ విపరీతపు టూహలును గలవు. అయినను కాళిదాసు కవితాస్వరూపము, కళాగోపనమునకిందు విశేషముగ సాక్షాత్కారమౌను. విపరీతపుటూహల నెన్నింటినో పరిమిత పదప్రయోగమునఁ బ్రకటించు కళాకోవిదుఁడు కాళిదాసు. ఇందన్నిటికన్న విచిత్రమైన భావన—ప్రకృతిని పడతితో నుపమించుట.

సుస్పష్టరూపచిత్రణాచణత్వముచేతనే యీలఘుకావ్యమునకు అలఘుగౌరవము లభించినది. అట్టిలక్ష్యముతోడనే ఈ కావ్యము రచింపబడినది. ఈ కావ్యము పఠించుచున్నంతకాలము ఋతువులు సజీవాకృతితో మనకు సాక్షాత్కరించును. గ్రీష్మర్తువులోని అతిప్రౌద్ధత్యము, సూర్యకిరణములు త్రేతాగ్నులవలె చెలరేగుట, గాలిదుమారములు సుడులు తిరిగి భూమిని తుడిచివేయుట మున్నగు వర్ణనలను మఱచిపోజాలము. తన దుందుడుకుతనము మాని, కోర్కను మరచి, అదుగో మృగరాజు!! నాలుక బయటికి వ్రేలవైచి, విసుగుతో నేమియుతోచక, జూలుకదలించుచు, ఒడలు విరుచుచున్నాఁడు!! నాగభామ శిరము వంచి, రోజుచు, మండుచున్న యిసుకమార్గమున గమించుటకు మిక్కిలి ప్రయాసపడుచున్నది. అడవిపందులు, ఎండుబురదలో తమ ముట్టెలతో భూమిని కుళ్ళగించుచు, శీతల భూగర్భమున తలదాచుకొనుటకుఁ బ్రయత్నించుచున్నవి. అంబోతులు, ఖిన్నవదనములతో, పిపాసాపీడితములై, గంగువెఱ్ఱులెత్తి యడవినంతయుఁ గ్రుమ్మరుచున్నవి. అడవులు ఎండిపోయి కళావిహీనములైనవి. ఒక ప్రక్కనుండి యవి దహించుకొనిపోవుచున్నవి. ఇంతలో తొలకరివర్షము పడినది. ధూళిధూసరితమై, వర్షము, పర్వత సానువుల నుండి త్రాచుబాముల గమనమువలె జరజర ప్రవహించుచున్నవి. జలధారలతోడను, జలధర చుంబితోత్తుంగ శిఖరములతోడను, పరిఫుల్ల కలాపకలాపి జాల సంశోభిత సానువులతోడను నగరాజులు నేత్రపర్వమొనర్చుచున్నవి. దిక్తటములందు, నీలాంభోజదళముల మాడ్కి మేఘశిలాకములు, మంద మారుతముల పైకెగ బ్రాకుచున్నవి. మకరందమునకై తుమ్మెదలు మూగుచుండ, కోవిదారవృక్షములు, వాయుసంచలిత పత్రహస్తములతో వానిని తోలించుకొనుచు, ధీరోదాత్త నాయకులవలె నిలువఁబడినవి. బాతులు ప్రవాహమున కెదురీదుచున్నవి. ఆకాశమునుండి వెన్నెలవాకలు వల్లులవలె ప్రవహించుచున్నవి. కంకులీనిన వరిచేలు, ప్రక్కనున్న కలువకన్నెలతోఁ గలసి చిఱుగాలికి నర్తించుచున్నవి. ఈ మున్నగు ననేకరమణీయములగు వర్ణనలు, చిత్రకారులు చిత్రించినట్లే కనులకు కల్యాణమొనగూర్చును. వాడిదేలిన సంక్షిప్త పదజాలముతో నిట్టి చిత్రముల చిత్రింపగల దక్షతకల కవీశ్వరుడు సంస్కృత వాఙ్మయమున కాళిదాసొక్కడే! ఇతరకవులు, బాణభట్ట, భవభూత్యాదులు, వర్ణనలను అధికపదజాలముతో ముంచెత్తెదరు. అవి చిత్రకారుఁడు తన చిత్రముల కెక్కువగా రంగులు పులిమినట్లుండును. ఈకవుల భావచిత్రములు సజీవాకృతులతో స్వతంత్రముగ నిలువఁజాలవు.

ఇట్టి భావచిత్రణశిల్పము 'రఘువంశము'న సుజ్జ్వలముగా కానవగును. భావము–భాష–ఛందస్సు అను మూడును అందు ముచ్చటగా ముప్పిరిగొన్నవి. అట్టి సమ్మేళనము ఈ ప్రథమకావ్యమున నంతగా కానరాకున్నను, తచ్ఛాయలు సమగ్రముగ కలవు. చూడుడు:-

శ్లో. జ్వలతి పవనవృద్ధః పర్వతానాం దరీషు;
స్ఫుటతి పటునినాదైః శుష్కవంశస్థలీషు;

ప్రసరతి తృణమధ్యే, లబ్ధవృద్ధిః క్షణేన,
గ్లపయతి మృగవర్గం ప్రాంతలగ్నో దవాగ్నిః

గాలిచే వృద్ధిపొందిన దావాగ్ని, పర్వత సానువుల యందు ప్రజ్వరిల్లుచుండెను. ఎండిన వెదురుపొదలలో నది వ్యాపించి, ఫెళఫెళార్భటుల గావించుచుండెను. తృణములో నభివృద్ధిగాంచి, గడ్డిబీడులలోని కది ప్రసరించుచుండెను. ఇట్లు పర్వతచరియలయందు దుద్భవించిన యీ దావాగ్ని క్రూరమృగములను సైతము బాధించుచుండెను.

ఈ శ్లోకమున కాళిదాసీయ కవితా మరందధార యెట్లు జాలువారుచున్నదో పరికింపుడు:—

శ్లో. పుంస్కోకిలః చూతరసాసవేన
మత్తః ప్రియాం చుంబతి రాగహృష్టః
ముంచన్ ద్విరేఫోఽప్యయ మమ్బుజస్థం
ప్రియం ప్రియాయాః ప్రకరోతి చాటుః॥

చూతరసాసవము నాస్వాదించి పుంస్కోకిల, అనురాగ హృష్టమై మత్తిలి, ప్రియురాలిని ముద్దిడుకొనుచుండెను. అంబుజమునందున్న ద్విరేఫము, తన మధుర మర్మర ధ్వనులతో ప్రియురాలికి ప్రియము నొనగూర్చుచు, రహస్యోక్తులతో నలరించుచుండెను.

ఇట్లే మరికొన్ని నిశితభావోజ్జ్వలమైన శ్లోకములు కాళిదాసు కవిత్వమునకు మచ్చుతునక లనదగును. పరికింపుడు :—

శ్లో. ఆకంపయన్ కుసుమితాః సహకారశాఖా
విస్తారయన్ పరభృతస్య వచాంసి దిక్షు
వాయుర్వివాతి హృదయాని హరన్నరాణామ్
నీహారపాత విగమాత్ సుభగో వసంతే

పుష్పిత సహకారశాఖలను గంపింపజేయుచు, దిక్కులందు కోకిల కుహూకుహూ రావములను విస్తరింప జేయుచు, నరులహృదయముల నాకర్షించుచు, తుషార బిందువు లదృశ్యమగుటచే సుభగమైన మారుతము, వసంతఋతువునందు వీచుచుండెను.

కాళిదాసు ఇతరకావ్యములలోని తేలిక శ్లోకములను గైకొని పఠించిన, అవి యీ ఋతుసంహార శ్లోకములకు సన్నిహితముగా నున్నట్లు తోపక మానదు. ఈ శ్లోకమును దిలకించునది:—

శ్లో.. ఇదమసులభవస్తు ప్రార్థనా దుర్నివారమ్
ప్రథమమపి మనో మే పంచబాణః క్షిణోతి
కిముత ? మలయ వాతోన్మీలితా పాండుపత్ర
ముపవన సహకారై ర్దర్శితే ష్వంకురేషు

అసులభమైనది, ఎంత ప్రార్థించినను నివారించుటకు సాధ్యము కానిదియునైన నా మనస్సును మన్మథుడు ముందుగా బాధించుచుండెను. అట్టియెడ, మలయ మారుతముచే వికసింపజేయబడినట్టియు, అంటిట పచ్చనైన వర్ణముకలిగిన యుద్యానవనము, తీయమామిడి చెట్లు, అంకురములు కల్గినవను చుండగా వేరుగా చెప్పనేల ?

ఇట్టి రచనానైపుణ్యము, మార్దవమే, పదసంయోజనము, లలిత శబ్దాలంకార సంకలితత్వము, శబ్దసమతా ప్రతిపాదనములే, ఉత్తరోత్తర కావ్యములందును మరింత లాఘవముతో ననుసంధానితములైనవి. కాని భావ మాత్ర మింతకంటె ననేకరీతుల నిగ్గుదేలి, చక్కదన మొలికినది. సంస్కృతమున మరి యేయితర కవియందును నిట్టి శైలీపరిణామము కానరాదు. భవభూతి కవితారీతి సాహసోపేతమైనది; శక్తిమంతమైనది; బాహిరమైనది జయదేవునిగీతము, లోకమోహనమైన స్వర సమ్మేళనా విన్యాసము; ఛేకానుప్రాస, వృత్త్యనుప్రాసాలంకారములు-వివిధ వాద్యముల కలయికయే. కాళిదాసు కవితాశైలి ఈ గుణజాలమంతయు కలది. తదతీతమైనది. ఋతుసంహారము కాళిదాస కృతము కాదని వాదించువారికి ఇందలి ప్రతి పద్యము 'నా' వని నిరూపింపగలదు.

ఋతుసంహారము కేవలము దోషరహితకావ్య మనలేము. తులనాత్మకముగ విమర్శచే నీకావ్యము నందు కొన్ని దోషములు పొడగట్టును. కాళిదాసు ఇతర కావ్యములయందలి శిల్పసౌకుమార్య మీ కావ్యమునందు కాన్పించదు. కావ్య ప్రణాళిక ప్రౌఢము కాదు. అయినను నీలఘుకావ్యావతరణముచే సమకాలీన కవితా భావాంబరమునందు, నూత్న భానూదయమైనది. ఇందలి పద్య నిర్మాణదక్షత, ఇందలి కవితాశక్తి, భావోజ్జ్వలత, తత్త్వమాధుర్యము, కావ్యశోభ, మున్నగు సద్గుణము లీకావ్యమునకు సంస్కృత సారస్వతమున నచంచలస్థాన మేర్పరచినవి. ఈ కావ్య పఠనముచే సర్వేంద్రియ సంతృప్తియు కలుగును. రసిక నాగరక యుగప్రవక్తయగు కాళిదాసకవిసార్వభౌముని మధురహస్త స్పర్శసుఖానుభూతి ఈ కావ్యము సర్వత్ర కల్గును. ప్రకృతిని జీవితానుభవముతో సమన్వయించుచు, సౌందర్య చికీర్షులైన మానవుల జీవితాంశములను సమీక్షించి రసానందరూపమున ప్రసాదించుటే, కాళిదాసు తొలి కావ్యము యొక్కయు, మలికావ్యముయొక్కయు పరమ లక్ష్యము. తొలుత నాతడు బాహ్యప్రకృతినే యాలంబనము గావించుకొనెను. శారీరక సౌందర్యమునే సమీక్షించెను. కవి సాగింపదలచిన సుదీర్ఘ కవితాక్షేత్ర యాత్రలో నిది ప్రథమదశ. కుమార సంభవమునందు కవీంద్రుడీ దశ నతిక్రమించెను. అందలి పాత్రలు దేవతలు. అట్టి దేవతాస్థానమునందు కవియు నధిరోహించెను. అందలి సౌందర్యసమీక్ష అతిలోకమైనది. అట్టి స్థానము మరియొక కవి యాక్రమింప జాలనిది.

—సశేషం

# ప్రతీపగమనము

శ్రీ మల్లంపల్లి శరభయ్య

పలుకులఁ దలంపులను వడవడిని, నాకు
నభిముఖము కాని యీ నా ప్రయాణమందు
యంత్రశిక్షాఽనిరుద్ధ దుష్టాశ్వలీల
నీడ్చుచున్నవి నన్ను రేయింబవళ్లు

నిర్జితస్ఫూర్జథూద్దామనేమి మృత్యు
ఘోషమున గుండియల్ కలగుండువడ—న
తోన్నతాధ్వమ్ములందు—వైద్యుతజవాతి—
నీయమానమ్ము రథ మస్మదీయతనువు!

జలధి పారమ్మునకొ! నభశ్చరమసీమ
కో! నిరంతమరుస్థలికో! మదీయ
దేహరథ మీడ్చుచుండె, రాత్రిం దివములు
భయద రయధోరణీ పరస్పర జిగీష

అనధిగతగమ్య మీ నా ప్రయాణమందు
కలదు పర్యుత్సుకత కొంత, కలదు దుఃఖ—
జడతయు—నతితరమ్య విస్తారవిషయ
కల్పితక్షణిక స్నేహకాతరమున

స్ఫుటితాధ్వ మ్మయంత్రితాశ్వములు—విప్ర—
తీపగమనమ్ము—నరద మేతీరమునకుఁ
దేర్చనున్నదొ! యున్న యుద్వేగమేల?
అది యెచటనిల్చె, శాంతిని శాంతమచట !

# రెక్క తెగిన పక్షి

## శ్రీ అంగర సూర్యారావు

** పాత్రలు—రమణయ్య, అధికారి, రామం, కొండయ్య, నీలకంఠం, చిట్టి, లీలావతి.

### రంగము 1

(స్థలం:—ఆఫీసులోని ఒక గది.
సమయం:—పగలు 11 గంటలు.

గదిలో వరుసగా మూడు టేబిలులు, మూడుకుర్చీలు వున్నాయి. టేబిల్సు మీద ఆఫీసు రికార్డులు పేర్చి వున్నాయి. కొండయ్య, రామం చెరో సీటులో కూర్చుని పని చేస్తు న్నారు. మూడవ కుర్చీ ఖాళీగా వుంది. వారి వెనుక గోడకు చేర్చి పెద్ద రాక్ (Rack) ఒకటి వుంది. దానినిండా రిజిస్టర్లు, రికార్డులు కని పిస్తున్నాయి. కొండయ్య వయస్సు 50 సంవత్సరాలు. తల నెరిసింది. ముఖంమీద ఒకమాట, చాటున ఒక మాట అనే స్వభావం. పైకి వినిపిం చేలా ఎకౌంట్సు చూస్తున్నాడు. రామం తల వంచుకొని పని చేస్తు న్నాడు. వయస్సు 24 సంవత్స రాలు.)

కొండ : (అంకెలు పెన్సిలుతో కూడుతూ) అయిదు వాలుగు తొమ్మిది; తొమ్మిది ఎనిమిది పది హేడు. మొత్తం తొమ్మిదివేల ఏడువందల పదిహేడు. జేబులో పైసా లేకపోయినా రిజిస్టర్ల నిండా డబ్బే!

రామం : (తల పైకెత్తి) చూడండి కొండయ్యగారూ! యీ ఎకౌంటులో రెండు అణాలు తేడా వస్తోంది.

కొండ : (భయంతో నోరు తెరిచి) కొంప మునిగావ్. తేడా చూస్తే రెండు అణాలే కానీ—అది సరిపెట్టే అందుకు రెండు ఘంటలు శ్రమ పడాలి. అందుకే ఎకౌంట్స్ సెక్షనులో తల నెరిసినవాళ్లు వుండాలని నేను మొత్తు కుంటాను.

[ఎడమ వైపునుంచి అధికారి వస్తాడు. వయస్సు 40 సంవత్సరాలు. ముఖంలో ఎన్నడూ చిరునవ్వు కనిపించదు. తన క్రింద పనిచేస్తున్న వాళ్ళ విషయంలో దయాదాక్షి ణ్యాలు కనబరచదు. అధికారిని చూడగానే వినయంతో కొండయ్య, రామం లేచి నిలు చుంటారు.)

అధికారి: (గదిలో అడుగు పెడుతూ) మిస్టర్ కొండ య్యా! యు హేవ్ నాట్ ఫినిష్ దట్ వర్క్. ఈజ్ ఇట్ నాట్?

కొండ : (వినయంతో) చిత్తం! రేపు మధ్యాహ్నానికి పూర్తి చేస్తాను సార్.

అధి : (కోపంతో) అదేమీ కుదరదు. ఈ సాయం త్రము లోగా ఎకౌంట్ పూర్తిచేసి తీరాలి. అది పూర్తిఅయ్యేవరకూ నువ్వు ఆఫీసునుంచి అడుగు అవతలకు వెయ్యడానికి వీల్లేదు. తెలిసిందా?

కొండ : చిత్తం! చిత్తం! ప్రయత్నిస్తాను.

అధి : ప్రయత్నిస్తానంటే కుదరదు. రాత్రి తొమ్మిది అయ్యేసరికి ఎకౌంటు నా టేబిలుమీద వుండాలి.

కొండ : చిత్తం! తమ రేం చెయ్యమంటే అదే చేస్తానండి. (అధికారి లోనికి వెళ్ళిపోతాడు. కొండయ్య అధికారి పోతున్నవైపు చూస్తూ కోపంతో) కొరివిదెయ్యంలా ముఖం వీడూను! చంపేస్తున్నాడు. మూడు రోజులకు గాని పూర్తిగాని ఎకౌంటు రాత్రికి అయిపోవాలంటే నాతరమా?

(ఒక ఫైలు చేతితో పట్టుకొని తిరిగి అధికారి ప్రవేశిస్తాడు.)

అధి : (కోపంతో ఫైలు చూపిస్తూ) యీ కాగితం మీద ఏక్షన్ తీసుకోవడానికి నీకు పది రోజులు పట్టిందా?

కొండ : (వినయంతో) పని బాగా పెరగడంవల్ల కొంచెము ఆలస్యం అయింది సార్!

అధి : (కోపంతో) నో! నో! ఐ వాంట్ యువర్ ఎక్స్‌ప్లనేషన్!

కొండ : ఏదో పొరబాటు అయిపోయింది. ఈ సారికి క్షమించండి సార్!

అధి : చూస్తూ వూరుకుంటే యీ పొరబాట్లు అలవాట్లుగా మారతాయి. జాగ్రత్త! ఇటువంటి పొరబాటు మరోకసారి జరిగితే వూరుకునేది లేదు.

కొండ : (ప్రసన్నవదనంతో) చిత్తం! పైకి ఎంత కోపంగా వున్నా మీ హృదయం చాలా మంచిది. సార్. (అధికారి సగర్వంగా లోనికి వెళ్ళిపోతాడు. అతను పోతున్నవైపు కోపముగా చూస్తూ) నా పాతికేళ్ళ సర్వీసులోను యింతటి చచ్చుఘటాన్ని నేనెన్నడూ చూడలేదు. అచ్చు యమకింకరుడే భూమిమీద అవతరించాడు.

రామం : ఆయనదగ్గర మీరు ఒక మాటకూడా ఎదురు చెప్పరేం?

కొండ : నీకు యీ ఆఫీసర్ల తత్వం తెలియదురా అబ్బాయ్. చాటున ఎన్ని అనుకున్నా ఫర్వాలేదు. ముఖంమీద మాత్రం ఒకమాట అనేశావో యింక నీమీద పగబట్టాడన్న మాటే! పగ అంటే పగా! త్రాచుపగ!

రామం : అవును. ఆ మాటా నిజమే. లేకపోతే రమణయ్యగారి మీద అంతకోపం ఎందుకూ? వున్నమాట ముఖంమీద అంటారనే కాదూ?

కొండ : ఆ రమణయ్య మాత్రం తక్కువ మనిషటరా నాయనా! — కానియ్ — ముందు పని కానియ్ — తరవాత మాటాడుకోవచ్చు. (ఎకౌంట్ చూస్తూ) తొమ్మిది నాలుగు పన్నెండూ మూడూ పదిహేను!—(ఆశ్చర్యముతో) హరి దౌర్భాగ్యుడు! యీ నీలకంఠం గాడు యీ నెలలో ఐదువందల పదిహేను రూపాయల మొత్తం తీసుకుంటున్నాడు. కప్పు కాఫీనీళ్ళు పోయించేందుకు 'హలో లక్ష్మణా' అని ఏడుస్తాడు.

(యీ సమయంలో నీలకంఠం కుడివైపు నుంచి ప్రవేశిస్తాడు. వయస్సు సుమారు 40 సంవత్సరాలు.)

కొండ : (నీలకంఠాన్ని చూడగానే ఆనందాన్ని ప్రకటిస్తూ) రండి! నీలకంఠంగారూ! దయచేయండి. యీ మధ్య బొత్తిగా తమ దర్శనమే లేదు.

నీల : (ముక్తసరిగా) తీరిక లేదండీ. (ఖాళీ సీటు కేసి చూస్తూ) రమణయ్యగారు యింకా రాలేదా?

కొండ : లేదండి. బహుశా యివేళ రాడు. ఆ పనేమిటో నాకు చెప్పండి. నిముషాలమీద చేస్తాను. తమ అనుగ్రహం వుండాలి కాని, మీకు మా ఆఫీసులో అవనిపని అంటూ ఏం వుందండి?

నీల : లేదులెండి. నాకు ఆయనతోనే పని వుంది. సరే. లోపల దొరగారు వున్నారా?

రామం : వున్నారండి.

(నీలకంఠం ఎడమవైపు నిష్క్రమిస్తాడు.)

కొండ : (నీలకంఠం వెడుతున్నవైపు చూస్తూ) మేక కసాయివాడినే నమ్ముతుంది. వీడికి ఆ రమణయ్యే తగిన మనిషి. వాడైతే పని అయినా కాకపోయినా సరే, పాతికో నిముషాలమీద లాగేస్తాడు.

రామం : రమణయ్యగారు అంత చెడ్డమనిషా?

కొండ : వాడికి ఒక నీతి, నియమం అంటూ లేదు. డబ్బుకోసం అడ్డమైన గడ్డి కరుస్తాడు. మన ఆఫీసు మొత్తంమీద రమణయ్యవంటి దగుల్బాజీ మరొకడు లేడంటే నమ్ము.

రామం : (ఆశ్చర్యంతో) అలాగా! పైకి మంచిగానే కనిపిస్తారండి.

కొండ : అబ్బో! వాడు దేవాంతకుడు. వాడిగురించి నీకింకా తెలియదులే. ఆఫీసులో అడుగు పెట్టిన ప్రతిమనిషిని యిట్టే పట్టేస్తాడు. వాడిదగ్గర ఐదో, పదో కొట్టేస్తాడు. వాడి తంటాలు వాడు పడితే సంతోషిద్దుం. (రహస్యంగా) మనకు రావలిసిన సొమ్ముకూడా వాడే కొట్టేస్తూ వుంటాడు.

రామం : ప్రతి చిన్న విషయానికి చెయ్యి చాపుతున్నందువల్లనే మన ఆఫీసుమీద ఎవరికీ గౌరవం లేదండి.

కొండ : అందులోను రమణయ్య అంతటి కక్కుర్తి మనిషిని నేనెక్కడా చూడలేదు. యింతకూ ఎవడిఖర్మ వాడు అనుభవిస్తాడులే. అందరి సొమ్ము లాక్కొని వాడేంబాగుపడి ఏడిచాడు? వాడిమీద మూడు కేసులు యిప్పుడు 'పెండింగు'లో వున్నాయి.

రామం : నాకు వివరాలు తెలియవుగాని నేను కూడా అలాగే విన్నానండి.

కొండ : అవి ఎటువంటి భాగోతాలో తెలుసా? వింటే ఆశ్చర్యపోతావు. (వేళ్ళు లెక్కపెడుతూ) ఒకటి మాల్‌ప్రాక్టీస్, రెండు ఫ్రాడ్, మూడు కరప్షన్.

(ఎడమవైపునుంచి అధికారి వస్తాడు. కొండయ్య, రామం లేచి నిలబడతారు.)

అధి : రమణయ్య యింకా రాలేదా?

కొండ : లేదు సార్.

రామం : ఒక గంట లేటుగా రావడానికి పర్మిషన్ పెట్టేరండి. (తన టేబిలు మీద వున్న కాగితం తెచ్చి అధికారికి యిస్తాడు.)

అధి : (కోపంతో) ఆఫీసులో పని పేరుకుపోతూ వుంటే సెలవులూ, లేట్ పర్మిషన్లూ! పర్మిషన్ రిఫ్యూజ్డు! (అని ఆ కాగితంమీద రాసి కొండయ్య టేబిలుమీద పారేస్తాడు.)

కొండ . అవును సార్! ఆఫీసులో పని వున్నప్పుడు రాకపోతే ఎలా? రమణయ్యకు రెస్పాన్సిబిలిటీ తెలియదు సార్.

అధి : (కోపంతో) రమణయ్యకే కాదు. యీ ఆఫీసులో ఒక గుమస్తాకి రెస్పాన్సిబులిటీ తెలియదు. (రామంతో) నీకు అప్లికేషన్ ఎప్పుడు యిచ్చాడు?

రామం : ఉదయం యిచ్చారు సార్.

అధి : ఎక్కడ కనిపించాడు?

రామం : మా వీధిలోనే ఆయన వుంటున్నారండి. ఆయన కొడుకుకు చాలా ప్రమాదంగా వుందండి. నేను చూడడానికి వెడితే ఆయన యీ అప్లికేషన్ యిచ్చారండి.

అధి : అంతా నాటకం! ఒక రోజు భార్యకు జబ్బు. ఒకరోజు కొడుకుకు జబ్బు. మరొక రోజు తనకే జబ్బు. యీపని అంతా ఎవరు చేస్తారిక్కడ!

రామం : (భయభక్తులతో) నిజమే సార్! నేను చూశాను. వాళ్ళ అబ్బాయికి చాలా సీరియస్ గా వుంది.

అధి : మీ కుటుంబ విషయాలు నాకు అవసరం లేదు. నాకు కావలసింది పని! రేపుప్రొద్దున్న మనపై అధికారులు యీ రిటర్న్సు యింత అలస్యమయ్యిందేమని ఎక్స్‌ప్లనేషన్ అడిగితే ఏం జవాబు చెప్పమంటావ్? రమణయ్య కొడుకుకు జబ్బు చేసింది కనక పంపలేదని రాయమంటావా? (యిద్దరూ జవాబు చెప్పరు.) ప్యూన్ కనిపించడేం?

కొండ : వాడికి తమరు అర్ధ రూపాయి ఫైన్ వేశారట! తెచ్చుకోవడానికి పోయాడు.

అధి : వాడొక యూస్‌లెస్ ఫెలో!— (రామంతో) మిస్టర్ రామం. నువ్వు వెంటనే రమణయ్య యింటికివెళ్ళి అతనిని నిమిషాలమీద తీసుకురా! రాకపోతే మాట దక్కదని చెప్పు. (రామం కుడివైపు నిష్క్రమిస్తాడు. అధికారి లోనికి వెడుతూ

కొండయ్యతో) అలా చూస్తావేం? పని తొందరగా కానియ్.

కొండ : (వినయంతో) చిత్తం! చిత్తం! (అధికారి వెళ్ళిపోతాడు. అతను పోతున్న వైపు చూస్తూ) పీడ మొహం సంతకు వెళ్ళి! చంపేస్తున్నాడు. (కూర్చుని పుస్తకం పెన్సిలు పట్టుకొని) నాలుగూ తొమ్మిదీ, పదిమూడూ ఎనిమిదీ, ఇరవై ఒకటీ, ఇరవై ఒకటీ ఆరూ, ఇరవై ఏడు.

(ఎడమవైపునుంచి నీలకంఠం తిరిగి వస్తాడు.)

నీల : రమణయ్యగారు యింకా రాలేదా?

కొండ : (తల పైకెత్తి వినయంతో) రండి. కూర్చోండి. మమ్మల్ని బొత్తిగా మరిచి పోతున్నారు.

నీల : (కుర్చీలో కూర్చుంటూ) మిమ్మల్ని మరిచి పోవడమే. ఎంతమాట!

కొండ : తమరు వచ్చిన పనేమిటో సెలవిచ్చారు కాదు.

నీల : ఆ వ్యవహారం రమణయ్యగారికి ఒక్కరికే తెలుసు.

కొండ : రమణయ్య లేకపోతే యీ ఆఫీసు పడు కుంటుందనా తమ అభిప్రాయం? మాకు యీ వ్యవహారాలు కాస్తో కూస్తో తెలుసు. చెప్పండి.

నీల : (ప్రసంగం మార్చుతూ) అలా హోటలుకు వెళ్ళివద్దాం ఒకసారికి పైకి రండి.

కొండ : యిప్పుడు నేను ఆఫీసు విడిచి పైకివస్తే మా యజమాని వూరుకోడు. రెండూ అవ నివ్వండి. వినదాం.

నీల : నేను రెండు గంటలకుముందే వెళ్ళిపోవాలి. నాకు వేరేపని వుంది.

కొండ : మీరు వచ్చిన పనేమిటో నాకు చెప్పండి. రమణయ్య ఈ వేళకు రాడు.

నీల : ఏం సెలవు పెట్టాడా?

కొండ : అతని కొడుకుకు సుస్తీగావుంది.

నీల : అరెరె! యిప్పుడు నా పని ఆడ్డిపోతుందే! (రహస్యంగా) మాడండి కొండయ్యగారు! యిది చాలా రహస్యమైన విషయం. మీ మామూలు విషయంలో నేనేమీ విన కొడను.

(కొండయ్య ముందుకువంగి శ్రద్ధగా వింటూ వుంటాడు. సరిగా ఆ సమయంలో కుడి వైపునుంచి రమణయ్య, అతని వెనుక రామం వస్తారు. రమణయ్య హుషారుగా, హడావుగా వున్నాడు. అతని ముఖంలో కర్కశత్వం కనిపిస్తోంది. అతుకుల చొక్కా మాసిన పంచె కట్టుకున్నాడు.)

రమ : (ప్రవేశిస్తూ) ఏమండోయ్ నీలకంఠంగారూ! ఎప్పుడు రావడం?

నీల : అంతా కలిపి పావుగంట అవుతుందిలెండి. మీరు యిక రారనే అనుకుంటున్నాం— మీ అబ్బాయికి కొంచెం కులాసాగా వుందా.?

రమ : లేదండి. డాక్టరుకోసం వెడుతుంటే ఆఫీసు నుంచి కబురు వచ్చింది. వెంటనే యిలా వచ్చాను.

నీల : పాపం! కాఫీ అయినా తాగారో లేదో! రండి! అలా హోటలుకు వెళ్ళివద్దాం.

రమ : (రామంతో) దొరగారు నన్ను అడిగితే కాఫీకి పోయాననని చెప్పు.

(నీలకంఠం, రమణయ్య కుడివైపున నిష్క్రమిస్తారు.)

కొండ : (ద్వేషంతో వాళ్లు పోతున్నవైపు చూస్తూ) డబ్బుకోసం గడ్డి కరిచే వెధవ!

రామం : ఏమండి? ఏమయ్యింది?

కొండ : (రామంకేసి తిరిగి) నువ్వు శనిలాగ వాడిని యిప్పుడే తీసుకువచ్చావేమిరా? చేతికి అందిన మనిషిని గద్దలా తన్నుకుపోయాడు.

రామం : అదేమిటో నాకేం తెలుసు?

కొండ : యిప్పుడు నీకేం తెలుస్తుంది! పెళ్లాము, నలుగురు పిల్లలు వున్న తరవాత తెలుస్తుంది.

రామం : (పరిస్థితి అర్థంచేసుకొని) అటువంటి డబ్బుకు ఆశించకూడదండి.

కొండ : (కోపంతో) చాలు చాల్లే! చెప్పావు నీతి కబుర్లు.

అధి : (ప్రవేశించి కొండయ్యతో) నిన్న నువ్వు రాసిన కాగితాలు అన్నీ కలిసి డజనుకూడా లేవు. యీ విధంగా పని జరిగితే ఆఫీసు గంగలో కలిసినట్లే. ఏం? మాట్లాడవేం?

కొండ : (వినయంతో) నిన్న ఓల్డు రికార్డ్సు వెతకడంతోనే టైమంతా అయిపోయిందిసార్.

అధి : అటువంటి జవాబులు నాకు పనికిరావు. నాకు కావలసిందల్లా పని. కాగితాలు ముందు పెట్టుకొని కునుకుపాట్లు పడుతూ కూర్చుందామనుకుంటున్నావా? జాగ్రత్త!

కొండ : లేదుసార్! ఒళ్లు దాచుకోకుండా పని చేస్తున్నాం సార్!

అధి : ఏం చేస్తున్నావ్ పని? నేను ప్రతినిముషం వచ్చి సుద్రాలను తోలుతున్నట్లుతోలుతుంటే ఆ నాలుగు కాగితాలయినా రాసి తగలేస్తున్నారు. మీరు చేస్తున్నపనికి మీ కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్సులో గుడ్ రిమార్కులన్న ఎంతమాత్రం రావు.

కొండ : (భయంతో) తమరలా సెలవిస్తే మేం బ్రతకలేం సార్—తమకు ప్రథమకోపంగాని తమవంటి ధర్మప్రభువులు అటువంటిఅధర్మపు పనికి ఎన్నడూ ఒడిగట్టరు.

అధి : (రామంతో) రమణయ్య ఏడీ? రానన్నాడా?

రామం : వచ్చారండి. వచ్చి యిప్పుడే కాఫీకి వెళ్ళారండి.

అధి : (కోపంతో) కాఫీకివెళ్ళడం, హాస్పిటలుకు వెళ్ళడం, తువరానికి వెళ్ళడం—అన్ని పనులూ ఆఫీసుటైంలోనే! అతను రాగానే నన్ను కలుసుకోమని చెప్పు—మిస్టర్ కొండయ్యా! యు డోంట్ స్లీప్ ఓవర్ దట్ ఎకౌంట్.

కొండ : చిత్తం! చిత్తం! చురుగ్గానే అవుతోందండి. (అధికారి లోనికి వెళ్లిపోతూవుండగా) యిటువంటివాళ్లే—రేప్రొద్దున్న రిటైర్ అయిన తరవాత—మతిపోయి రోడ్లమీద తిరిగేది.

రామం : యివేళ దొరగారు మరీ కోపంగావున్నారు.

కొండ : అదంతా వట్టి 'పోజ్' రా నాయనా! యివి కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు, రానేరోజులు. యీ నాలుగురోజులు అలా—మిరపకాయలు తిన్నకోడిలా—అరుస్తూ వుంటాడు.

రామం : యివేళ ఉదయం 8 గంటలకే ఆఫీసుకువచ్చి కూర్చున్నారు.

కొండ : కూర్చుంటారు! కూర్చుంటారు! యింటిదగ్గర వుంటే ఎవరిమీదా కర్రపెత్తనం చెయ్యడానికి వీలుండదు. అందుకే తిట్టేనోరు తిరిగేకాలు తిన్నగా వుండవంటారు.

(కుడివైపునుంచి రమణయ్య వస్తాడు. కొండయ్య అతనికేసి అనూయతో చూస్తాడు)

రామం : (రమణయ్యతో) మిమ్మల్ని దొరగారు పిలిచారు.

రమ : (నిర్లక్ష్యంగా) పిలిస్తే పిలవనీ! కొంపమునిగ లేదు లే!

(నుగ్గురూ ఎవరిస్థానాలలో వారు కూర్చుని పని చేస్తూవుంటారు.)

కొండ : (రమణయ్యతో) పిల్లవాడికి జబ్బుగా వున్నప్పుడు ఆఫీసుకు ఎందుకు వచ్చావ్?

రమ : పర్మిషన్ రిఫ్యూజ్ చేస్తే రాక ఏం చేస్తాను? యిప్పటికే నామీద కత్తినూరి వుంచాడు మహానుభావుడు.

కొండ : పాపం! వెనుకదిక్కులేనివాడవు, జబ్బుతో వున్న కుర్రవాణ్ణి వదిలిపెట్టి రావడం మంచిది కాదు.

రమ : ఆ విషయం నాకుమాత్రం తెలియదంటావా కొండయ్యా!

కొండ : ఎలాగైనా నీగుండె రాయివంటిది. నీ స్థితిలో నేను వుంటే ఒకక్షణం కూడా యిక్కడ కూర్చోలేను.

అధి : [(ప్రవేశించి)మిస్టర్ రమణయ్యా!వాటీజ్ ది మేటర్ విత్ యూ? బడ్జెట్‌కు డ్యూ డేట్ ఎప్పుడో జ్ఞాపకం వుందా?

రమ : వుందండి బడ్జెట్ వెళ్ళవలిసినరోజు రేపే.

అధి : (కోపంతో) తెలిసివుండి కూడా లేట్ పర్మిషన్ పెట్టావన్నమాట!

రమ : మా కుర్రాడికి చాలా ప్రమాదంగా వుంది సార్. రాత్రి అంతా నిద్రలేదు. డాక్టర్ కోసం వెడుతున్న సమయంలో మీ కబురు అందింది. వెంటనే యిలా వచ్చాను.

అధి : మన యింటి వ్యవహారాలు చర్చించుకోనవలసిన చోటు ఆఫీసు కాదు. ముందు పని కానియ్.

రమ : ఒకసారి డాక్టరు దగ్గరకు వెళ్ళివచ్చి పని ప్రారంభిస్తానండి.

అధి : అదేమీ లాభం లేదు. పని పూర్తి అయ్యే వరకూ నువ్వు యిక్కడినుంచి కదలడానికి వీల్లేదు.

రమ : (కోపంతో) అంటే మీ ఉద్దేశం?

అధి : (కోపంతో) రాత్రి పన్నెండు గంటలయినా సరే—యీరోజు పని పూర్తి కావాలి. యీసారి అర్థమయ్యిందా?

రమ : యీపని యీరోజు కాదు గదా మరో రెండు రోజుల వరకూ ఎంతమాత్రం పూర్తి కాదు.

అధి : నేను నీ మీద తీవ్రమైన చర్య తీసుకోవలసి వుంటుంది.

రమ : (నిర్లక్ష్యంగా) మీకు తోచిన చర్య తీసుకోవచ్చును.

అధి : మరోకసారి ఆలోచించి చూసుకో! నీ చర్యకు తర్వాత నీవు పశ్చాత్తాపం పడవలసి వుంటుంది.

రమ : యిక ఆలోచించవలసిన పనిలేదు. సాయంత్రం ఐదుగంటల వరకూ అయినంత పని అవుతుంది. పని అయినా కాకపోయినా ఆతర్వాత ఒక క్షణం కూడా నేను ఆఫీసులో వుండను.

అధి : (కోపావేశంతో) 'ఇన్‌సబార్డినేషన్' క్రింద నేను నీ మీద ఛార్జెస్ ఫ్రేం చేస్తున్నాను.

రమ : థేంక్ యూ! (కూర్చుంటాడు.)
(అధికారి ఆవేశంతో లోనికి వెళ్ళిపోతాడు. యింతవరకూ ఆశ్చర్యంతో అంతా వింటున్న కొండయ్య, రామం కూర్చుంటారు.)

కొండ : ఆ తొందరే నిన్ను పాడుచేస్తోందోయ్ రమణయ్యా!

రమ : మరేం చెయ్యమంటావు?

కొండ : ఇరవైయేళ్ళ సర్వీసువున్నా నీకింకా అధికారుల తత్త్వం తెలియలేదు. దొరగారు ఏం చెప్పినా వినయంతో చిత్తం. 'చిత్తం' అని అంగీకరించాలి. ఆ తరవాత పని పూర్తి కాకపోయినా మరేం ఫర్వాలేదు.

రమ : అలా చెప్పడం నాకు చేత కాదు. పని అయితే అవుతుందంటాను. అవకపోతే అవదని ఖచ్చితంగా చెబుతాను.

కొండ : అదే నీ కొంపకూ తేస్తోంది!

(ముగ్గురూ ఎవరి పనులలో వాళ్ళు నిమగ్నులవుతారు. కుడివైపునుంచి చిట్టి వస్తాడు. వయస్సు 7 సంవత్సరాలు. చిరిగిన చొక్కా తొడుక్కున్నాడు. జుత్తు చిందరవందరగా వుంది. లోతుకు పోయిన కళ్లనుంచి అశ్రువులు రాలుతున్నై.)

చిట్టి : (రోదన స్వరంతో) నాన్నా!

రమ : (తలయెత్తి కొడుకును చూచి చకితుడై) ఏంరా చిట్టీ? ఏం? ఏమయ్యింది?

చిట్టి : (వెక్కి వెక్కి యేడుస్తూ) అమ్మ నిన్ను రమ్మంది. తమ్ముడు...చచ్చి...పోయాడు.

కొండ : రామ! రామ! ఎంత పని జరిగింది!

రామం : (మౌనంగా బాధతో చూస్తాడు)

రమ : (చిట్టిని ఎత్తుకొని కన్నీళ్లు తుడుస్తూ) ఏడవకురా చిట్టి! నీకంటే తమ్ముడు అదృష్టవంతుడు. అందుకే వాడికి యీ కష్టాలనుంచి వెంటనే విముక్తి కలిగింది.

(తన మెడ కౌగలించుకుని ఏడుస్తున్న కొడుకును సముదాయిస్తూ రమణయ్య కుడివైపు నిష్క్రమిస్తాడు. కొండయ్య, రామం వాళ్లవైపు జాలిగా చూస్తూ వుంటారు— తెర)

* * * *

# రంగము 2

* * స్థలం : ఒక గది. సమయం : రాత్రి 8 గంటలు.

గదిగోడలు నల్లగా మాసివున్నాయి. ఒకవైపు రెండు పెట్టెలు, మరోవైపు ఒక మంచం వున్నాయి. కుడివైపున వున్న ద్వారం వీథిలోనికి దారిని సూచిస్తూవుంది. ఆ గదిలోని ప్రతి వస్తువు ఆ కుటుంబపు దారిద్ర్యాన్ని తెలియచేస్తోంది. మంచంమీద చిట్టి పడుకునివున్నాడు. లీలావతి వాడిని జోకొడుతోంది. అయినా వాడు నిద్రపోవడంలేదు. క్షణక్షణానికి లేచి కూర్చుని ఏవో ప్రశ్నలు వేస్తు న్నాడు.

చిట్టి : నాకు చారలచొక్కా ఎప్పుడు కొంటా వమ్మా నాన్న?

లీలావతి : ఒకటవ తేదీని కొంటారులే.

చిట్టి : ప్రసాద్ తొడుక్కున్నాడు చూశావూ— అలాంటి చొక్కా నాక్కావాలి.

లీలా : అలాగే కొందాం. పడుకో.

చిట్టి : (పడుకొని తిరిగి లేచి కూర్చుని) అమ్మా! ప్రసాద్‌కి ఎన్ని చొక్కాలున్నా యనుకు న్నావ్? అన్నీ సిల్కుచొక్కాలే! నాన్న నాకు ఒకటీ మంచిచొక్కా కుట్టించడు.

లీలా : (నిట్టూర్చి) వాళ్ళలా మనకు మంచి బట్టలు ఎలా వస్తాయి? ప్రసాద్ డబ్బున్నవాడు.

చిట్టి : లేదమ్మా! వాడిదగ్గర నాలాగే ఎప్పుడూ డబ్బులుండవమ్మా.

లీలా : ఆఅబ్బాయిదగ్గర వుండకపోయినా వాళ్ళింట్లో డబ్బు వుంటుంది.

చిట్టి : మరి మన యింట్లో డబ్బు ఎందుకు వుండ దమ్మా?

లీలా : (నిట్టూర్చి) అది మన రాత!

చిట్టి : (అమాయకంగా తల్లికేసి చూసి పడుకుం టాడు. క్షణం ఆగి మళ్ళీ లేచి) వాళ్ళ యింట్లో వున్న రేడియో ఎంత బాగా పాడు తుందనుకున్నావ్ అమ్మా! (ఏడుపు ముఖంతో) మొన్న నేను వాళ్ళ తలుపుదగ్గర వుండుని పాట వింటుంటే ప్రకాశం నన్ను అవతలకు తోసేశాడమ్మా!

లీలా : పోనీలే. యిక యెప్పుడూ అక్కడికి వెళ్లకు.

చిట్టి : (జాలిగా) మరి మంచి పాటలు వచ్చినప్పుడు వినవద్దూ?

లీలా : వీథిలో నిలబడి విను. లోనికి వెళ్ళకు.

చిట్టి : నాన్నని మనకో రేడియో కొనమను అమ్మా! ఎంచక్కా నువ్వుకూడా వినొచ్చు పాటలు. —అమ్మా! ఆ పాటలు వింటేనేం ఆకలి కూడా వెయ్యదమ్మా!

లీలా : యీ పూట వంట చెయ్యడానికే యింటిలో బియ్యం లేవు. రేడియోకి డబ్బు ఎక్కడి నుంచి వస్తుందమ్మా! నువ్వు పెద్దవాడవైనతర వాత మంచి ఉద్యోగం చేసి డబ్బు సంపా దించి కొనుక్కుందువుగాని.

చిట్టి : మరి నాన్న ఉద్యోగం చేస్తున్నాడుకదా! మనకు డబ్బెందుకు లేదమ్మా?

లీలా : అన్ని ఉద్యోగాలకి డబ్బు రాదు. చేసే ఉద్యోగాన్నిబట్టి డబ్బు యిస్తారు. పెద్ద ఉద్యోగం అయితే ఎక్కువ డబ్బు ఇస్తారు. చిన్న ఉద్యోగం అయితే కొంచెమే డబ్బి స్తారు.

చిట్టి : మనకు డబ్బు చాలడంలేదని వాళ్లకి నాన్న ఎందుకు చెప్పడమ్మా?

లీలా : మనం చెబితే ఎవరూ వినరు. పైగా కోప్పడ తారు.

చిట్టి : మొన్న నాన్న చూపించిన సినిమాలో కూలి వాళ్ళు కూలి ఎక్కువ కావాలని కేకలు వేశారు. మరి వాళ్ళకి కూలి ఎక్కువ యిచ్చారేం?

లీలా : సినిమాలలో అలా చూపిస్తారమ్మా!

చిట్టి : అమ్మా! రాజకుమారుడు గుర్రంమీద వెళ్తు తున్న సినిమా వచ్చిందమ్మా! నన్ను తీసు కెళ్ళవ్?

లీలా : డబ్బులు లేవుకదూ మనదగ్గర.

చిట్టి : దాచాలని వుందమ్మా.

లీలా : నాన్నగారితో చెబుతానులే నిన్నూ తీసుకు వెళ్ళమని.

చిట్టి : (సంతోషంతో) నాన్నతో వెళితే బిస్కట్లు కూడా కొనిపెడతాడు.

లీలా : యిక నిద్రపో. చాలా రాత్రి అయ్యింది.

చిట్టి : ఊహూఁ! నేను నాన్న వచ్చేవరకూ నిద్ర పోను. యివేళ నాన్న నాకు అణా యిస్తా నన్నాడు.

లీలా : అణా ఎందుకు నీకు?

చిట్టి : పెన్సిలుకి క్లిప్పు కొనుక్కుంటాను.

లీలా : యిప్పటికి నిద్రపో బాబూ! నీ నాన్న గారిని ఉదయం అడిగవచ్చు.

చిట్టి : అమ్మా! మరేమో మా స్కూల్లో అందరూ నన్నుచూసి నవ్వుతారమ్మా. చిరిగిపోయిన చొక్కా, చిరిగిపోయిన లాగూ, చిరిగి పోయిన పుస్తకం, విరిగిపోయిన పలక — నాలాగ ఎవ్వరికీ వుండవమ్మా. మరి నాకు మంచి బట్టలు, మంచి పుస్తకాలు ఎప్పుడు కొంటావమ్మా?

లీలా : మంచిరోజులు వచ్చినతర్వాత.

చిట్టి : యింకా మంచిరోజులు ఎప్పుడొస్తాయమ్మా? నిన్న రాము నా చొక్కా చిరుగులో వేలుపెట్టి నవ్వుతూ చింపేశాడమ్మా! అప్పుడు నేను ఏడ్చాను. అప్పుడేం మా మేష్టారు వాడిని ఒక్కటి కొట్టారు.

లీలా : నువ్వు ఎవరితోనూ పోట్లాడకు బాబూ! నిన్ను ఎవరైనా ఏమైనా అంటే మీ మేష్టారుతో చెప్పు.

చిట్టి : మేష్టారు ఎంతో మంచివారనుకున్నావ్ అమ్మా! — మరి మేష్టారు కూడా చిరిగి పోయిన బట్టలు కట్టుకుంటారేమమ్మా?

లీలా : ఆయనకు కూడా డబ్బు లేదు.

చిట్టి : మరి జీతం యివ్వరూ?

లీలా : యిచ్చినా చాలదు.

చిట్టి : మరేం మేష్టారుగారి అబ్బాయి శంకరం కూడా తమ్ముడులాగే చచ్చిపోయాడమ్మా.

లీలా : (కన్నీళ్లు తుడుచుకుంటూ) పాపం!

చిట్టి : (ఆలోచిస్తూ) చచ్చిపోయినవాళ్లు ఏమౌతారమ్మా?

లీలా : (ఏడుపు ఆపుకుంటూ) పరలోకం వెళ తారు బాబూ.

చిట్టి : అక్కడ ఎవరుంటారమ్మా!

లీలా : దేవుడు.

చిట్టి : పోనీ! తమ్ముడు అక్కడైనా నవ్వుకుంటూ ఆడుకుంటూ వుంటాడా?

లీలా : (ఏడుపును ఆపుకోలేక వెక్కివెక్కి ఏడుస్తూ) ఆడుకుంటాడు బాబూ! వాడు అక్కడ సంతోషంగా వుంటాడు.

చిట్టి : అయితే నేనుకూడా చచ్చిపోతానమ్మా!

లీలా : (చిట్టిని కౌగలించుకొని ఏడుస్తూ) తప్పు బాబూ! అటువంటి మాటలనకూడదు.

చిట్టి : (తల్లిముఖాన్ని రెండుచేతులతో నిమురుతూ) ఏడవకమ్మా! నువ్వు ఏడుస్తుంటే నాకు భయం వేస్తుంది.

లీలా : (కన్నీళ్లు పైటచెంగుతో తుడుచుకుంటూ) ఏడవను బాబూ! యిక నిద్రపో. మాట్లాడకు. (ఆమె తిరిగి కుట్టుకుంటుంది. చిట్టి కొన్ని క్షణాలకు నిద్రపోతాడు. కుడివైపునుంచి రామం వస్తాడు. అతని ముఖంలో విషాద రేఖలు కనిపిస్తూ వున్నాయి.)

లీలా : (లేచి) ఏం బాబూ!

రామం : రఘునాథయ్యగారు యింకా యింటికి రాలేదా?

లీలా : లేదు. ఎందుకో ఈ వేళ ఆలస్యమయ్యింది.

రామం : ఆయన యీరోజు చాలా కోపంగా వున్నారు. మీరు కొంచెం కనిపెట్టుకు చూడండి.

లీలా : ఆఫీసులో ఏమైనా పేచీవచ్చిందా?

రామం : కల్లాకపటం లేకుండా మాట్లాడేవాళ్లు ఆఫీసులలో పనికిరారమ్మా. అటువంటివాళ్ల బ్రతుకు దినదినగండంతో గడుస్తూ వుంటుంది.

లీలా : ఏం బాబూ? అలా అంటున్నావ్? ఏం జరిగింది?

రామం : (నిట్టూర్చి) ఏది జరగకూడదో అదే జరిగింది.

లీలా : (భయంతో) ఆయన కేమీ ప్రమాదం జరగ లేదు కదా?

రామం : (విషాదస్వరంతో) ఆయనకు ఒక్కడికే కాదమ్మా! మీ కుటుంబానికంతకూ ప్రమాద కలిగింది. (బాధతో) ఆయనకు ఉద్యోగం పోయింది.

లీలా : (నిరాశా నిస్పృహలతో) నేను అనుమానించినట్లే జరిగింది. యీ శిక్ష ఆయనకు కాదు. నాకూ...(గద్గదస్వరంతో) యింకా కళ్లు తెరవని యీ పసిపాపకు.

రామం : అమ్మా! మిమ్మల్ని చూస్తుంటే నా హృదయం కరిగిపోతోంది. రమణయ్యగారు ఆవేశంతో యింకా యే ఘోరానికి ఒడి కట్టుకుంటారో అని జడిసి నేను మీదగ్గరకు వచ్చాను.

లీలా : ఆయనమీద వున్న నేరాలన్నీ ఋజువయ్యాయా?

రామం : కొన్ని నేరాలు ఆయనే స్వయంగా ఒప్పుకున్నారు.

లీలా : ఒకప్పుడు ఆయన ఎంతో మంచివారు. కాని రానురాను ఎందుకో వారిలో యిటువంటి మార్పు కలిగింది.

రామం : నాకు యిప్పుడిప్పుడే అర్థమౌతోందమ్మా! అవి ఆఫీసులు కావు. సన్మార్గులను దుర్మార్గులుగా మార్చే కార్ఖానాలు.

లీలా : (విచారంతో) యిక మా కేమి దిక్కు భగవంతుడా!

రామం : ప్రపంచంలో అటువంటి మనుషులు వుంటారన్న విషయం—నాకు మా అధికారిని చూసే వరకూ—తెలియదు.

లీలా : లోపం మనలో వున్నప్పుడు ఒకరిని నిందించినందువల్ల ఏం ప్రయోజనం బాబూ?

రామం . రమణయ్యగారి కంటే ఎక్కువ ఘోరాలు చేసిన వాళ్లు ఆఫీసులో సురక్షితంగా వున్నారమ్మా. నేరం చేసి తప్పించుకోగల నేర్పు వాళ్లకు వుంది. అటువంటివాళ్ళే అధికారుల ఆదరాభిమానాలకు పాత్రులయ్యేది.

లీలా : (నిట్టూర్పి) నువ్వింకా చిన్నవాడవు బాబూ! నిప్పువున్న కర్ర తప్పకుండా కాలుతుంది.

రామం : ఒక్కరు కూడా రమణయ్యగారికి అనుకూలంగా సాక్ష్యం చెప్పలేదు.

లీలా : వున్నది వున్నట్టు చెప్పివుంటారు.

రామం : అందరూ కేవలం నిజమే చెప్పలేదమ్మా! నిజంతోపాటు అబద్ధాన్ని కూడా జోడించి చెప్పారు. పతనమైన మనిషిని యింకా క్రిందికి దిగలాగడానికి చూశారు. కాని ఒక్క మనిషికూడా చేయూత యివ్వడానికి ప్రయత్నించలేదు.

లీలా : మన రోజులు సరిగాలేనప్పుడు అన్నీ అలా కలిసి వస్తూవుంటాయి బాబూ!

రామం : వస్తానమ్మా. యీ దుర్వార్త నేనే స్వయంగా చెప్పవలసివచ్చినందుకు విచారిస్తున్నాను.

(రామం కుడివైపు నిష్క్రమిస్తాడు. లీలావతి మంచం మీద కూర్చుని కన్నీళ్లు తుడుచుకుంటూ ఆలోచిస్తోంది. కొన్ని క్షణాలు నిశ్శబ్దం. కుడివైపునుంచి కొండయ్య వస్తాడు.)

కొండ : రమణయ్యా! రమణయ్యా! (పిలుస్తాడు.)

లీలా : (లేచి ఎదురువెళ్లి) యింకా రాలేదండి.

కొండ : యింకా రాలేదూ? కొంప తీసి దొరగారు వెళ్ళే దారి కాయలేదు కదా?

లీలా : దారి కాయడం ఎందుకు?

కొండ : మీ ఆయనకు తెలివితేటలు లేవమ్మాయి. వట్టి దుడుకుమనిషి. నోటికి ఏ మాటవస్తే ఆ మాట అనేస్తాడు. అందులోను మా అధికారి వున్నాడు చూశావూ! వాడు పరమ దుర్మార్గుడంటే నమ్మ. వాడేం చెప్పినా సరే గంగిరెద్దులా బుర్ర వూపుతూ "చిత్తం చిత్తం" అంటే చాలు. వూరుకుంటాడు. ఎదురుజవాబు చెప్పావో! కొంప మునిగిందన్నమాటే. పగ అంటే పగా! త్రాచు పగ!

లీలా : మావంటి దరిద్రులపై పగ పట్టినందువల్ల ఆయనకు వచ్చేది ఏముంటుందిబాబూ?

కొండ : (కోపంతో) ఏంవుంటుంది? పోయే అప్పుడు యింత పాపం తలకు చుట్టుకు పోతాడు.

లీలా : నేరం చేసినవాళ్ళను కుటుంబసహితంగా నాశనం చేసే కంటే మరో దారి లేదా? నేరస్థులను మంచివాళ్లుగా మార్చేందుకు యింతకంటే మంచి మార్గం లేదా?

కొండ : మన న్యాయశాస్త్రం చెడ్డవాడిని మరింత చెడ్డవాడిగా చెయ్యడానికే ఉపయోగపడుతుం దమ్మాయ్.

లీలా : చేతిలో చిల్లి గవ్వ లేదు. యీ పూట వంట చెయ్యలేదు. వారు జీతం అందుకొని తొందరగా యింటికి వస్తారనుకున్నాను. యింతవరకూ రాలేదు. పిల్లవాడు ఆకలితో నిద్రపోయాడు. ఉన్న ఒక పిల్లవాడికి కూడా ముద్దూముచ్చటాతీర్చలేకపోతున్నాం. సరిగదా కడుపునిండా తిండి కూడా పెట్టలేకపోతున్నాం. చంటివాడికి మందు కొనలేక చేతులారా చంపుకున్నాం. వాడు పోయి వారంరోజులైనా కాలేదు. నా కన్నులలో కన్నీరు యింకా ఆరకముందే యీ దుర్వార్త వినవలసివచ్చింది. (ఆమె కనులు అశ్రుపూరితాలయ్యాయి.)

కొండ : విచారించకు అమ్మాయ్. కేసు తిరిగి విచారణ చెయ్యమని మీ ఆయనచేత అపీలుచేయిస్తాను. అపీలులో మనమే గెలువవచ్చు. రమణయ్య రాగానే నేను వచ్చినట్లు చెప్పమ్మాయ్. రేపు మళ్లా వస్తాను.

(కొండయ్య కుడివైపు నిష్క్రమిస్తాడు.)

లీలా : (చేతులు జోడించి) యీ వడిసముద్రనుంచి దరికి చేరగలనా భగవంతుడా?

(మంచంమీద కూర్చుని చిట్టి ముఖంలోకి చూస్తోంది. పైటకొంగుతో కళ్లు తుడుచుకుంటోంది. భయంకరమైన నిశ్శబ్దం—నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ బూటుచప్పుడు వినిపిస్తుంది. మరో క్షణంలో రమణయ్య ప్రవేశిస్తాడు. జుత్తు చిందరవందరగా వుంది. ముఖం గంభీరంగా వుంది. నలిగిపోయిన బూటు, నల్లకోటు, అతుకులపంచె—అతనిలోని మానసిక అస్థిరత్వాన్ని సూచిస్తున్నై. చేతిలో ఒక పొట్లం వుంది.)

రమ : వంటచేశావా?

లీలా : లేదు.

రమ : అవును. నాకు తెలుసు. (చేతిలోని పొట్లం ఆమెకుయిచ్చి) యిదిగో యీ రొట్టె వాడికి తినిపించు.

లీలా : యిప్పుడే నిద్రపోయాడు.

రమ : ఆకలితోనే నిద్రపోయాడా? మంచిదే. అలాగే నిద్రపోనియ్. (కోటుతీసి పెట్టెమీద వేస్తాడు. కోటు విప్పగానే చిరిగి పీలికలైన చొక్కా కనిపిస్తుంది. చంచల మనస్కుడై గదిలో తిరుగుతూ) నేను హోటలులో కడుపునింపుకు వచ్చాను. నువ్వు ఆరొట్టె తిని మంచినీళ్ళు తాగి పడుకో?

లీలా : (లేచి పిల్లవాడిని భుజంమీద వేసుకొని) నా మాటకేం? యిక మీరు నిద్రపోండి. (మూలనువున్న చాపతీసి కుడివైపువున్న ద్వారానికి అడ్డంగా పరుస్తుంది. ఆచాప మీద చిట్టిని పరుండబెట్టి తనుకూడా పడుకుంటుంది. భర్త యింకా తిరుగుతూవుండడం చూసి లేస్తుంది.) పడుకోరేం? (అతనిని సమీపించి) రోజంతా తిరిగి అలసిపోయారు. మీకళ్లు ఎంత ఎర్రగా వున్నాయో నిద్రపోండి.

రమ : నా గురించి ఎందుకు ఆలోచిస్తావ్ నువ్వు? నిద్ర,—(వికటంగా నవ్వి) అలాగే నిద్రపోతాను. యిక నువ్వుపోయి పడుకో.

(గత్యంతరం లేక మంచంమీద పడుకుంటాడు. లీలావతి చిట్టిని దగ్గరకు తీసుకొని చాపమీద పడుకుంటుంది. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడుస్తాయి. రమణయ్య నెమ్మదిగా మంచం మీదినుంచి లేస్తాడు. కదలకుండా పడుకున్న భార్యను కొడుకును పరిశీలించి చూస్తాడు. లైటువత్తి తగ్గించి ఆలోచిస్తూ చిత్తచాంచల్యంతో గదిలో తిరుగుతున్నాడు. క్షణ క్షణం అతని ముఖంలో కర్కశత్వం పేరుకుపోతోంది. కోపంతో

పళ్లు బిగిస్తున్నాడు. పిడికిలిబిగించి వూవు తున్నాడు. చివరికి ఒక నిశ్చయానికి వచ్చి నట్లు కోటుజేబులోనుంచి తాళంచెవి తీశాడు. పెట్టె తెరిచాడు. ఒకక్షణం పెతి కాడు. తరవాత అతనిచెయ్యి కత్తితో సహితం పైకివచ్చింది. కత్తి పట్టుకొని గది మధ్యకు వచ్చాడు. తన చిరిగిన చొక్కా నుంచి ఒకగుడ్డ పేలికచింపాడు. దానితో కత్తి జాగ్రత్తగా తుడుస్తూ మంచంమీద కూర్చున్నాడు. మధ్య మధ్య బెదురుచూపు లతో భార్యవైపే చూస్తున్నాడు. భద్రంగా కత్తి నడుములో దాచుకున్నాడు. మెల్ల దిగా లేచి ముందుకు నడిచాడు. ద్వారానికి అడ్డుగావున్న భార్యను తప్పుకోవడానికి ప్రయత్నిస్తూ అడుగు ముందుకు వేశాడు. లీలావతి ఆకస్మికంగా లేచి కూర్చుంది.)

లీలా : (కోపంతో) వీక్కడికి బయలుదేరారు ?

రమ : (గంభీరస్వరంతో) ప్రపంచంమీదికి.

లీలా : ఎందుకు ?

రమ : దొంగతనం, దోపిడి, హత్య—ఏదైనా సరే చేసి డబ్బు సంపాదించేందుకు.

లీలా : (కోపంతో) ముందు లోనికిపదండి.

(అతను గదిమధ్యకు వస్తాడు. అతనిని సమీ పించి) యిప్పుడు అనుభవిస్తున్న కష్టాలు మీకు తృప్తి కలిగించలేదా ?

రమ : ప్రస్తుతం మన కష్టాలు ప్రతిఫలించినై. రోజంతా ఆలోచించిన తరవాతే నేను ఒక నిశ్చయానికి వచ్చాను.

లీలా : నన్నూ యీ బిడ్డనూ దిక్కులేనివాళ్ళను చేద్దామనుకుంటున్నారా ?

రమ : (వికటంగా నవ్వి) నీకు యింకా అసలు విషయం తెలియదు. తెలిస్తే నువ్విలామాట్లా డవు.—నేను యిప్పుడు జీవచ్ఛవాన్ని—రెక్కలు తెగిన పక్షిని.—నేను జీవించినందు వల్ల ప్రయోజనం లేదు.

లీలా : నాకు అంతా తెలుసు. మీకు ఉద్యోగం పోయిన విషయం నాకు తెలుసు.

రమ : (ఆవేశంతో) తెలిసికూడా చలనం లేకుండా ఎలా వుండగలిగావ్ నువ్వు ?

లీలా : బాధపడి మనసు పాడుచేసుకున్నందు వల్ల ఏమైనా ప్రయోజనం వుందా ? ఆవేశపడి ఒకరిని హతమార్చినందువల్ల కలిగే ఫలిత మేమిటి ? దానివల్ల మనస్థితి ఏమైనా బాగు పడుతుందా ? లేక మరింత అథఃపతనమై పోతామా ?

రమ : తరవాత కలిగే పరిణామాలకోసం వూహించు కొని కలవరపడే శక్తి యిప్పుడు నాలో లేదు.— బుద్ధిగా బ్రతికినందువల్ల కలిగిన ఫలితాన్ని మనం చూశాం. ఆ జీవితానికి నేను విసిగి పోయాను. డొంకలు, ముళ్లూ వున్నదారిని కూడా వెళ్లి చూస్తాను.

లీలా : మీరు తిరిగి రాగలరా ?

రమ : రాలేకపోవచ్చు. కాని ఒక వేళ వస్తే అప్పటి నుంచి మన జీవిత గమనమే మారిపోతుంది. యీ రాత్రితో నా జీవితం అటో యిటో తేలిపోవాలి.—మనకు పెళ్లి అయి ఎంతకాల మయ్యింది ?

లీలా : గతాన్ని తవ్వుకోవడం ఎందుకు యిప్పుడు ?

రమ : నీకు పెళ్లికాకపూర్వం నువ్వు ఎప్పుడైనా వూహించావా ? యిటువంటి దుర్భరమైన జీవితం గడపవలసివుంటుందని నువ్వెప్పుడైనా వూహించావా ? (ఆమె సజలనేత్రాలతో మౌనంగా అతనికేసి చూస్తుంది.) లేదు. నువ్వు కలలోకూడా వూహించి వుండవు. మధురస్వప్నాలు కంటూ గృహస్థజీవితంలో అడుగుపెట్టాం. మన కోరికలు యీ నాటికీ తీరకుండా—దూరాన్నుంచి ఎండమావుల వలె—యిప్పటికీ భ్రమింప చేస్తున్నై. ఒకటీ రెండూ కాదు. పధ్నాలుగు సంవత్సరాలు నిరంతర యాతనతో బరువుగా జీవితాన్ని యీడ్చుకువచ్చాం. చివరకు ఆ యాతనా మయ జీవితానికికూడా అంతరాయంవచ్చింది. మనం చేతులారా మన శిశువును దరిద్ర రాక్ష సికి బలియిచ్చాం. లేశమైనా సుఖమూ శాంతీ దొరుకుతాయేమోనని ఆశతో ఉన్న

తాళియాలను దిగదిడిచి పతనమయ్యాను. ఆనందం మచ్చుకైనా కనిపించలేదు. యిక యీ క్షణంలో తుదినిశ్చయానికి వచ్చాను. పరమాంసాన్ని తినే పులికంటె క్రూరుడైన ఆ దురాత్ముణ్ణి హత్యచేస్తాను. యీ రాత్రే ఏకు అంతిష్ఠుల మేడ కొల్లగొడతాను. రేపటి సూర్యోదయసమయానికి నేను కోటీశ్వరుడనైనా అవాలి లేదా యినుపచువ్వల మధ్యనైనా యిరుక్కోవాలి. యిక యీ కుష్క జీవితాన్ని సాగించినందువల్ల ప్రయోజనం లేదు. లే, నా దారికి అడ్డురాకు.

(తొందరగా ముందుకు వెడతాడు)

లీలా : (అతనిని పట్టుకొని) వద్దు. నా మాట వినండి. తొందరపడకండి. మమ్మల్ని దిక్కులేని వాళ్లను చెయ్యకండి.

చిట్టి : (కేకలకు లేచి తండ్రికి ఎదురు వచ్చి) నాన్నా! (బిగ్గరగా ఏడుస్తాడు.)

లీలా : (ఆవేశంతో) చూడండి. యీ పసివాడిని చూడండి. మీరు వెళ్ళిపోతే యేమౌతుంది? వీడూ నేనూ రోడ్లమీద తిరుగుతూ ముష్టెత్తుకోవాలి. అది మీకు యిష్టమేనా?

రమ : (కొడుకును కౌగలించుకొని అశ్రుపూరిత నయనాలతో) ఏడవకు నాయనా! ఏడవకు! నువ్వు మా జీవితాలకు ఆశాజ్యోతివి. నిన్ను చూస్తూ ఏవో కలలుకంటూ యీ దుర్భర జీవితాన్ని సాగిస్తున్నాం. ఏడవకు బాబూ. ఏడవకు.

చిట్టి : నాకు కలొచ్చింది నాన్నా! నిన్ను ఎవరో తీసుకుపోతున్నారట! — నువ్వు మరేం — ఎక్కడికీ వెళ్లకు నాన్నా. వెళితేనేం నిన్ను మళ్లీ వాళ్లు పట్టుకుంటారు. నువ్వు నా దగ్గరే పడుకో!

రమ : (కన్నీటితో) వెళ్ళను బాబూ! వెళ్లనులే!

లీలా : (పెట్టె తెరిచి ఒక భరిణె తీసుకు వచ్చి అతనికి యిస్తూ) యిదిగో! యిది అమ్మి వేప్పు డబ్బు తీసుకురండి. దానితో జీవనయాత్రకు కొత్త మార్గాన్ని వెతుకుదాం.

రమ : (తెరచిచూసి నిశ్చేష్టుడై) నా చేతులారా కట్టిన యీ మంగళసూత్రాన్ని అమ్మమంటావా?

లీలా : (తలవంచి) అంతకంటే అమ్మకు నేందుకు మరొకటి యేదీ మనదగ్గర లేదు.

రమ : (మంగళ సూత్రాలను చేతితో పైకెత్తి ఉన్మత్తునివలె) లేత హృదయాలలో ఆశలను చిగురింపచేసి నూతన జీవితాలకు మార్గాన్ని చూపే మంగళసూత్రం యీనాడు .............. (మాటాడలేక ముఖాన్ని రెండుచేతులతోనూ కప్పుకుంటాడు. చిట్టి తండ్రి మెడను కౌగలించుకొని వున్నాడు. సజలనేత్రాలతో లీలావతి భర్తనూ కొడుకునూ చూస్తూ వుండగా — తెర.)



# కలగూరగంప

## ఆముక్తమాల్యద
### కతిపయ పద్యార్థ పరిశీలనము

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

ఆంధ్ర పంచకావ్యములలో నొక్కటిగ నెన్నెక్కిన యాముక్తమాల్యద కింతవఱకు రుచి వ్యాఖ్యాసమేతముగ శ్రీ వావిళ్లవారి ప్రతియు, సంజీవనీవ్యాఖ్యానముతోఁ గూడిన వేదమువారి ప్రతియు ముద్రితములై యున్నవి. ఈ రెంటను నచేక పూర్వ వ్యాఖ్యానములఁ బర్యాలోచించి రచింపఁబడినవే. ఎందఱు పండితు లెంత శోధించిన నెప్పటికప్పుడేవో నూతన భావములు గోచరించుటయుఁ గొన్నిట నభిప్రాయభేదములు గలుగుటయు సత్కావ్యమున కావశ్యక లక్షణము. ప్రకృత మాముక్తమాల్యద యందలి కొన్ని పద్యములకుఁ బూర్వవ్యాఖ్యానములఁ జూపి యందలి కొన్ని యౌచిత్యానౌచిత్యములఁ బరిశీలించి నాకుఁదోచిన యభిప్రాయము లిట వెల్లడింతును. విజ్ఞులగు విమర్శకులు బాగోగులు వివరింతురుగాక !

౧. "తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగేను
దెలుఁగు వల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందు దెలుఁగు లెస్స."

(ఆము. పీఠి. ౧౫.)

ఇది శ్రీ కృష్ణదేవరాయనికిఁ గలలోఁ గానవై యంధ్రజలజాక్షుఁడు తెలుఁగున నొక కావ్యము రచింపుమని చెప్పిన వాక్యము. ప్రస్తుత మిందలి "తెలుఁగొకండ" యనుదాని యర్థము విచారణీయము. దీనికిఁ బూర్వవ్యాఖ్యాతకర్తయగు గట్టుపల్లి శ్రీనివాసకవి యిట్లు వ్రాసినాఁడు. "తెలుఁగొకండె = తెలుఁగొకటే. కావ్యమొక్కటే తెలుఁగా ? సకలమున్ను తెలుఁగనుట." ఈవ్యాఖ్యానము సరసముగాఁ గన్పట్టదు. ఏల యన, నింతవఱకు నంధ్రజలజాక్షుఁడు చెప్పినది దేశమును గుఱించి, తన్ను గుఱించియు, సకలము తెలుఁగే యనఁగా మిగిలినవన్నియు నేవి తెలుఁగను సంశయము కలుగును. కావుననే, ముద్రితగ్రంథముల నీ వ్యాఖ్యానము గ్రహింపఁబడలేదు.

వావిళ్ల ప్రతియందు దీనికి "తెలుఁగొక్కటియే. (అనగా నది వింతగాదనుట)" యని యర్థము వ్రాసి "తెలుగు క్రొత్తదిగా"దని భావము వ్రాయఁబడినది. ఇదియు నంత సమంజసముగా నెన్నఁదగదు. ఈ పదముల కీ యర్థమును జాలదూరమైపోయినది.

ఇఁక, వేదము వారి సంజీవనీవ్యాఖ్యలో "తెలుఁగొ + కండ = తెలుఁగొకండ" యని విడదీయఁబడి కండ యనఁగాఁ బులకండ మని యర్థము చెప్పఁబడినది. కాని, 'తెలుఁగులెస్స' యని తుదిపాదములో స్పష్టముగాఁ జెప్పుచు నిటఁ దెలుఁగు పులకండ మన వలెనా ?

ఈ పరిస్థితిలో రెండుమూఁడర్థము లిటఁ బరిశీలింపవలసి యున్నది. 'ఎల్ల నృపులు గొలువ నెఱుఁగవే తెలుఁగొకండ బాసాడి' యని యన్వయించి 'వివిధభాషలు మాట్లాడురాజులు గల కొలువులో నొక్క తెలుఁగే మాటాడి దేశభాషలలోఁ దెలుఁగు లెస్సయని యెఱుఁగవా' యని యనవచ్చునేమో. దీని వలన శ్రీకృష్ణదేవరాయల యాస్థానభాష తెలుఁగే యనవచ్చును. అగుటచేతనే నాఁడు తెలుఁగంత సర్వతోముఖాభివృద్ధిఁ గాంచుటకు హేతువైనది. ఇట్లున్నచో వేదము వారి వ్యాఖ్యానమున కృష్ణరాయలు "ఆడియే తెలుఁగు నేర్చినగాని చదివి కాదనుటయుఁ, దెలుఁగాతని యింటిభాష కాదనియు వ్రాసిన వ్రాతయు నిరాధారములగును. కృష్ణరాయల

యింటిభాష తెలుఁగుగాక మాట్లాడియే యాతఁ డాం
గ్రమును జేర్చియున్నచో నాతని కవిత్వ మిక్లిష్టమెన్నఁ
టికి నుండజాలదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ఈ సందర్భమున నిచ్చట పాఠభేదము లేమైనఁ గలవేమోయని యాంధ్ర సాహిత్య పరిషత్తున గల తాళపత్త్రి ప్రతులు పరిశీలింప రెండు మూడు ప్రతులలో 'తెలుఁగొకొంప' యనియు, నొకట 'తెలుఁగుకొండ' 'తెలుఁగొకండో' యనియుఁ గానవచ్చినవి. దీనినిబట్టి దేశము తెలుఁగు, నేను తెలుఁగు వల్లభుఁడను, ఇకఁ దెలుఁగా ? కొంపెంతె గలదు. అనఁగాఁ దెలుఁగు మిక్కిలి ఘనమైన దని చెప్పవచ్చును. విశేషణార్థమున గొండయనఁగా ఘనము, గొప్పది యనుట కనేక ప్రయోగములు గలవు. "...దాని, మాట లెల్లను గొండగా మదిఁ దలంచి" విప్రనారాయణ చరిత్రము ౪.౭౭ను, సూర్యరాయాంధ్రనిఘంటువు నిందులకుఁ బ్రమాణములు.

మఱియుఁ దెలుఁగుకొంప యెల్లనృపులు నని షష్ఠీతత్పురుషమున "తెలుఁగుదేశపు రాజు లందఱును గొలుచుచుండఁగాఁ దెలుఁగున భాషించుచుఁ దెలుఁగే దేశభాషల లెస్సయని యెఱుఁగవా" యని చెప్పఁ జనును.

కావున, దీనిలోఁ బాఠభేదము గ్రహింపని పక్షమున 'యెల్లనృపులు గొలువ నెఱుఁగవే (తెలుఁగొకంప) బాసాడి' యను నన్వయమునఁ దెలుఁగే యాస్థానభాషగా మాటాడి యనుట సమంజసమని నా తలంపు. లేదా, పాఠాంతరము గ్రహించి 'తెలుఁగొకొండ' యని దిద్ది తెలుఁ గనంతమైనది, మిక్కిలి ఘనమని చెప్పుట రెండవపక్షము. పిమ్మట నింకొకటి స్ఫురించినది. "ఎఱుంగవే యనుటఁ దత్తద్భాషల నెఱుం గవే యనుట" యని తిరువాలి వచనమున (౧౦) వివరింపఁ బడినది. ఈ కారణముచేఁ బైవానికన్న నిట్లు చెప్పుటే యుక్తము. తెలుఁగొకండె—ఒక్క తెలుఁగుభాషే కాక ఎల్లనృపులు గొలువన్, బాసాడి (వారి వారి భాషలలో) సంభాషించి, ఎఱుఁగవే (ఆయాభాషలను) ఎఱుఁగుదువు కదా! దేశభాషలందుఁ దెలుఁగే లెస్స గదా! ఇట్లు చెప్పినచో పూర్వాపరవిరోధము లుండవని నా యభిప్రాయము.

౨. ఇందు కలావతంస మతఁ
జేతతే నేతరిగాఁ డరిం బ్రజల్
కందఁగొనం డొరుం డొరుత
లన్ వినిపించినమాట డెందమున్
జెంద నుదంబు దక్కఁ జెవఁ
జేయఁడొరున్ వినతాస్యుఁడౌనతిం
పం దనుఁ బందనుం గొఱతె
వల్కఁడు శూరత దాన మిచ్చియున్. (౨.౪౦

ఇందు "ఒరుం డొరుతలన్ వినిపించిన మాట డెందమున్ జెంద నుదంబు దక్కఁ జెవఁజేయఁ డొరున్" అనుచోట పాఠమే వావిళ్ల, వేదము ప్రతులయందుఁ గలదు. 'ఒరుండొరుతలన్' అన్నప్పుడు మూడవ 'ఒరుఁ' డనవసరమగును. కావున, 'నిట 'ఒరుండొరదలన్' అను పాఠము గ్రహించి 'ఒకఁడు పైశున్యముచేఁ జెప్పిన మాట విని పరునిఁ జెవఁజేయఁ' డనుట యుక్తము. ఈ పాఠమే శబ్దరత్నాకరము, సూర్యరాయాంధ్ర నిఘంటువు గ్రహించినవి. మఱియుఁ బల ప్రతులయం దీ పాఠమే కానవచ్చినది. మఱియు నిందు నాల్గవపాదమున "పందనుం గొఱంతవల్కఁడు శూరత దానమిచ్చి యున్" అను వావిళ్ల పాఠ మంత బాగుగా లేదు. శౌర్యమునకు దానమునకు నిట సంబంధము లేదు. అని వేదము ప్రతి పాఠము. ఇదియు సమంజసముగా లేదు. ఏలన, శౌర్యమునందు దాను బందనుమించియునని చెప్పవలసి వచ్చును. లేనినాఁడు మించుపదము వ్యర్థమగును. ఇచట "శూరతఁ బ్రాణ మిచ్చియున్" అనుపాఠము గలదు. ఇది యుచితముగాఁ దోచుచున్నది. ఏలన శౌర్యము ప్రాణమును లక్ష్యముగా గొననీయదు. పందకుఁ బ్రాణమే తీపి. దానిని నతఁడు విడువఁజాలఁడు. కావున, నిట శౌర్యమునఁ దాను బ్రాణమిచ్చు సాహసికుఁడైనను నిందింపఁ డనుట యుక్తము.

౩ "చక్రస్తన ప్రకాశమునకు శైవలంపుఁ
గొంగిడి గొనకొన గోళ్ళ గొఱఁగి," (౪అ.౧౦౩.)

దీనికి వావిళ్ల ప్రతియందు "గొనకొన = అవ్యక్తముగా, కోళ్ళన్ = జలకుక్కుటములను," అని వ్యాఖ్యానము గలదు. వేదమువారి ప్రతియందు "గొన గొనన్ = గొనగొనయని యవ్యక్తముగా, కోళ్ళన్ = జొల్లికోళ్లను పేరి నీటికోళ్ళచేత" అని యున్నది. "గొన" కాని "గొనగొన" గాని నిఘంటువుల నెక్కడను లేదు. మఱియుఁ, గోడి యన కుక్కుటమే కాని జలకుక్కుటము కాదు. ఇచట నుండవలసినది

కొనకొనఁగోడి యని. కొనకొనఁగోడి యనగా బొల్లికోడి, జలకుక్కుట మని యర్థము. ఇందులకు ప్రయోగములు:—

"కొనకొనంగోడి యేట్రింత కొంక నక్క
నమలి యీ నాలుగిటి దర్శనంబు లెస్స."
(క్రీడాభిరామము. ౪౭-౨)

"...కొనకొనఁగోడి పికిలి,
మొదలుగాఁగల్గు పులుగుల గుములఁ గ్రుచ్చి
తెచ్చి........."
(సుదక్షిణాపరిణయము. ౩-౧౯౪)

కావున, నిట "...కొనకొనఁగోళ్లి గోణఁగి"యని యుండవలెను.

క. ఘుణగణ విహరణఁ జిలికిన
మణి దనువునఁ దొరఁగు మసిసమానములై ద
ర్పణ నిభ నభమునఁ బరిణతి
శణకణ హారిణములు పాండుజలదము లొలసెన్.
(౪-౧౪౧)

ఇందు "హారిణములు=తెల్లనైన, పాండు జలదములు=తెల్లని మేఘములు" అని వావిళ్ల వేదము ప్రతులఁ గలదు, తెల్లనివగు తెల్ల మేఘములనుట పునరుక్తియు నర్థహీనమును. ఏలయన, "హరిణః పాండురః పాండుః" అని యమరము. ఇదట 'జలద శకలము లొలసెన్" అను చక్కని పాఠమున్నది. ఇట్లయినచో బునరుక్తిదోషము పోవుటేకాక శరత్కాలమున మేఘశకలములే కాని మేఘములు కానరాని కారణమున నెంతయు సరసముగా నుండును.

"జాలుజాలు కని నెత్తురు వెలి
కుబుకుచు రొదసేయ నణిలి రొండపిన యార్పుల్
వలువ విడి గ్రుడ్ల వణఁకుచుఁ
గొలప్రాణములోడఁ దన్నుకొను నమెమ్ముదవున్"
(౩-౨౩)

ఇందు "జాలుజాలుకని" యన్నది వేదము ప్రతి పాఠము. దాని కాధారము శబ్దరత్నాకరము. ఈ రెంటిని బట్టి సూర్యరాయాంధ్ర నిఘంటువు నీ పాఠమే గ్రహించినది. ఈ పదమున కాధారము మృగ్యము. "జాలుకు" అను రూపమునకుఁ గాని దాని యామ్రేడిత మైన జాలుకుజాలుకు, జాలుజాలుకు మొదలగు నే రూపమునకుఁ గాని ప్రయోగాంతర మిచ్చుటను లేదు. "చులు చులుకన" అను వావిళ్ల ముద్రణపాఠము తాళపత్ర ప్రతులలో నున్నది. ఆ పాఠమే సమంజసము. ఏలన, చులుకునకు గల యామ్రేడిత రూపములు చులుకుచులుకు, చులుచులుకు మొదలగు నన్ని రూపములకు నుదాహరణము లున్నవి. అర్థమును సరసము సుగమమును. చులుచులుకన=(గాయము) చులుకు చులుకుమని బాధించుచుండగా ననుటయే యుక్తము. తీవ్రముగ జూచుటయందును బాధకలుగుటయందును నను ననుకరణ మిది యనుట కొకటి రెండుదాహరణములు చూపుదును.

"చులుకు చులుకున దిశకంతుఁ జూచి యార, తౌరి పౌలస్త్య నాతోడనా రణంబు, చేయవచ్చితి మంచిది..." (ఉత్తరరామాయణము. ౪-౬౨)

"తమకుఁ బాస్వర తరణికాంతములు పొదల, యాకుసందులఁ బొడసూప లంటి ప్రక్క, చులు చులుకుమన్న మెకములు గరలి బెదరి, గొరిజ దాఁటుగఁ బరుగెత్తి తిరిగి చూచె."(కువలయాశ్వచరిత్రము. ౧-౯౫)

దీనికి రూపాంతరము చులుకుచులుక్కను గలదు.

"చులుకుచులుక్కనన్ దనువు సోఁకెడు వెన్నెల కాలుకొల్పుచున్, చలువఁగఁ జొచ్చె."
(చంద్రభాను చరిత్రము. ౪-౧౧౦)

పైఁజూపిన ప్రయోగాంతరములచేతను, నర్థసామ్యముచేతను 'చులుచులుకన' అను పాఠమే యుక్తము. ఇదే వావిళ్లవారి పాఠమును.

ఈవిధముగా నెంతటి పండితులు పరిశీలించి వ్యాఖ్యానించినను, నిర్దోషికములగు నపపాఠములు నర్థదోషములు గలవనుటకు స్థాలీపులాకన్యాయముగా నాకుఁ గానవైన బహువిషయములనుండి కొన్నిటి నే వివరించితిని. అట్లని పూర్వవ్యాఖ్యాతల సామర్థ్యము గొఱతవల్లనటకాదు. ఆముక్తమాల్యదవంటి సత్కావ్యము లెంత పరిశీలించినను విస్మృతవిషయములు నూహాతీతములగు భావము లెన్నియో యుండక మానవనియు నవి యెప్పటికిని బయలుపడుచునే యుండుననియుఁ దెలిసినఁ జాలును.

# చంపూ భారతము

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

సంస్కృతంలో చంపూభారతమొకటి ఉన్నది. ఈ చంపూ గ్రంథాలు దాదాపు మన ప్రబంధాల లాగే కన్పించటంచేత తెనుగు కవులకు, చంపువులకు సంబంధం కొంత ఉన్నదనటానికి వీలుపడవచ్చు. తెనుగు ప్రబంధాలలో ఒకే ఒక్క ఆశ్వాసంలో అనేక వృత్తాలు నడవటం మామూలు. చంపువులలో కూడా ఇంతే. ప్రాచీన సంస్కృతకవులు మాత్రం ఆశ్వాసాంతంలోనే వృత్తాన్ని మార్చేవారు.

ఈ చంపూభారతాన్ని రచించిన అనంతభట్టు ఆంధ్రుడై ఉంటాడనటానికి ఆధారాలు దొరుకుతున్నవి. తెనుగు పద్యాలలో యతి, ప్రాస అనేవి ఉంటవి. చంపూ భారతంలోని ఈ క్రింది శ్లోకాన్ని గమనించండి. —

'క్షోణీపతౌ యదకలం ప్రతికృష్టసారం
తూణీ ముఖే పతితపాణిసఖాంకురేఽస్మిన్
ఏణీదృశాని తరలై ర్వ్యసువాజలానాం
వేణీమివాక్షికలసై ర్వ్యపి నే విశేషః' (1-17)

ఇక్కడ నాలుగుపాదాలలోను ప్రాస స్పష్టంగా ఉన్నది. ఇలాంటి శ్లోకాలు 50 పైగా ఇందులో దొరుకుతున్నవి. కొన్నిచోట్ల రెండేసి రెండు పాదాలకు ప్రాస కన్పిస్తుంది. ఉదాహరణకు—

'తిగ్మేన బాణేన జఘాన తస్మిన్
యుగ్మే వరాణాం మహిపః పురూంసమ్
వాతాయురాకార మసౌమహార్తైః
జాతాయు రంతః సహసాల లంబే.' (1-27)

ఇక్కడ మొదటి రెండు పాదాలకు ఒక ప్రాస, చివరి రెంటికి వేరొక ప్రాస ఉన్నవి. మూడుపాదాలలో 1-68 శ్లోకంలో ప్రాస కన్పిస్తుంది. ఈ ప్రాస తెలుగు కవులకు, కన్నడ కవులకు కూడా విశిష్టంగా ఉన్నది. అందుచేత అనంతభట్టు కన్నడుడనేవారున్నారు. కాని మిగిలిన అంశాలను గమనిస్తే ఈ వాదం నిలవదు.

అర్జునుడు తీర్థయాత్రకు వెళ్తూ సముద్రతీరం వెంబడి పోయినాడు.

'అస్త్రా ప్రచారాదతి వర్తమాన
మాలోక మాలోక మసౌ పయోధిమ్
తటేన గచ్ఛం స్తరసా పరేశో
చోళీ హరిద్రాసురభీన్ సమీరాన్' (3-34)

అని ఉన్నది. సముద్రాన్ని చూస్తూ, తీరం వెంబడి వెళ్తూ ఉంటే ముఖాద్యవయవాలపైన ఆడస్త్రీలు అలంకరించుకొన్న సౌరభాలు అర్జునునికి తగిలినవి. ఈ తీరంలో ఎత్తైన నారికేళవృక్షాలు కన్పించినవి (3-36) తీరభూములలో పండే వస్తువులు పేర్కొనబడినవి (3-41) ఇలా గోకర్ణక్షేత్రాన్ని (3-46), ప్రభాసతీర్థాన్ని (3-48) సేవించినాడు. తూర్పు తీరంలో ఉండే కవి ఈ పుణ్యస్థలాలను గురించి వ్రాయడంకద్దు.

తెలుగుదేశంలో వివాహసమయంలో భాషికాలు కట్టారు. ఈ భాషికాల ప్రశంస.

"పట్టాభిషేక మఖిలప్రకృతి ఫాలభేశే" (1.83) అనే పంక్తిలో కన్పిస్తుంది. నొసట కట్టారు ఈ భాషికాలను. తెలుగువారి పిండివంట ఒకటికూడా ఈ చంపూ భారతంలో కన్పిస్తుంది.

'శష్కులీ రివ చదర్వ కృశానుః' (3. 123). అన్నాడు. శష్కులీ అంటే చక్రాకృతిగల ఒకభక్ష్యమని వ్యాఖ్య. కాని శష్కులీ శబ్దానికి చెవిరంధ్రమని అర్థము. ఈ చెవిరంధ్రంలాగా కన్పించే పిండివంటలో మనకు 'చేగోడీ' లున్నవి. చేగోడీలను సంస్కృతీకరించినకవి ఆంధ్రుడు కాడనటం సాహస మాత్రమే.

రెండవసర్గలో ఒక విచిత్రమైన శ్లోకము కన్పిస్తుంది.

'తాటంకే తరలమణిప్రభాతరంగే
తన్వంగ్యా ముఖ మభిత స్తదా వ్యభాతామ్
మూర్తత్వం ప్రకట ముపేత్య జాగరూకే
వర్ణేద్వే నయనవిహారయో రివాంతే' (2-91.)

అని ఈ శ్లోకము. ప్రభావంతమై ప్రకాశించే తాటంకాలతోనున్న ఆ నారీముఖాన్ని రెండు అక్షరాలు కలసిఉన్న ఒక అక్షరంతో పోల్చినాడు. 'వర్ణేద్వే' అంటే ఠవర్ణమని వ్యాఖ్య. ఠ అనే అక్షరంలో వర్తులాకారంగా ఉండే ముఖాన్ని సూచించే 'ర' అనే అక్షరమున్నది. దీనితోబాటు దీనిపొట్టలో ఒక సున్నకూడా మన తెనుగు లిపిలో ఉన్నది. ఈమధ్య అనుస్వారంతో బాటు క్రిందకు వ్రేలాడే గీతను కూడా మనము చూపుతాము. అందుచేత తాటంకాలను ఠకారంతో పోల్చవలసివచ్చింది. ఇలా తెనుగులోని ఠకారాన్ని చూచేకవి తెలుగువాడే నని తప్పక చెప్పవచ్చును.

# గ్రంథవిమర్శనము

## స్వప్నభంగం

[కవిత]

సి. నారాయణరెడ్డి; ప్రకాశకులు. ఆదర్శ సాహిత్యమాల, నల్లకుంట, హైదరాబాదు. వెల 12 అణాలు.

ఇది అంతా ఒకే గేయచ్ఛందస్సులో నడిచిన ఖండకావ్యం.

మొదట కవి కేదో పిలుపులు వినవస్తాయి. అతనికి క్రమంగా రెక్కలు మొలుస్తాయి. విహాయసవీథిలో ఎగిరిపోతాడు.

ఆతరవాత అతను స్వర్గంలో ప్రవేశిస్తాడు. రంభ అతనికి అమృతపాత్ర అందిస్తుంది. కవి మెల్లి మెల్లిగా కళ్లు తెరిచి వాలుగుపైపులా పరకాయించి చూస్తాడు. అక్కడ అతనికి స్వర్గలోక మనోహర దృశ్యాలెన్నెన్నో గోచరిస్తాయి. అవ్వన్నీ చూచి ఆనందిస్తూ కవి అక్కడ కొన్ని అతిలోకసౌఖ్యాలనుభవిస్తాడు.

కాని క్రమక్రమంగా కొంతకాలానికా భోగాలన్నీ కవికి 'నాకము పేరి నరకముగా' గోచరిస్తాయి. తిరిగి అతను భూలోకానికి మరలిపోవాలని కోరుకుంటాడు. ఆ స్వర్గ బంధనాలన్నీ వదలించుకొని తిరిగి భూలోకంలో పడి కళ్లు తెరుస్తాడు. తన మనస్సులో ఏదో వికారం కలిగిందనీ దానివల్లనే అటువంటిస్వర్గానుభూతి కలిగిందనీ వాపోతాడు. చివరికీ క్రింది భాగంతో ఈఖండకావ్యం సమాప్తమైపోతుంది:

"మానవ సమాజమ్ము
మానసివమైన పతి
కల్గచో నేల స్వ
ర్గము లంచు మది నెంచి
స్వప్నభంగోత్థ వి
స్తార రోమాంచమ్ము
నటులై నిల్చితిని ఆ
ర్ధాంగిని కవుగిలించి."

ఈ కావ్యంలో ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ పెద్ద ఇతివృత్తమేమీ లేదు. స్వర్గమర్త్యలోకాల అనుభూతి రమణీయతల రహస్యాలు పరస్పర సాదృశ్యాలతో పరిపోల్చి తత్త్వార్థ నివేదనచేసి చూపే ఖండకావ్యమిది.

ఈ చిన్న పరిధిలో శ్రీ సి. నారాయణరెడ్డిగారు కృతకృత్యులైనారు. గతానుగతికంగా సాగిపోయే వృత్తాలు, కందాలు మొదలైనవాని జోలికి పోకుండా ఒక గేయచ్ఛందస్సు ఎన్నుకోవడంకూడా వీరి రచనకు చక్కని దోహదం కలిగించింది. వీరి గేయరచన నైపుణికి క్రిందిభాగ మొక ఉదాహరణం.

ఇది స్వర్గంలో అప్సరల నృత్యం వర్ణించేఘట్టం:

"రంభోర్వశులు నాట్య
రంగస్థలమునందు
కన్పడిరి మెరుపు తీ
గలు నిల్చెనో యనగ
ప్రాఙ్ముఖుండై సభా
పతి కూరుచునియుండె
ఎదుట ప్రౌఢాప్సరో
మదవతీద్వయ ముండె
ఇంద్రుని శిరమ్ము కొ
పింత కదలెనో లేదో!
కదలె రంభోర్వశుల
పద కింకిణీశితము
రంభోర్వశులు సమ శి
రస్కులై మఘవునకు
అంజలించిరి పతా
కాయతకరాబ్జలై!"

ఈ క్రింది భాగం వీరి స్వర్లోక సౌందర్య వర్ణన చాతురి కొక చక్కని తార్కాణం:

"చూపుమేరల వంత
సురఝురి తరగలించె
దిగజారెడు జిగా జి
లుగు పైట సవరించె!
నా పదమ్ముల కదలి
నవి యిసుక తిన్నియల
పైన నొక చిరుముద్ర
నైన పడనీకుండ
నా గుండియలు మ్రోగి
నవి వియద్ధుని వీచి
కలవోలె నిసుమంత
కలకలము లేకుండ!
కామధేను క్షీర
కాంతుల పిసాళించు
మిన్నేటి నీట కుసు
మించు పొందామరలు,
పొందామరల పెదవు
లందు చిందు మరంద
బిందువుల నందెడు మి
ళిందముల బృందములు,
నాలోని సౌందర్య
లోలతను ప్రశ్నించె
నా నవాలోకముల
నట్టె ఆకర్షించె!"

ఈ కావ్యాంతంలో మానవలోకసౌందర్యమే మహితమైనదని సూచించడంవల్ల 'స్వప్నభంగం' అనే శీర్షిక ఔచితీమాత్రం కుంటుపడింది. స్వర్లోక సౌందర్యమే మానవలోకసౌందర్యంకన్న మిన్న అనే వ్యంగ్యమే ఈశీర్షికవల్ల ధ్వనిస్తూంది. అంతేకాని మానవ జీవిత మహత్త్వ మీ శీర్షికలో ధ్వనించడంలేదు.

'స్వప్నభంగం' ఆధునిక కవితాభిమానులందరు పరిశీలింపవలసిన కావ్యం. —'శాస్త్రి'

## దేవకేరళము

[చంద్రకళానాడి]

కర్త: అచ్యుతకవి. ప్రకాశకులు: గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ. వెల: అయిదు రూపాయల పన్నెండు అణాలు.

ఈ గ్రంథం మొదటిభాగం మొదటి ఖండం 1951 లోనే వెలువడింది.

ప్రస్తుత గ్రంథం దానికి రెండో ఖండం మాత్రమే.- ఇక మున్ముందు మిగిలిన భాగం కూడా ప్రచురింపగలమని ప్రకాశకులు తెలియజేస్తున్నారు.

మన జ్యోతిశ్శాస్త్రసంప్రదాయాలలో చాలా పద్ధతు లున్నాయి. ప్రస్తుతం మన ఆంధ్రదేశంలో అంతటా వ్యవహారంలో ఉన్నది పారాశరీయ పద్ధతి. ఇంకా మనదేశంలో జైమినీయపద్ధతి ప్రకారం జోస్యాలు చెప్పేవారుకూడా కొంతమంది ఉన్నారు. ఇవిగాక ఇంకా మరికొన్ని పద్ధతులుకూడా ప్రచారంలో ఉన్నాయి.

దక్షిణాదిని ఇవి రెండు గాక ఇంకొక పద్ధతి కూడా బాగా ప్రచారంలో ఉంది. దీనినే నాడీ

పద్ధతి అంటారు. ఈ నాడీపద్ధతిలో ఆయా లగ్నాలు చాలా సూక్ష్మాంశాలుగా విభాగిస్తారు. అందుచేత ఈ నాడీగ్రంథాలలో సామాన్యంగా పద్యాల జాతకాలు వ్రాసిఉంటాయి. ఈ పద్ధతిప్రకారం వ్రాసిన నాడీగ్రంథాలు చాలా పెద్దవి. వీటిల్లో ఆయా వ్యక్తుల జననసమయాలనుబట్టి వారివారి జాతకాలు, ఫలితాలు గుర్తిస్తారు. ఆ గుర్తింపు జాగ్రత్తగా జరిగితే ఫలితాలు చాలా అద్భుతంగా ఉంటాయని నాడీ శాస్త్రజ్ఞులంటారు. ఈ నాడీగ్రంథాలాయా గ్రంథకర్తల నామధేయాలనుబట్టి వేరువేరు పేర్లతో పిలుస్తారు. భృగునాడి, కౌమారనాడి మొదలైన నాడీ గ్రంథాలు కొన్ని ప్రస్తుతం ప్రచారంలో ఉన్నాయి. వీటిలో చాలాభాగం అముద్రితంగానే ఉండిపోయాయి.

ప్రస్తుత దేవకేరళానికి చంద్రకళానాడి అని ఇంకొక పేరు.

దీనిలో మేషాదిలగ్నాలసూక్ష్మాంశలలో జన్మించిన వారి జాతక ఫలితాలున్నాయి.

ఆయా జాతకాలలో ఆయా గ్రహసమ్మేళనాలను బట్టి కొందరి జాతకులకు చాలా పాప ఫలితాలు కలుగుతూంటాయి. ఈ గ్రంథంలో ఆయా పాప ఫలితాలకు చేసుకోవలసిన ప్రాయశ్చిత్తాలు, దానధర్మాలు మొదలైనవికూడా ఉన్నాయి. ఇది ఈ చంద్రకళా నాడి ప్రత్యేకత.

నాడీగ్రంథాలింతవరకు ఆయావ్యక్తులతి రహస్యంగా గుప్తంగా సంరక్షించుకొంటూ వచ్చారు. అవి వారి వృత్తిధర్మానికి బాగా ఉపయోగించడమే దానికి కారణం.

ఇంతకుపూర్వం ఏవో ఒకటి రెండు నాడీ గ్రంథాలు మాత్రమే ముద్రణభాగ్యం పొంది కొంత వరకు ప్రచారంలోకి వచ్చాయి.

ఈవిధంగా మారుమూలలపడిఉన్న ప్రాచీన నాడీ గ్రంథాలు ప్రచురించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ప్రస్తుత చంద్రకళానాడి ప్రచురించిన చెన్నపురి ప్రాచ్యలిఖితగ్రంథశాలాధ్యక్షులు లభినంద నీయులు.

అయితే సంపాదకులు దీనిప్రచురణ రెండుభాగాలుగా విభాగించారని పేర్కొన్నాను. మొదటి భాగంలో మొదటిఖండం ప్రచురణ 1951 లో గింది. దాని రెండవభాగం ప్రచురించడానికి కించుమించుగా ఆరేళ్ళు పట్టింది. ఇక మిగిలిన భాగం ఎప్పుడు ప్రచురిస్తారో స్పష్టంగా తెలియదు. ఇంతటి ముఖ్య గ్రంథ ప్రచురణ ఇంత ఆలస్యం జరగడం న్యాయంకాదు. సంపాదకులు త్వరలోనే ఈ గ్రంథ ప్రచురణ ముగించగలరని ఆశిస్తున్నాను.

ఈ నాడీ పద్ధతిలో పరిశోధన జరపవలసిన ఆవశ్యకత చాలా వుంది. ఈ గ్రంథాలన్నీ అతిగుప్తంగా ఉండిపోవడమే దీనికి కారణం. చంద్రకళానాడి జ్యోతిర్విద్యాభిమానులకేగాక జ్యోతిశ్శాస్త్ర పరిశోధకులకు కూడా బాగా ఉపయోగించగలదు.

'శాస్త్రి'

## వేదం వెంకటరాయశాస్త్రి జన్మశతాబ్ది మహోత్సవ సంచిక

సంపాదకులు: ధరణికోట వెంకటసుబ్బయ్య. గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్య. ప్రకాశకులు: నెల్లూరు వర్ధమాన సమాజము. వెల: ఒక రూపాయి.

గత శతాబ్దిలో అజరామరులైన ఆంధ్ర విద్వత్కవులలో వేదం వెంకటరాయశాస్త్రి ప్రముఖులు.

వీరి నాటకాలు ఆంధ్రనాటకరంగాని కమూల్యమైన కానుకలైనాయి. నైషధాది గ్రంథాలకు చేసిన అమూల్యవ్యాఖ్య వీరులవలన అపరమల్లినాథులని విఖ్యాతి కెక్కారు.

వెంకటరాయశాస్త్రి ఆరోజుల్లో వ్యావహారిక వాదాని కడ్డకట్టగా నిలిచారు. కాని వారి రూపకాల లోని పాత్రోచిత వ్యావహారిక భాష నాటికీ నేటికీ శిష్టవ్యావహారికాని కొక వెలుగుబాటగా నిలిచింది. ఇక శాస్త్రిగారి భాషావిమర్శనలు, కావ్యవిమర్శనలు వీరి అపార పాండిత్యానికి నికషోపలాలు.

వారి వాఙ్మయవ్యాసంగం చాలావరకు నెల్లూరులోను, చెన్నపగరంలోను సాగింది.



వేదము వేంకటరాయశాస్త్రి 1853 డిసెంబరు 21 వ తేదీని జన్మించారు. మొన్న 1953 డిసెంబరు నాటికి వారి జన్మదిన శతాబ్ది పూర్తి అయింది.

ఈ సంచిక ఆ మహోత్సవం పురస్కరించుకొని చేసిన ప్రచురణ.

దీనిలో శ్రీ ఆల్లాడికృష్ణస్వామయ్య, శ్రీ పింగళి లక్ష్మీకాంతము, శ్రీ నేలటూరి వెంకటరమణయ్య, సుబ్బం వెంకటసుబ్రహ్మణ్యం మొదలైన ప్రముఖుల రచనలు ఉన్నాయి.

ఇంకా సంచిక చిట్టచివర చేర్చిన ఒక అనుబంధంలో వెంకటరాయశాస్త్రి రచనలు, జీవిత ఘట్టాలు, వాటికి సరియైన తేదీలు, ఇంకా కొన్ని జీవిత విశేషాలు కూడా చేర్చారు. వాఙ్మయ పరిశోధకుల కివి ఎంతైనా ఉపకరించగలవు.

వ్యాసాలలో శ్రీ నేలటూరి వెంకటరమణయ్య గారి 'వేదము వేంకటరాయశాస్త్రి నాటకకర్త, కవి' అనే వ్యాసము, శ్రీ వేదాల తిరువెంగళాచార్యులు గారు రచించిన 'శాస్త్రిగారి నాటకములు', సుబ్బం వెంకటసుబ్రహ్మణ్యంగారు రచించిన 'శాస్త్రిగారి కవనము' ప్రత్యేకంగా పేర్కొనదగిన రచనలు.

ఈ సంచికలో వేంకటరాయశాస్త్రి రచనా మాతృక చిత్రము, ఇంకా కొన్ని ఛాయాచిత్రాలు కూడా చేర్చారు. వేంకటరాయశాస్త్రి జన్మశతాబ్ది మహోత్సవం ఆంధ్రదేశంలో అంతటా జేగీయమానంగా జరపబడినది.

నెల్లూరు వర్ధమానపరిషత్తువారైనా ఆ మహోత్సవం జరిపించి, ఈ సంచిక ప్రకటించినందుల కభినందనీయులు.

వేంకటరాయశాస్త్రి జీవితవిశేషాలు, రచనావిశేషాలు తెలుసుకోదలిచినవారి కీసంచిక కొంతవరకు సహాయకారి కాగలదు.

శాస్త్రి

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.